# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణ పర్వమువఱకు గల సంపుటము | ... | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, బాలకాండము | | 2 | 8 |
| ,, అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| ,, అరణ్యకాండము | ... | 2 | 8 |
| తక్కిన కాండలు | (అచ్చగుచున్నవి) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| డిటో టీకతో | ... | 1 | 4 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| డిటో II భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుగు వచనము | ... | 5 | 0 |
| రత్నప్రభ, మూడంకముల చరిత్రాత్మకనాటకము | ... | 0 | 8 |
| సీత పెండ్లి, ఇతర నాటకములు | ... | 0 | 12 |

శ్రీరస్తు

# సంస్కృతనాటకకథలు

## తృతీయభాగము

విద్వాన్ శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిచే
విరచితము



చెన్నపురి:
వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్
వారిచేఁ బ్రకటితము

# జానకీపరిణయము

## ఉపోద్ఘాతము

జానకీపరిణయమను నీనాటకమును రామభద్రదీక్షితుండను దాక్షిణాత్యకవి రచియించెను. ఇతఁడు సుప్రసిద్ధకవిపండితుఁడగు శ్రీ నీలకంఠదీక్షితుల సమకాలికుఁడు; ఇతనిగురువు శ్రీబాలకృష్ణుఁడనియు, చొక్కనాథాధ్వరి కితఁ డనుయాయియనియు నాటకప్రస్తావనవలనఁ దెలియవచ్చుచున్నది.

ఈనాటకమున రామాయణకథ వివరింపఁబడినది. ప్రసన్నరాఘవమునందువలె నిందును సీతావివాహాంతకథ విపులముంగను, తక్కినది సంగ్రహముగను గలదు. ఇందలివిశేష మేమన మాయవేషములతో వచ్చి రాక్షసు లొనరించుమాయలు, అందువలనఁ గలిగెడిభ్రాంతులు నిందు చక్కఁగా వర్ణింపఁబడినవి. ఇయ్యది పింగళిసూరనార్యుని కళాపూర్ణోదయమునకు మార్గదర్శకము కానగును. షేక్స్పియరుకవి ఆంగ్లమున రచించిన "Comedy of Errors" అనునది దీని నన్నివిధముల పరిపోలుచున్నది. 'జానకీపరిణయము'ను నీలకంఠదీక్షితులు నిక్కలి కొనియాడెనన్నచో దీని ప్రాశస్త్యము వెల్లడియగుచునే యున్నది.

'జానకీపరిణయము'న, కవి నాటకానుగుణముగ రామాయణకథలో కొన్ని మార్పులను, కొన్ని చేర్పులను జేసియున్నాఁడు. జానకీదేవి స్వప్నమునందు శ్రీరామునిగాంచి వలపుగొనినట్లును, విశ్వామిత్రుఁడు సీతారాములవివాహార్థమై

యుయోధ్యకుఁ బోయినట్లును ఇందు వర్ణింపఁబడెను. ఇట్టిమార్పు లింకను గొన్ని కలవు; అవి పాత్రపోషణమునకును, రసావిష్కృతికిని ఎంతయు ననుగుణములు.

రాక్షసులు మాయావు లనియు, వా రెట్టినీచకార్యమున కయినను గడంగి, అమాయికులను మోసపుత్తు రనియు, అయినను తుదకు సత్యమే జయించు ననియు నిట్టి నీతు లెన్నియేని ఈనాటకమువలన గ్రహింపఁదగియున్నవి.

# పాత్రములు

## పురుషులు

రాముఁడు—దశరథునిపుత్త్రుఁడు - కథానాయకుఁడు.
దశరథుఁడు—రాముని తండ్రి
లక్ష్మణుఁడు, భరతుఁడు, శత్రుఘ్నుఁడు—దశరథునిపుత్త్రులు
జనకుఁడు—సీతతండ్రి - మిథిలాధిపతి - సీరధ్వజుఁడు.
పింగళుఁడు—రామునిమిత్రుఁడు.
రావణుఁడు—లంకాధిపతి, రాక్షసరాజు, మాయారాముఁడు, మాయాసన్న్యాసి
విభీషణుఁడు—రావణునితమ్ముఁడు
మహాపార్శ్వుఁడు—రావణునిమిత్రుఁడు
శుకుఁడు—రావణానుచరుఁడు
సారణుఁడు— ,, మాయాలక్ష్మణుఁడు
మారీచుఁడు— ,, కాశ్యపవేషధారి
కరాళుఁడు— ,, పింగళవేషధారి
విద్యుజ్జిహ్వుఁడు— ,, విశ్వామిత్రవేషధారి
శతానందుఁడు—జనకుని పురోహితుఁడు
సత్యవ్రతుఁడు—శతానందునిశిష్యుఁడు
విశ్వామిత్రుఁడు—కౌశికుఁడు - ఒకముని.
కాశ్యపుఁడు—
దేవవ్రతుఁడు— } విశ్వామిత్రునిశిష్యులు

జీమూతకుఁడు—జనకునింటనుండు కంచుకి

చిత్రాంగదుఁడు—ఒకగంధర్వుఁడు

సుబాహుఁడు—రావణుని యనుచరుఁడు

ఖరుఁడు— ,,

కబంధుఁడు— ,,

సంపాతి—పక్షిరాజు

జటాయువు—సంపాతితమ్ముఁడు

హనుమంతుఁడు—సుగ్రీవునిమంత్రి

సుగ్రీవుఁడు—కిష్కింధాధిపతి - వాలితమ్ముఁడు

స్త్రీలు

సీత—రామునిభార్య - కథానాయిక

తాటక—రాక్షసి, రావణుని యనుచర

శీలవతి, సుచరిత—సీతచెలికత్తెలు

అహల్య—గౌతమునిభార్య, శతానందునితల్లి

మాయావతి—విద్యుజ్జిహ్వునిభార్య

అనల—విభీషణుని పుత్త్రిక - సీతచెలికత్తె

శూర్పణఖ—రావణునిచెల్లెలు - పర్ణాదినీవేషధారిణి

మఱియు రాక్షసులు, మాయాసీత, మునులు, మ
భార్యలు మున్నగువారు వత్తురు.

# 7
# జానకీపరిణయము



అయోధ్యానగరము రాజధానిగా ఉత్తరకోసలదేశ మును దశరథుఁడను సూర్యవంశప్రభువు పాలించుచుండెను. చాలకాలముఁవఱ కతనికి సంతతి లేకుండెను; కాని ఋష్యశృంగ ముని యాదేశము ననుసరించి పుత్రకామేష్టిని జరిపి సంతానముఁ బడసెను. ఆరాజునకుఁ గౌసల్య యనుభార్యవలన రాముఁడును, కైకవలన భరతుఁడును, సుమిత్రవలన లక్ష్మణశత్రుఘ్నులును గలిగి దినదినప్రవర్ధమాను లగుచుండిరి. అందును రాముఁడు లోకోత్తరసౌందర్యము కలిగి పసితనముననే మహావీరుఁడని పేరుగాంచెను. ఆకాలమున మిథిలానగరమును జనకుఁడను నామాంతరముగల సీరధ్వజుఁడను రాజు పాలించుచుండెను. లంకాధిపతియు, రాక్షసరాజునగు రావణుఁ డతనికి బాల్యము నుండియు మిత్రుఁడు. దేవయజనసంభవ యగు 'సీత' అను కన్యను జనకుఁడు పెంచి పెద్దచేసెను. వివాహయోగ్యవయ స్కయు, లోకోత్తరసౌందర్యవతియు నయిన సీత యొక నాటిరాత్రి స్వప్నమునందు రాముని గాంచి, యాతనినే వివాహ మాడఁ దలఁచెను. రామునివంశప్రతిష్ఠ నెఱిఁగినజనకుఁడు దానికి మిగుల సంతోషించెను. కాని తనమిత్రుఁడగు రావణుఁడు కన్యార్థము తన్ను యాచించు ననెడి భయము జనకునకు లేక

పోలేదు. ఈవిషయమునుగూర్చి యతఁ డాలోచించుచుండఁగా విశ్వామిత్రముని తా నొనర్చు సవనముంజూచుటకు రావలసిన దని జనకునిఁ గోరుట తటస్థించెను. ఇదే తగినయుపాయ మని యెంచి జనకుఁడు తనతమ్ముఁడగు కుశధ్వజునిపై రాజ్యభారము నుంచి, యాగముఁ జూచునెపమున సీతతోఁగూడ కౌశికుని యాశ్రమమున కేఁగెను. మఱియు జనకుఁడు తనయభిమతమును, భీతిని విశ్వామిత్రున కెఱుకపఱచెను. విశ్వామిత్రుఁడును యాగమునెపమున దశరథుని, పుత్రులతోఁగూడఁ దనయాశ్రమమునకుఁ దీసికొనివచ్చుటకుఁ బోయెను. విశ్వామిత్రుని యాశ్రమముననే సీతారాములవివాహము జరుపుటకు నిశ్చయింపఁబడినది. ఈవృత్తాంతమంతయు సీతాదేవిని రావణునకయి యాచించుటకు మిథిలానగరమునకు రావణునిచేఁ బంపఁబడిన సారణునికిని, అంతకుమున్నే యచట నున్న శుకుఁడను వానికిని జరిగినసంభాషణమునుబట్టి తెలియుచున్నది. జనకుఁడొనర్చిన యీతంత్రమునకు సారణుఁ డచ్చెరువొందెను. అయినను, అతఁడు విశ్వామిత్రు నాశ్రమమునకుఁ బోయి జనకునిఁజూడఁ దలఁచెను. జనకునిఁ గాంచినను ప్రయోజన ముండదనియు, రావణునిసంపదఁ గనియు, మైత్రి ననుసరించియు జనకున కిష్టమున్నను, అతఁడు రామసక్తమానస యగు సీతకు వ్యతిరేకముగా నడువఁజాలఁడనియు, సీతమనస్సును రామునినుండి మరల్చుట యసాధ్య మనియు శుకుఁడు తెలియఁజేసెను. అంత సారణుఁడు కొంచెమునే పాలోచించి రావణునికి రాముని వేషమును, విద్యుజ్జిహ్వునికి విశ్వామిత్ర వేషమును వేయించి, విశ్వామిత్రుఁ డయోధ్యనుండి . వచ్చుటకు ముందే (వారిని)

జనకునియొద్దకుఁ దీసికొనివచ్చి తనపనిని నెఱవేర్పఁ దలఁచెను. ఆయుపాయమునకు శుకుఁడు మిగుల సంతసించి యయోధ్య నుండి విశ్వామిత్రాదులు రాకుండ నడ్డవలెనని తెలుపఁగా, 'ఆపని తాటకవలన సులభముగా నెఱవేఱఁగల' దని సార ణుఁడు పలికి, ఆమెం గలిసికొనుటకు తాను సిద్ధపడి, యీ వృత్తాంతమునంతటిని రావణునికిఁ దెలుపుటకు శుకుని బంపి వేసెను.

సారణుఁడు తలఁచినమాత్రముననే తాటక ప్రత్యక్ష యయ్యెను. ఆమె యెచ్చటికో ప్రయాణమగుచున్నట్లు గమ నించి 'ఎక్కడికి?' అని నమస్కారపూర్వకముగా సారణుఁ డడి గెను. దానికి తాటక 'వీరమాహేశ్వరుఁడగు మనమహారాజా నకు పరశురాముఁడు సుపరిచితుఁడు; ఆతఁడు తనదాయాదుఁ డగు విశ్వామిత్రుఁ డొనర్చుయాగమునకు రాక్షసులవలన ఆటం కము కలుగకుండఁ జూడవలెనని మన మహారాజును కోరి యున్నాఁడు; కావున యాగమునకు విఘ్నము నాచరింపవద్దని కుమారమారీచునితోఁ జెప్పుటకుఁ బోవుచున్నాను' అని బహులు చెప్పెను. అంత సారణుఁడు నవ్వి 'అమ్మా! చూడుము, విశ్వా మిత్రుఁ డెంత యుపాయశాలి! ఈయాగమునెపమున సీతారా ములకల్యాణమునకయి యీప్రయత్నము! మనమహారాజా సీతను వివాహమాడఁదలఁచియున్నాఁడు' అనెను. తాటక 'అట్లయిన నేనే యాసీతను బలాత్కారముగాఁ దెచ్చెదను' అని పలుకఁగా సారణుఁడు 'అట్లు చేయరాదు, సీత యిష్టములేనిదే బలాత్కరించి వివాహమాడుట రావణున కిష్టము కాదు; మఱియు నతఁడు శైవుఁడగు జనకునియెడ నన్యథా ప్రవర్తింప

నిష్టపడఁడు; స్త్రీలను బలాత్కరించినచో నాశము కలుగు నని యతనికి శాపము కలదు.' అని యామె నా ప్రయత్నమునుండి మళ్లించెను. మఱియుఁ దా నేర్పఱుపఁదలఁచిన పద్ధతిని తెలిపెను. దానికి తాటక సంతసించి విశ్వామిత్రుని, అతనితో వచ్చువారి నింగూడ, రాత్రి నిదురించునపుడు మాయచేసి చంపెద నని తెలుపుచుఁబోయెను. ఆమెకు సాయపడుటకు మారీచుఁడు మున్నగువారిని పంపుటకు సారణుఁడును బోయెను.

పిదప సారణుఁడు లంకకుఁ బోయి యావద్వృత్తాంతమును రావణునకుఁ దెలిపి, తనయుపాయమునుకూడ వివరించెను. రాముని వేషము వేసికొని తనమిత్రుఁడగు జనకుని మోసపుచ్చుటకు రావణుఁడు తొలుత నంగీకరింపకున్నను సారణ, విద్యుజ్జిహ్వులనిర్బంధమువలనను, సీతాపాణిగ్రహణమునకు వేఱొకయుపాయము తోఁచనందునను ఎట్టకేల కంగీకరించి, వారితోఁగూడ విమానారూఢుఁడై యనతికాలమునందే విశ్వామిత్రునియాశ్రమపు సమీపారణ్యమును చేరెను. అచటి కౌశికీ నదీతీరమున వారందఱును విమానమునుండి దిగి విమానము నొక్కచో నితరు లెఱుఁగకుండ దాచి, తామును తిరస్కరిణీ ప్రభావమున అదృశ్యరూపులయి తపోవనమును బ్రవేశించిరి.

ఆసమయమున విశ్వామిత్రశిష్యుఁడగు సత్యవ్రతుఁడు దశరథునిపాలికిఁ బోవుచు తనగురువు విశ్వామిత్రుఁ డాజ్ఞాపించినట్లు అగ్నిగృహమునందలి కృత్యములు నెఱవేర్చుచు, సమిత్కుశాదులను దీసికొని వచ్చుచుండఁగా, జనకపురోహితుఁడగు శతానందునిశిష్యుఁడగు దేవవ్రతుఁడును సమిత్కుశాదులను దెచ్చుచు, తమబసకుఁ బోవుచు నాతనిం జూచెను. దేవ

వ్రతుఁడు 'జనకాదు లచట నింక నెంతకాల ముందు' రని యడుగఁగా 'విశ్వామిత్రమహాముని యాగము పూర్తియగునంతవఱకను' అని సత్యవ్రతుఁడు సమాధానమిచ్చెను. 'రాక్షసులు యాగమునకు విఘ్నముచేయుచుండఁగా నది యెట్లు పూర్తియగు' నని దేవవ్రతుఁడు ప్రశ్నింపఁగా 'లోకాంతరమును సృజింప సమకట్టి దేవతలనుగూడ గడగడలాడించిన యామహామునికి రాక్షసు లొక లెక్కయా?' అని సత్యవ్రతుఁడు జవాబిచ్చెను. అదివిని దేవవ్రతుఁడు 'అవును; నీవు పలికినది సత్యమే! పరస్పరవైషమ్యమును విడిచి యతని యాశ్రమమున మృగములు తిరుగుచు, నాతనిప్రభావమును తెలుపుచున్నవి. మఱియు శునశ్శేఫుని కాపాడి, నరమేధమును ఆచరింపఁజేసిన యామహామునిశక్తి యద్భుతము' అని విశ్వామిత్రుం గొనియాడెను. 'అందువలననే యాగము నారంభింపఁదలఁచి మిత్రుఁడగు దశరథమహారాజును స్వయముగాఁ దీసికొనివచ్చుటకు మహాముని యయోధ్య కేఁగి యున్నాఁడు' అనెను.

తిరస్కరిణీప్రభావమున అదృశ్యులై యుండి వీరిసంభాషణమును రావణ, విద్యుజ్జిహ్వ, సారణులు వినుచునే యుండిరి. అపుడు సారణుఁడు 'ఈమునికుమారుఁ డెట్టిప్రగల్భములు పలుకుచున్నాఁడు? విశ్వామిత్రునియాగమున కంతరాయములఁ గల్పింపవద్దని పరశురాముఁడు మనప్రభువును బ్రతిమాలుటను మఱచెనా?' అనెను. 'ఆయంశ మీ బ్రాహ్మణవటువునకుఁ దెలియకపోవచ్చు' నని విద్యుజ్జిహ్వుఁ డనెను.

దేవవ్రతుఁడు దశరథప్రసంగమువచ్చుటచే రాముని మిగులఁగొనియాడి తనగురువగు శతానందునకు నట్టిగౌరవమే

రామునియెడఁ గలదని తెలిపెను. ఆవర్ణన విని రావణుఁ డసూ
యపడి 'రాజుల నాశ్రయించుపురోహితులు ఇచ్ఛకములకొఱకు
ఇట్లు వర్ణింతు'రనెను. శతానందమహర్షి శ్రీరాముని లోకోత్తర
గుణములను జనకునకుఁ దెలుపుటంబట్టియే, ఆరాజు తనపుత్రిక
రాముని ప్రేమించుట నభినందించెను' అని దేవవ్రతుఁడుపలికెను.
ఈమాటలు విని రావణుఁడు విచారింపఁగా, విద్యుజ్జిహ్వుఁడు
కోపముతో 'అందఱికంటెను మునుమున్నుగా శతానందునే
చంపవలెను. శతానందుఁడు చెప్పినఁ జెప్పుఁగాక! లోకోత్తరగు
ణుఁడగు మహారాజ రావణు నెఱిఁగినజనకుఁ డావర్ణనము నెట్లు
నమ్మెను?' అనెను.'శతానందుఁడు రామునిఁ బ్రశంసించుట వినిన
పిదప జనకుఁడు 'రాముఁడు లోకోత్తరగుణుఁ డగుఁగాక! సీత
యాతనియెడ బద్ధానురాగయగుఁగాక! సూర్య, చంద్రవంశీయు
లసంబంధము శ్లాఘ్యమైనదియు నగుఁగాక! కాని యీకోరిక
యెట్లు నెఱవేఱఁగలదో తెలియకున్నది. అస్మన్మిత్రమును, శైవా
గ్రణియు, కైకసీసుతుఁడునగు రావణుఁడు నాపుత్రికను వివాహ
మాడఁదలఁచినట్లు కర్ణాకర్ణిగా వినియున్నాను. రావణునిఁ దిర
స్కరించుటెట్లు? రామునికిఁ గన్య నిచ్చుటెట్లు?' అని శతానం
దునితోఁ బలికియున్నాఁడు; కాన ఎట్లు జరుగునదియును తెలి
యదు' అని దేవవ్రతుండు సత్యవ్రతునితోఁ బల్కెను. పిదప
రావణునిశక్తిసామర్థ్యములంగూర్చి మునికుమారుల కిరువుర
కును వాదోపవాదములు జరిగినవి. దేవవ్రతుఁడు రావణునిఁ
బ్రశంసింపఁగా, సత్యవ్రతుఁడు నిందింపసాగెను. అందువలన
విద్యుజ్జిహ్వాదులకు విశ్వామిత్రునిపైని తచ్ఛిష్యుఁడగు సత్య
వ్రతునిపైని విపరీతక్రోధము కలిగెను. పిదప మునికుమారులు

మున కీయప్రస్తుతపు వాదులాటయేల?' అని తమతమ నెలవులకుఁ బోయిరి. రావణుఁడును మారువేసము వేసికొనిన తనయనుచరులతోఁగూడఁ గౌశికీతీరమునఁగల మామిడితోఁటలోఁ దిరిగి, విశేషముల నారయుచు జనకునియొద్దకుఁ బోవసమకట్టెను.

రావణాదు లట్లు కౌశికీతీరమందలి మామిడితోఁపులో నదృశ్యరూపమునఁ దిరుగుచున్నసమయమునందే రామునిపై వలపుఁగొని విరహార్తిచే వెతఁబొందినసీత కొంతయూరటకయి, శీలవతీ, సుచరితలను చెలికత్తెలతోఁగూడ అచటికే వచ్చెను. సుచరిత సీతం జిగురుపాన్పుపైఁ బరుండఁబెట్టి శరీరమున మృణాళముల నుంచి, చందనపల్లవద్రవమును దేహమునిండుగఁ బూయుచుఁ దామరాకువీవనలతో విసరుచుండెను. సీత రామునిఁ దలఁచుకొని అతఁడు తనకు లభింపఁడని నిరాశపొందుచుండఁగా, ఆతఁడు తప్పక రాఁగలఁడని చెప్పుచు, సుచరిత శీలవతి తెచ్చిన చిత్రలేఖనపరికరములను సీత కందిచ్చుచు, స్వప్నమునఁ గాంచిన రామునిచిత్రము వ్రాసి యూరటఁజెందఁగోరెను.

రావణాదుల కీసంభాషణలు లెస్సగా వినవచ్చుచుండెను. వారికి శీలవతీ, సుచరితలు కానవచ్చుచుండిరి; కాని సీత కనఁబడలేదు. ఏలయన ఈయాశ్రమమునకు వచ్చినవెంటనే మహాముని యగువిశ్వామిత్రుఁడు రాక్షసులవలన సీత కెట్టియపాయము కలుగకుండునట్లు రాక్షసాంధఃకరణమణిగల కంకణముల నామెకు సుచరితమూలమునఁ బంపెను. వానిని ధరించినవారు రాక్షసుల కగోచరులై యుందురు. అందువనే సీతమాటలు వినఁబడినను ఆమె కనఁబడలేదు. సీత యతికష్టముపయిం తాను స్వప్నమునఁ గాంచినయువకునిరూపమును చిత్రించెను. అతని లోకో

త్తరసౌందర్యమునుజూచి చెలికత్తెలు సీత కాతనియెడ నంతటి ప్రేమయుండుట యుచితమే యనుకొనిరి; ఆచిత్రముం గాంచి రావణుఁడు మిగుల నచ్చెరువొందెను; మఱియుఁ దనకు సీత లభింపదని నిరాశనుబొందెను. అపుడు సుచరిత నవ్వి 'చెలీ! ఇపుడు నీ ప్రియుఁ డీచిత్తరువును జూచినచో నీకు రత్నకటకము నొసఁగి గౌరవించియుండును' అని పలికెను. అది విని శీలవతి 'చెలీ! సుచరితా! కాశ్యపుఁడగు విశ్వామిత్రమహర్షి రాక్షసాంధఃకరణమనుమణితోఁగూడిన కంకణద్వయమును తొలుతనే సీతకొఱకుఁగా నీచేతి కిచ్చియుండెనే! కావున కంకణబహూమానము తొలుత నీచేతనే చేయఁబడినదికదా! అందువలననే గదా, సీత రాక్షసుల కెవ్వరికిని కానరాకుండుట!' అని పలికెను. ఈమాటలు విని రావణాదులు తమకు సీత కానరాకుండుటకుఁ గల కారణమును గ్రహించిరి. అపుడు విద్యుజ్జిహ్వుఁడు 'ఇపుడు బోధపడినది; ఈమె జనకపుత్త్రియగు సీత; ఈచిత్రపటము రామునిది. సరే! ఓయీ రామా! నీవు సీతమానసమును హరించితినని గర్వింపకుము. నిన్ను మార్గమునందే సంహరించుటకు మారీచుఁడు కాచుకొనియే యున్నాఁడు' అనెను. అప్పుడు సారణుఁడు రావణునితో 'మహారాజా! విశ్వామిత్త్రుని మోసమును గమనింపుఁడు. చూచినమాత్రమున మీరు సీతను ఎత్తుకొనిపోవుదు రనుభీతిచే రాక్షసాంధఃకరణమణిఘటితములగు కంకణముల నామె కిచ్చియున్నాఁడు.' అని పల్కఁగా 'అతఁ డెంతపనికైన తగు' నని విద్యుజ్జిహ్వుఁ డనెను. అంత రావణుఁడు మిగుల కోపించి 'ఓయీ విశ్వామిత్త్రా! వేఱుగ లోకమును సృజింప శక్తుఁడవయ్యును, మారీచునినుండి తప్పించు

కొనఁజాలవు: రంభయాటలు సాగకుండ నిలిపినను తాటకను నిలుపఁజాలవు; త్రిశంకుని రక్షింపఁగల్గినను, రాముని రక్షింపఁ జాలవు: నాయెడ నిట్లు మోసముగాఁ బ్రవర్తించిన నీకు మరణము నిశ్చయము' అని విశ్వామిత్రునిఁగూర్చి పలికి 'సీతను జూచునుపాయమేమి?' అని ప్రశ్నింపఁగా సారణుఁడు 'అయోధ్యనుండి వచ్చినమునివేషముతోఁబోయి నేను సీత మణికటకముల నపహరించి తెత్తును. కటకములు లేకున్నచో, ఆమె మీకు కానరాఁగలదు' అని పలికి యావేషమువేసికొని సీత యొద్దకుఁబోయెను. రావణుఁడాతనియుక్తికి మిగుల సంతసించెను. మునివేషధారియగు సారణుఁడు 'అయ్యో! అయోధ్యనుండివచ్చుచు దారిబడలికచే మిక్కిలి శ్రమపడితిని; ఎవ్వరయిన కొంచెము వీవనతో విసిరి, నాయాయాసమును దీర్చు పుణ్యాత్ములిచట లేరా?' అని యేడుచుచు మూర్ఛపోయెను. ఆమాట విని సీత 'చెలీ! సుచరితా! ఈమునికి కొంచెము సేపు విసిరి, సేదతీర్పుము' అనఁగా సుచరిత తామరాకువీవనతో మునికి విసిరెను. అంత నాకపటముని తెప్పరిల్లినట్లు నటించి 'ఈ పుణ్యాత్మురాలిధర్మమా యని బ్రతికితిని' అని సుచరితం జూచి పల్కఁగా, ఆమె 'అయ్యా! మీరెవరు? ఎక్కడినుండి వచ్చుచున్నారు? అని యడిగెను. ఆమునివేషధారి 'అయోధ్యాధిపతియగు దశరథునికి రాముఁడనుపుత్రుఁడు జ్యేష్ఠుఁడున్నాడు కదా!' అని యప్రస్తుతముగఁ బలికి 'అమ్మా! దప్పి యెక్కువగుచున్నది; నాలుక పిడుచగట్టుచున్నది; మంచితీర్థము కావలెను' అనెను. ఆవార్తను పూర్తిగ వినవలెనని శీలవతీ సీతలు తొందరపడుచుండిరి. 'సుచరితా! మంచితీర్థము తెచ్చి యిచ్చి మునిదప్పి

తీర్పుము; తర్వాతివృత్తాంతమునుకూడ విందము' అనెను. ముని యా మాటలు విని 'త్రాగను; ఆడువారు తెచ్చిననీరు నేను త్రాగను; ఇది నానియమము' అనెను. ఆరామునిఁగూర్చి చెప్పఁదలచినదానిని చెప్పవలెనని చెలులు మునిని తొందర పెట్టిరి; సీత మిక్కిలిదిగులు చెంది యుండెను. ముని కొంత నిదానించి నిదానించి 'నే నారాముని మిత్త్రుఁడను' అనెను. అదివిని చెలులు కొంచె మూరటఁజెంది 'మీ రిట కేలవచ్చితిరి?' అని ప్రశ్నింపఁగా, ముని 'మీకు రావణునియెడ నభిమానము లేదు గదా?' అని యడిగి, వారిచే లేదనిపించుకొనెను. 'రావణుఁ డనువాఁ డెవ్వఁడో కూడ తనకుఁ దెలియ'దని సీత పలికెను. ఆమాట విని సీత తనకు దక్క దని నిరాశఁజెంది రావణుఁ డామెపై కోపము జెందెను. రాముని వేషమున సీతను వివాహ మాడవచ్చుననియు, ఆపిదప నామె క్రమముగా వశురాలు కాఁగలదనియు విద్యుజ్జిహ్వుఁడు పలికి రావణుని శాంతింపఁ జేసెను. అప్పుడు సుచరిత 'రావణుఁ డెవ్వరో తెలియదా! లంకేశ్వరుఁడును, మహాప్రభావుఁడు నగునతనిని జనకమహారాజు కొనియాడుచుండునే! తనమిత్త్రుఁడని.' అని పలికెను. శీలవతి మునితో 'మహాత్మా! మేము రావణపక్షపాతినులమగుటకు రాక్షసస్త్రీలముకాము. ఈమె జనకరాజపుత్త్రికయగు సీతాదేవి. మే మీమెచెలికత్తెలము' అని పలుకఁగా నతఁడు మిగుల సంతసించెను. అంత సుచరిత అయ్యా! మీరు రామునిఁగూర్చి కుశలవార్తను తెలిపినయెడల ఈ మాజానకి యామె చేతులనున్న మణికంకణములను బహూకరింపఁగలదు' అనెను. 'మీయదృష్టవశమున రాముఁడు విశ్వామిత్త్రునితోఁగూడ నీదినమే యిచ

టికి రాఁగలఁడు' అని ముని పలికెను. అదివిని చెలులు సంత సించిరి. సీత యానందముతో తనచేతులనుండి మణికంకణము లను దీసి మునికి సమర్పించెను. సారణుఁడు తనకోరిక నెఱవేఱి నందులకు సంతసించెను. కంకణములు లేనందున సీత రావణా దులకుఁ గనఁబడెను. ఆమె చక్కఁదనమునకు రావణుఁడు ముగ్ధుఁడై పోయెను. అంత 'విశ్వామిత్రయాగముం జూచు టకై అత్రిమహాముని యనసూయాదేవితోఁగూడ రాఁగా వారిని పూజించుజనకుఁడు కుమారికను పిలుచుచున్నాఁ' డను వార్త వినరాఁగా సీత చెలికత్తెలతోఁగూడఁ బోయెను. జనకుని మోసపుచ్చుటకయి రావణుఁడు రాముని వేషమును, విద్యుజ్జి హ్వుఁడు విశ్వామిత్ర వేషమును సారణుఁడు లక్ష్మణుని వేష మును ధరింప సిద్ధముగ నుండిరి. సారణుఁడు తాను సీతవలన గ్రహించినమణికంకణములను తొందరపాటులో వారచట విడిచినరాముని చిత్రమును రావణునికి సమర్పింపఁగా నతఁడు వానిని జాగ్రత చేయించెను.

అచట విశ్వామిత్రుఁడు సకుటుంబపరివారముగ దశర థునిఁ దనయాశ్రమమునకుఁ దీసికొనివచ్చుచుండఁగా తాట కయు, సుబాహుమారీచ, కరాళాదులును దారి నడ్డగించిరి. విశ్వామిత్రుని యాజ్ఞఁగొని, రాముఁడు తాటకను సుబాహునిఁ జంపెను; మారీచునిపై నొకబాణము ప్రయోగింపఁగా నది యాతని నాకాశమున కెగురవైచి, గిరగిరత్రిప్పి మహేంద్ర శైలసమీపమున సముద్రములోఁ బడఁగొట్టెను. కరాళుఁ డిది చూచి భయపడి పాఱిపోయి ప్రాణములను దక్కించుకొని మారీచుని వెదకుచు మహేంద్రశైలమువైపు పోయెను.

ఇతఁడు వెళ్లుసరికి మారీచుఁడు సముద్రమునుండి మెల్లగ లేచి బయటికివచ్చుచుండెను. కరాళ, మారీచు లొకరినొకరు కౌఁగిలించుకొని, తాము బ్రతికి బయటఁబడినందులకు ముదమందిరి. కొంచెము సేపయినపిదపఁ గరాళుఁడు మారీచునితో 'ఆర్యా! ఎట్లయినను మా యోపాయములన్ని మన మాక్షత్త్రియపాలకునిఁ జంపవలెను. లేనిచో విశ్వామిత్త్రుఁడు మన మహారాజునకు జానకి దక్కకుండఁజేయఁగలఁడు; మహారాజునకు మనపై గౌరవము తగ్గును.' అనిచెప్పఁగా మారీచుఁడు 'అవును; విశ్వామిత్త్రుఁడు రామాదులతో నాశ్రమమును బ్రవేశింపక ముందే రాముని జంపవలెను; దీని కొకయుపాయ మున్నది. మనము మాయాసీతను కల్పించి, అప్రియఘోరవార్తను దెల్పి యామెచే అగ్నిప్రవేశము చేయింతము; సీతపై నెక్కువ మక్కువగలరాముఁడు ఆమెవెనుక తాను నగ్నిప్రవేశమొనర్చి మరణించును. పుత్త్రశోకార్తుఁడగు దశరథు నూరడించుచు, విశ్వామిత్త్రుఁడును అతనితోఁగూడ నయోధ్య కేఁగును. ఈ లోగా మనకోరికను నెఱవేర్చుకొనవచ్చును. కాని మన మీ పనిని విశ్వామిత్త్రునికిఁ దెలియకుండ జరుపవలెను' అని పలికెను. వీరిరువురును కొంతదూరముపోయి చూడఁగా కౌశికాశ్రమమునకు నాతిదూరముననే కౌశికీనదీతీరమున దశరథుని సేనలను విడిసియుండినవి. అప్పు డెట్లయినను రాము నచ్చటినుండి దూరముగాఁ దీసికొనిపోవలెనని మారీచుఁడు తలఁచుచుండఁగా వారి కొకయుద్ఘోషణము వినఁబడెను. 'రాముఁ డొంటరిగా మృగయార్థమరణ్యమునకుఁ బోవుచున్నాఁడు; అతని పరిజనులు వెంటనే యతని ననుసరింపవలెను; నేనును ఇదె వచ్చుచున్నాను'

అని రాముని చెలికాఁడగు పింగళుఁ డట్లు ఘోషించెను. అది విని మారీచుఁడు తమకోరిక నెఱవేఱుట కది యనుకూలముగా నున్నదని సంతసించి కరాళునితో 'కరాళా! నీ వీపింగళుఁడు పోవుటకుమున్నె యతనివేషము ధరించి, వనగజముచే నిన్ను పట్టుకొనినట్టు లఱచుచు రక్షింపఁగోరి రాముని వేఁడుచు నాతనిని దూరముగనున్న అరణ్యమునకుఁ దీసికొనిపొమ్ము; నేనును విశ్వామిత్రశిష్యుఁడగు కాశ్యపుని వేషమును ధరించి, మాయచే సీతను కల్పించి, మనకోరికను నెఱవేర్పఁగలను' అని పలికెను. పిదప వారిరువురును తమతమకృత్యములు నెఱవేర్పఁబోయిరి.

కరాళుఁడు మారీచుఁడు చెప్పినట్లుచేసి యొకచాటిపడి మూర్ఛపోయి పరున్నట్లుండెను. రాముఁడు తొందరగావచ్చి యుపచారములుచేసి యతనికిఁ దెలివితెప్పించెను. కరాళుఁడు 'మిత్రమా! నీవింటినారిధ్వని విని సింహగర్జన యనుభయమున నావనగజము నన్ను విడిచిపెట్టిపోయెను' అనెను. పింగళుఁ డక్షతగాత్రుఁడై యున్నందులకు రాముఁడు సంతసించి 'మిత్రుఁడా! నీవు జీవించియుండనిచో నాకు సీతాకరగ్రహణముకూడ సుఖప్రదముకాదు' అని, స్మృతినభినయించి 'సీత స్వప్నమున నన్నుగాంచి, నాయెడ బద్ధానురాగయై యున్నదని కాశ్యపుఁడు చెప్పెనని నీవన్నమాట సత్యమేనా?' అని ప్రశ్నించెను. కరాళుఁడు మఱపుతో 'ఎవ రాకాశ్యపుఁడు?' అనెను. 'మిత్రమా! అతఁడు విశ్వామిత్రుని శిష్యుఁడని నీవే యంటివి కదా! ఇంతలోనే మఱచితివా?' అని రాముఁ డడుగఁగా కరాళుఁడు తనప్రమాదమును తెలిసికొని సర్దుబాటుతో 'అతని నెట్లు మఱవఁగలను? కాని యీవనగజబాధవలన మనస్సు

చకితయయి యిట్లంటెని. కాశ్యపుఁడింకను ఇట్లనెను; నీమీఁది వలపుచే నామె కహోరాత్రములు నిద్రాహారములు లేవఁట! నీకౌఁగిలి యెప్పుడు లభించునా?' అని తహతహపడుచున్నది. అని పలికి రామునకి సీతపై ననురాగము నెక్కువచేసెను. ఇంతలో విరహావస్థచే వందురుచు శైత్యోపచారములకై చెలికత్తెలను నియోగించు సీతమాటలు వారికి వినరాఁగా 'మారీచుఁడు తనపనిని సక్రమముఁగ నెఱవేర్చుచున్నాఁ' డని కరాళుఁడు తలఁచెను. ఇంతలో మారీచుఁడు నటుపచ్చి తిరోహితుఁడై పింగళవేషముతో కరాళుఁడు రాము నచ్చటికిఁ దెచ్చెనని సంతసించెను. కాని రాముఁడాతనితోఁ బలుకుమాటలను బట్టి యతఁడు కాశ్యపుఁడని తలంచి కాశ్యపుఁడు పింగళవేషమును వేసికొనుటలో ప్రయోజనమేమియా! యని యాలోచింపసాగెను; వారివృత్తాంతముఁ దెలిసికొనుటకు ఆ ప్రక్కనేయున్న అరఁటితోటలో దాఁగియుండెను. ఇంతలో మరల స్త్రీలమాటలు వినరాఁగా మారీచుఁ డెప్పటికిని కాశ్యపవేషము ధరించి రాకుండుటంజేసి తమకు వినబడినవి యథార్థమైన సీతయొక్కయు, నామెచెలికత్తెఁయొక్కయు మాటలే యని నిశ్చయించి ఆవైపు రాముఁడు పోకుండుటకయి 'అడవులలో వనదేవత లుందురు గదా! ఈమాటలు వారివే కావచ్చును' అని పలికెను. ఈమాటలను వినినమారీచుఁడు పింగళవేషధారి కాశ్యపుఁడేయని దృఢపఱచెను. మఱియు పింగళవేషధారియగు కరాళుఁడు లక్ష్మణునిచేఁ జంపఁబడియుండు ననియు నూహించి యెట్లయిన నీరామకాశ్యపుల నంతమొందించి పగతీర్చుకొనఁదలఁచెను. ఆస్త్రీలసంగతి నెఱుఁగుటకై

రాముఁడు కరాళునితోఁగూడ నొకపొదరింటఁదాఁగి యుండఁ గోరి యచటికి పోఁగా నలిగిపోయిన చిగుళ్ళశయ్య కానఁబడెను. విరహార్తయగు యువతి విడిచిపోయినశయ్యయై యది యుండ నోపునని కరాళుఁ డనెను. ఎప్పటికిని కాశ్యపవేషధారియగు మారీచుని లక్ష్మణుఁడు చంపియుండునని నిశ్చయించియు కరాళుఁడు ధైర్యముతెచ్చుకొని మెల్లఁగసాగెను. ఇంతలో మరల స్త్రీలమాటలు వినరాఁగా 'ఇతరస్త్రీలప్రసక్తి మనకేల?' అని కరాళుఁడు రాముని విముఖు నొనర్చెను. కాని రాముఁ డది యేమో కనుఁగొనవలెనని కొంచెము ముందునకుఁబోఁగా కరాళుఁడు నాతని ననుసరించిపోయి లోకోత్తరసౌందర్యముతో జానకీవేషమున నెవతెయో యుండుట నెఱిఁగి, అది మారీచుని మాయాప్రభావమే యని సంతసించెను. ఆమెం గాంచి రాముఁడును ముగ్ధుఁడాయెను. రామకాశ్యపులు తనమాయలో పడుచున్నారని మారీచుఁడును సంతసించెను. కరాళుఁడు రామునితో 'విశ్వామిత్రాశ్రమ మీచేరువనే కలదు; కాన ఈమె జానకియే యైయుండు' నని పలికి యామెయెడ రాముని కనురాగముఁ గల్గించెను.

ఇంతలోఁ గాశ్యపుఁ డావైపువచ్చుట గమనించి కరాళుఁడు కాశ్యపువేషధారియగు మారీచుఁడే యని యనుకొని యాతనిం దీసికొనివత్తునని రామునివిడిచి వెళ్లెను. అప్పుడు మారీచుఁడు కాశ్యపవేషధారియై రామునియొద్దకు వచ్చెను. రాముఁ డాతనిని బలుకరించి 'ఈమె సీతయేగదా!' అని ప్రశ్నించి 'ఔ' ననిపించుకొనెను. రామునిపల్కులను బట్టి పింగళవేషధారి కాశ్యపుఁడుకాఁడని తెలిసికొని కరాళుఁడు

తప్పక చంపఁబడియుండునని తలఁచి 'పింగళుఁ డెక్కడ?' అని రాము నడిగెను. రాముఁడు 'ఏమీ! నీ తాతఁడు కనఁబడనే లేదా? నిన్ను దీసికొనివత్తునని చెప్పిపోయెనే! ఈసారికూడ నేదైన వనగజ మాతనిం బట్టుకొనియుండునేమో!' అని విచారించెను. ఆమాటలంబట్టి పింగళవేషధారి కరాళుఁడే యని గ్రహించి మిగుల సంతసించెను.

అంతఁ గార్శ్యుఁ డావైపువచ్చి ముందువైపునకుఁ జూడఁగా సఖీజనపరివృతయు, విరహార్తయునగు జానకి యాతని కంటఁబడఁగా 'ఏమిది? అర్ధయోజనదూరమున విశ్వామిత్రాశ్రమమునకున్న జానకి యిట కెట్లువచ్చినది. ఈమె జానకింబోలిన వేఱొకవనితయై యుండనోపును,' అని పరికించి చూచి, యాసమీపమున నుండుచున్న యగ్ని యుండుట చూచి 'విరహార్తయగు నీమె, ఆయగ్నిలోఁ బడఁదలఁచినట్లున్నది; ఈ చెట్టుచాటునుండి గమనించెదఁగాక!' అని యొకచెట్టు చాటున దాఁగియుండెను.

అప్పుడు రాముని వెదకుచుఁ బింగళుఁ డావైపురాఁగా కార్శ్యక వేషధారియగు మారీచుఁ డగుపించినందున రాముఁడు కూడ నాదగ్గఱనే యుండునని భావించెను. మారీచుఁడు పింగళుం జూచి యతఁడు వేషముధరించిన కరాళుఁడే యని తలఁచి సంతోషముతో నతనిని కౌఁగిలించుకొని యతనితో రహస్యముగా 'కరాళా! నీవు బ్రతికియున్నందుకు సంతసము; ఇంతవఱకును కార్శ్యుఁడే పింగళునివేషముతో నుండెననియు, మోసము నెఱిఁగిన లక్ష్మణునిచే నీవు సంహరింపఁ బడితివనియుఁ దలఁచితిని' అని పలికెను. కార్శ్యుఁ డసంబద్ధముగాఁ బ్రసం

గించుచున్నాఁడని తలఁచి పింగళుఁడు 'కాశ్యపా! నీమాటలు నాకు బోధపడకున్నవి. ఇప్పుడు చెప్పినమాటలనే మఱియొకసారి చెప్పుము' అని పలుకఁగా, ఇతఁడు కరాళుఁడు కాఁడనియు, నిజమైన పింగళుఁడే యనియు గ్రహించి మారీచుఁడేమియుఁ బలుకక యూరకుండెను. పింగళుఁడా చేరువను విరహార్తయగు జానకి చెలికత్తెలతో నుండుటం గాంచి, చాల దూరముననున్న విశ్వామిత్రుని యాశ్రమమునందుండు జానకి యిచటికెట్లువచ్చినదా! యని యాశ్చర్యపడుచుండెను.

అపుడు కాశ్యపవేషధారియగు మారీచుఁడు 'రామా! యేడ్చుచున్న యీ జానకిం గనుము' అని పలికి, రామునికి సీతపయి జాలిపుట్టించి, తాను ధ్యానమును నటించెను. ఇది యంతయుఁ జూచి పింగళుఁడు తనలో 'ఇట్లు పలుకుచున్న వీఁడు కాశ్యపుఁడు కాఁడు; తాటకావధమున రామునిపైఁ గోపించి ప్రతీకారము చేయఁదలఁచి యొవఁడో యొకరాక్షసుఁ డిట్లు మాయను కల్పించి యుండవలెను, కావుననే తొలుత అసంబద్ధముగ మాటలాడియు, మఱలనామాటలనే పలుకఁగోరఁగా మౌనీభావమును వహించెను; రాముఁ డీ మాయలోఁ బడకుండుట విచారకరము' అని యనుకొని రామునితో 'రామభద్రా! ఈమె జానకి కాదు; వీ రీమె చెలికత్తెలును గారు; వా రిచటికి వచ్చుట యసంభవము: ఇది యేదో మాయ; కావున నమ్మకుము' అనిపలికెను. రాముఁ డంత తనలో 'ఏమిది పింగళుని మాటలు పూర్వాపరసందర్భవిరుద్ధములుగా నున్నవే! ఈమె జానకియే యని తొలుతఁ జెప్పి, యీమె సమాచారమును బాగుగా నెఱిగిన కాశ్యపునిఁ దెత్తునని చెప్పిపోయి వచ్చి,

యిప్పుడు తద్విపరీతముగఁ బల్కుచున్నాఁడే!' అని యనుకొని మారీచునితో 'కాశ్యపా! పింగళుని మాటలను వింటివిగదా!' అని హెచ్చరించెను. మారీచుఁడు రామునితో రహస్యముగ 'ఎవఁడో రాక్షసుఁడు, తాటకావధక్రోధమును మనస్సున నుంచికొని ప్రతీకారము చేయఁబూని పింగళకవేషమున వచ్చి యుండును' అనెను. రాముఁడును 'అయి యుండవచ్చు' నని తలంచెను. రాముఁడు మాయావిని కాశ్యపునిఁగాఁ దలఁచుచు ఆతనిమాటలను వినుచున్నందులకు పింగళుఁడు కటకటంబడి 'రామభద్రా! నామాటలను వినక యాతనిమాటలనే విశ్వసించుచున్నావా!' అని అడుగఁగా రాముఁడు 'ఏమేమిరా! రాక్షసుఁడు కూడ నన్నాటంకపఱచుటయా!' అని కోపముతోఁ బల్కెను. పింగళుఁ డీమాటలు విని రాముఁడు తన్ను రాక్షసునిఁగాఁ దలఁచుచున్నందులకు మిగుల దుఃఖించి, బాగుగా విమర్శించి నిశ్చయింపవలెనని రామునితోఁ బల్కి యూరకుండెను.

మారీచుఁడు జానకి యభీష్టమును నెఱవేర్పవలెనని ప్రోత్సహించుచుండఁగా 'ఈమె జానకి కా' దని పింగళుఁడును రామునికిఁ దెల్పుచుండెను. రావణుఁడు సీతను యాచింపనున్నాఁడని సీతమనస్సు కలఁతపడుచున్న' దని యొకచెలికత్తె పలుకఁగా రాముఁ డచ్చెరువందెను. 'మాతండ్రి యొకవేళ నన్ను రావణునకీయఁదలఁచిన నే నాత్మహత్యఁ జేసికొందు' నని సీత జబాబిచ్చెను. ఆమాటలు విని రాముఁడు మిగుల సంతసించెను.

కాశ్యపుం డంత పింగళవేషధారియగు కరాళుం గలిసికొని రామునివృత్తాంతముం బ్రశ్నింపఁగా, నతఁడు తన్ను

ప్రశ్నించువాఁడు మారీచుఁడే యని యెంచి 'నీవు చెప్పినరీతిని నే నాతనిని వనాంతరమునకుఁ దీసికొనివచ్చితిని. చాలసేపటి వఱకును నీవు కనిపింపకపోఁగా లక్ష్మణునిచే నీవు సంహరింపఁబడి యుండువని భీతిల్లితిని.' అని పలికెను. కాశ్యపుఁ డివివిని తనలో 'వీ డెవ్వఁడో లక్ష్మణవిరోధి; పింగళుని వేషము ధరించి మాతో నాటక మాడనున్నాఁడు; పరిశీలించి తెలిసికొందునుగాక!' అని యాలోచించి ప్రకాశముగా 'రామభద్రుఁ డెక్కడ' అని ప్రశ్నించెను. 'ఈరసాలవనమున సీతం జూచుచు నున్నాఁడు' అని కరాళుఁడు జబా బీయఁగా 'ఆమె సీతయేనా?' అని కాశ్యపుఁ డడిగెను. కరాళుఁడు నవ్వి 'నీమాయచేఁ గల్పితయయ్యు నామె నిజముగ సీతవలెనే యున్నది. మాయావులగు శంబర విద్యుజ్జిహ్వేంద్రజిత్తులకంటెను తాటకాపుత్త్రుఁడవగు నీమాయ గొప్పది' అని పలికెను. అంతఁ గాశ్యపుఁడు తనలో 'చాల ప్రమాదము సంభవించినది! వీఁ డెవ్వఁడో మారీచుని యనుచరుఁడగు రాక్షసుఁడు; నన్ను మారీచునిగా భావించుచున్నాఁడు; ఈతనిమాటలంబట్టి మారీచుఁడు నారూపమును ధరించి వేఱొకచోట నున్నట్లు తేలుచున్నది; ఈరాక్షసుఁడు నన్నెట్లును చంపక విడువఁడు' అని యనుకొనుచు భయాతిరేకమున మూర్ఛపోయెను. తాటకను స్మరించి విచారాతిశయమున మారీచుఁడు మూర్ఛపోయెనని తలంచుచు కరాళుఁడు శైత్యోపచారములం చేసి యాతనికి దెలివి తెప్పించెను. కాశ్యపుఁడు తెప్పరిల్లి తాను మారీచుఁడను గాననియు కాశ్యపుఁడననియు, దయ తలఁచి తన్ను విడువవలెననియు వేడుకొనెను. ఈమాటలంబట్టి మారీచుఁడు మతిచెడి యుండునని నిశ్చయించి, కరాళుఁడు విచారించి

కాశ్యపుని గొంతు నులుమసాగెను. కాశ్యపుఁడు తప్పించుకొని రసాలవనమువంక పరుగెత్తెను; కరాళుఁడును వానిని వెంబడించెను. కాశ్యపుఁడు రాముని సమీపించి 'రక్షింపుము, రక్షింపుము' అని యఱచెను. మారీచుఁడు 'మిత్రమా! కాశ్యపుండను నేను; వీఁడెవ్వఁడో మాయావి' అనెను. 'మారీచానుచరుఁడగు రాక్షసుఁడు నన్ను చంపనున్నాఁడు; రక్షింపుము' అని కాశ్యపుఁ డఱచెను. అతనిని వెంబడించివచ్చుచు, పింగళుని వేషముననున్న కరాళుఁడు కాశ్యపు నతిక్రమించి ముందుగాఁ బరుగెత్తివచ్చి 'రామభద్రా! ఈరాక్షసుఁడు నన్ను జంపవచ్చుచున్నాఁడు, రక్షింపుము' అని రాముని శరణుఁజొచ్చెను. అపుడు రాముఁడు మారీచునితో 'కాశ్యపా! చూడుము! పింగళుఁడు వచ్చె' నని కరాళునిఁ జూపెను. మారీచుఁ డటు చూచి కరాళుఁడు జీవించియున్నందులకు సంతసించి అతని వెంబడి వచ్చుచున్న కాశ్యపునిఁ గమనిఁచి రామునితో 'అవును; మఱియుఁ జూడుము; నావేషమును ధరించి మారీచుఁడు వచ్చుచున్నాఁడు' అని కాశ్యపునిఁ జూపెను. కాని కాశ్యపుఁడు ముందుకువచ్చి 'మారీచుఁడు నావేషముతో వచ్చి నీప్రక్కనే యున్నాఁడు; ఈమె యెవ్వతెయో సీత యని నిన్ను మోసము చేయుచున్నాఁడు' అని పలికెను. కరాళుఁడు సంతోషముతో కాశ్యపవేషధారియగు మారీచుం గాంచి, అతఁడు జీవించియే యున్నందులకు సంతసించి పింగళునిఁ జూచి 'నారూపమును ధరించి, వెలవెలపోవుచున్న యీతఁ డెవ్వరు?' అని యడుగఁగా మారీచుఁడు 'ఇతఁడు రాక్షసుఁడే యని మనమిత్రుఁ డిదివఱకే నిశ్చయించినాఁడు' అనెను.

అప్పుడు పింగళుఁడు కాశ్యపునియొద్ద కేఁగి 'మిత్రమా! కాశ్యపా! నీవేషమును ధరించియున్న యీతఁడు 'కరాళా' అని నన్ను సంబోధించియున్నాఁడు; కావున నితఁడు మారీచుఁడై యుండును; నా వేషమున నున్నవాఁడు కరాళుఁడై యుండును' అనెను. ఇద్దఱు కాశ్యపులు నిరువురు పింగళులు కానరాఁగా రాముఁడచ్చెరువొందెను. కరాళ, మారీచులు కాశ్యపపింగళులఁజూచి "వీరు రాక్షసులు, వీరిం జంపుము" అని కోరిరి. 'మిత్రమా! ఇది మారీచుని మాయ; ఏపనినైన నాలోచించి చేయుము' అని కాశ్యపుఁడనెను. రాముఁడు సందిగ్ధమానసుఁడై యుండెను. ఇంతలో నొకతె పరుగుపరుగున సీతయొద్దకు వచ్చి 'సీతను దనకీయవలెనని దశకంఠుఁడు కోరఁగా, జనకుఁడు తిరస్కరించినందున అతని శిరమును ఖండించి, సీత నపహరించుటకీదెస వచ్చుచున్నాఁడు' అని యఱచెను. మాయాసీతయు నామె చెలికత్తెలు నీమాట విని భయపడి పాఱిపోయిరి. ఇదియంతయు మారీచునిమాయ యనియు, జనకుని ప్రియమిత్రుఁడగు రావణుఁడట్లు చేసియుండఁడనియుఁ గాశ్యపుఁడు రామునితోఁ బలికెను. కరాళమారీచులు 'రాక్షసులగువీరిరువురిని జంపవలయు' నని కాశ్యపపింగళులను జూపుచుఁ బలికిరి. ఇంతలో విరహార్తయగు మాయాసీత యగ్నిప్రవేశ మొనర్పుటఁ గాంచి, యామె చెలికత్తెలు నగ్నిప్రవేశ మొనర్చిరి. ఇది చూచి రాముఁడు మిగుల దుఃఖించుచుండఁగా ఆదుఃఖము నధికమొనర్పఁదలఁచి మాయాకాశ్యపుఁడు సీతంగూర్చి మిగుల విచారించి మూర్ఛపోయెను; మాయాపింగళుఁ డాతని నూఱడించెను; కాని యాతఁ డూఱట పొందకుండెను. రాముఁడు నొకయెత్తైనఁబండ

త్రాతిపై నెక్కి క్రిందపడి మరణింప సిద్ధపడెను. ఈవిషయ మంతయు విశ్వామిత్రున కెఱుకపఱచెడివారుండిన బాగుండునని పింగళకాశ్యపు లనుకొనిరి, రాముఁ డెట్లును బండత్రాతిపై నుండి పడి చచ్చునని నిశ్చయించి సంతోషముతో మారీచుఁడు 'కరాళా! తాటకావధపాతకియగు రాముఁడు సీతకై విలపించి చచ్చుచున్నాఁడు చూడుము.' అని గట్టిగా ననెను. కరాళుఁడు 'వద్దువద్దు' అని మారీచునకు సంజ్ఞయొనర్చెను. ఇదిచూచి పింగళకాశ్యపులు మిగుల సంతసించిరి. రాముఁడు అనుమానముతోఁ జూచుచుండఁగా, మారీచకరాళులు పారిపోఁజూచిరి. అపుడు రాముఁ డెక్కియుండినత్రాయి యొకమునిభార్యగా మాఱి, రామునియెదుటకువచ్చి 'భర్తగారిశాపమువలన నిన్నినాళ్లు పాషాణరూపమునసుండి నీపాదస్పర్శమున బవిత్రనై వెనుకటిరూపు పొందితి' నని రాము నభినందించెను. రాముఁడు నామెకు నమస్కరించి దీవన లందెను. కాశ్యపపింగళు లామె శతానందమాతయు, గౌతమపత్నియునగు నహల్య యగుట నెఱిఁగి నమస్కరించి దీవనలందిరి. 'వీ రెవ్వ' రని యడుగఁగా నహల్య 'వీ రే కాశ్యప, పింగళులు' అని మాయారూపులం జూపి 'వీరే మారీచకరాళులు' అని తెలిపెను. ఆమాట విని రాక్షసు లిద్దరును మృగరూపముల దాల్చి పరుగిడఁదొడగిరి. రాముఁడు వారివెంట నంటిపోయి కరాళుని సంహరించెను. మారీచుఁడు మృగశరీరమునువిడిచి, రాక్షసరూపము దాల్చి సముద్రమున మునిఁగెను. రాముఁడు వెనుకకువచ్చి తనపొరపాటునకు క్షమింపవలెనని కాశ్యపపింగళులను వేఁడుకొని యీవృత్తాంతము నెవ్వరిదగ్గఱను చెప్పవలదని ప్రార్థించెను.

'అట్లే' యని వా రంగీకరించిరి. పిదప రామాదులు తమతమ నెలవులకుఁబోయిరి. శ్రీరాముఁడు తాటకాసుబాహుకరాళులను సంహరించిన వార్తను విని దేవేంద్రుఁడు మిగుల సంతసించి దానికి రావణుఁ డేమి ప్రతిక్రియఁ దలఁచుచున్నదియుఁ దెలియఁగోరి చిత్రాంగదుఁడను గంధర్వుని లంకకుఁ బంపెను. అతఁడును రాక్షసవేషమునఁదిరుగుచుండఁగా నొకరాక్షసి యెదురు పడి 'నాయనా! నీవెవ్వఁడవు? కరాళుఁడవా, వేఱొకఁడవా?' అని ప్రశ్నించెను. విషయము దానంతనదియే తెలియుచుండు టకు చిత్రాంగదుఁడు లోలో సంతసించి 'కరాళుఁడనే!' అని పల్కెను. 'అట్లయిన వేగ మింటికి పొమ్ము; నీభార్య గృధ్రముఖి నీకై మిగుల దుఃఖించుచున్నది. ఆర్యమారీచుఁ డీయూరువచ్చి రావణుఁ డూరలేనందున ప్రహస్తాదులగు మంత్రులతో తాటకాసుబాహుకరాళులు రామునిచేఁ జంపఁబడిరనిచెప్పి మాతృమరణమువలన నిర్విణ్ణుఁడై తపంబొనర్ప గోకర్ణక్షేత్ర మునకుఁబోయెను' అనెను. పిదప 'మహారా జెక్కడి కేఁగెను?' అని చిత్రాంగదుఁ డడుగఁగా నామె ఆయన యెచటి కేఁగినదియుఁ దెలియకయే మందోదరీదేవి ప్రభువృత్తాంతము నరయుటకు నన్ను విద్యుజ్జిహ్వునింటి కంపెను; కాని యాయనయు నింటలేఁడు; పిదప విద్యుజ్జిహ్వుని భార్య మాయావతి రహస్యముగ నావృత్తాంతమును దెల్పెను; నీవు నెవ్వరికిని దెలుపవని నమ్మికతోఁ జెప్పుచున్నాను. వినుము. సీతను బెండ్లాడుటకు ప్రభువు రాముని వేషముధరించి వెళ్లె నట! విశ్వామిత్ర వేషముతో విద్యుజ్జిహ్వుఁడును, లక్ష్మణునివేష ముతో సారణుఁడు నాతని ననుసరించిరఁట' అనెను. మఱియుఁ

నామె 'నీవు జీవించి వచ్చినవృత్తాంతమును నీభార్యకు ముందుగనే తెల్పి బహుమానము తీసికొందును' అని పోఁబోవఁగా 'తొందర పడకుము; నేను కరాళుఁడను కాను; విభీషణుని యనుచరుఁడను; కరాళుఁడు మరణించినవార్త సత్యమే' అని చిత్రాంగదుఁడు పల్కెను. రాక్షసి మాఱుపలుకక మండోదరియొద్దకుఁ బోయెను; చిత్రాంగదుఁడును, రావణుని మాయను తొలుత జనకునకుఁ దెలిపి పిదప నింద్రునికి తెల్పుటకుఁబోయెను.

అంత జనకుఁడు శతానందునితో 'రావణుఁడు సీతను యాచింపకపూర్వమే రామునికిచ్చి పెండ్లియొనర్ప నాసంకల్పము. కౌశికుఁ డీవిషయమున నెట్లాలోచించునో' అని పలుకఁగా నంతయు సానుకూలమగునని యతఁడు పలికెను. అప్పుడు విశ్వామిత్రరామలక్ష్మణవేషములతో విద్యుజ్జిహ్వరావణసారణులువచ్చిరి. రావణుఁడు విద్యుజ్జిహ్వునితో రహస్యముగా 'మారీచసుబాహుతాటకలు మన మాజ్ఞాపించిన పనిని నెఱవేర్పఁగలరని నాకు నమ్మకమున్నను, సీతావివాహమున ధైర్యము చాలకున్నది' అని పలుకఁగా 'మీ కాయనుమానమువ' ద్దని యాతఁడు ధైర్యము చెప్పెను. ఈవిశ్వామిత్రాదుల రాకను జీమూతకుఁడను కంచుకి జనకునకుఁ దెలిపి యాతని ముదలఁగొని వారిని లోపలఁ బ్రవేశపెట్టెను. జనక శతానందులు వారికి స్వాగత మొసఁగిరి. శతానందుఁడు విద్యుజ్జిహ్వునితో 'కౌశికా! వీరిరువురును సమవయస్కులు; అందగాండ్రు; వీరిలో రాముఁ డెవరు? లక్ష్మణుఁ డెవరు?' అని యడుగఁగా, అతఁడు 'నవాంబుదశ్యాముఁడు రాముఁడు; బంగారుకాంతి కలవాఁడు లక్ష్మణుఁడు' అనెను. 'ఇట్టిపుత్త్రులను గనినందులకు

దశరథుఁడు ధన్యుఁడు' అని శతానందుఁడు పల్కఁగా 'లోకమంతయు ధన్య' మని కపటకౌశికుఁడు పలికెను. 'జనకుఁడింకను సీతను దీసికొని రాఁడేమి ?' అని రావణుఁడు తొందరపడఁగా 'కొంచెము నిదానింపుమ లె' యని సారణుఁడు పలికెను. అంత జనకుఁడు విద్యుజ్జిహ్వునితో 'మహామునీ! నీవిఁక యజ్ఞమునకు దీక్షఁ గైకొనవచ్చును; నేనును జానకీవివాహప్రయత్నమున నుందు' ననెను. 'ఊర్మిళను లక్ష్మణునకిచ్చి వివాహ మొనర్పుటయు మే' లని శతానందుఁడు పల్కఁగా విద్యుజ్జిహ్వుఁడు రహస్యముగా సారణునితో 'సారణా! నీకును పెండ్లియగుచున్నది; నా వేషమే నిష్ఫలమైనది' అని పలుకఁగా అతఁడు 'భయములేదు; మారీచునిచే విశ్వామిత్రుఁ డెట్లును హతుఁడగును; యజ్ఞమున నతనిభార్య నీకు గృహిణి కాఁగలదు' అనెను. జనకుఁడు 'శతానందా! అంతియేకాదు; నాతమ్ముఁడు కుశధ్వజునికుమార్తెలగు మాండవీ, శ్రుతకీర్తులను భరతశత్రుఘ్నుల కీయఁదలఁచితిమి.' అనిపల్కి కౌశికునితో 'దశరథునితో భరతశత్రుఘ్నులుకూడ వచ్చుచున్నారుగదా!' అని పలుకఁగా, విద్యుజ్జిహ్వుఁడు 'దశరథుఁడు సకుటుంబముగనే వచ్చుచున్నాఁ' డనెను. ఇంతలో వారికి 'విద్యుజ్జిహ్వుఁడు విశ్వామిత్రవేషమునను రావణ, సారణులు రామలక్ష్మణులవేషమునను జనకునిమోసపుచ్చుటకయి వచ్చియున్నా' రని యొకయశరీరవాక్కు వారికి వినఁబడెను. అదివిని యందఱు నాశ్చర్యపడిరి. 'మనరహస్య మెవ్వారికిఁ దెలిసినది?' అని రావణుఁడు విద్యుజ్జిహ్వునితో రహస్యముగాఁ బల్కఁగా 'నాభార్యదక్క వేరెవ్వరును దీని నెఱుఁ

గరు; నాకును ఆశ్చర్యముగనే యున్నది' అని యతఁడు జవాబిచ్చెను. 'ఇట్లెవరు పలికియుందురు?' అని జనకుఁ డడుగఁగా శతానందుఁడు 'ఇంద్రుని దూత యిట్లు పలికిపోయెను;' అనెను. అంత విద్యుజ్జిహ్వుఁడు జనకునితో 'మావేషములను ధరించి రాక్షసులు వచ్చుచున్నారా? రానిండు; మేము వేఱు స్థలమున నుందుము' అనెను. అప్పుడు రావణుఁడు విద్యుజ్జిహ్వునితో 'ఇప్పుడు చేయునదేమి?' అని యడుగఁగా తిరస్కరిణీప్రభావమున నంతర్హితులమై యుచితవృత్తాంతమును గమనింతుము' అని యతఁడు జవాబిచ్చెను. వీరిరువురును రహస్యముగ మాటలాడుట చూచి వీరే రాక్షసులని జనకశతానందు లనుమానించిరి. పిదప రావణాదులు కొంచెము దూరముపోయి యంతర్హితులై యుచితవిశేషములను గమనించుచుండిరి.

పిదప రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు రాఁగా, వారిని జనకశతానందులు గౌరవించియు, వేషధారులగు రాక్షసులనియే శంకించిరి. విశ్వామిత్రుఁడు వారికి దారిలో తాటకా సుబాహు మారీచు లడ్డగించుటయు, రాముఁడు తాటకా సుబాహులను చంపి మారీచుని నమ్ముతో నెగురఁగొట్టుటయుఁ దెల్పెను. జనకశతానందు లదివిని యచ్చెరువొందిరి; రావణాదులు దుఃఖించిరి. ఇదివినియు ననుమానము తీఱక, యథార్థరాముని గనుగొనఁగోరి జనకుఁడు తనపురోహితునితో రహస్యముగ 'శతానందా! సీత పరాక్రమశుల్కయని తెల్పుదము; సిద్ధచారణగంధర్వయక్షరాక్షసులచే నెక్కిడరానివింటి నిదివఱకు వారుఁడు నా కొసఁగియున్నాఁడుకదా!

వాని నెక్కిడినవానికే సీత నిత్తునని తెలిపిన యథార్థము బయట పడును' అని పలుకఁగా, నతఁడును దాని కంగీకరించెను. లక్ష్మణుఁడు తనయన్నగారి ప్రభావమును విశ్వామిత్రుఁడు జృంభకాస్త్రముల నిచ్చుటను దెలిపినను, జనకశతానందులు కొంత యుపేక్షాభావముననే యుండిరి. వారట్లుండుటకు అంతకు మున్నే రాక్షసులు మాయలుపన్నియుండుట కారణము కావచ్చునని తలఁచి విశ్వామిత్రుఁడు వారియభిప్రాయమును తెలుపఁగోరెను. శతానందుఁడు జనకునికోరికను దెల్పఁగా విశ్వామిత్రుఁడు నవ్వి 'మాయావులగు రాక్షసులయాటలు సాగు నేకాలమున ఎవ్వరి నెవ్వరు నమ్మవీలగును? ఆవింటిని తెప్పింపుఁడు' అనిపల్కఁగా, జనకుని యభిప్రాయ మెఱిఁగి శతానందుఁడు శివధనుస్సుం దెచ్చెను. అంతఁ బ్రతీహారితోఁగూడ సీతయు, ఊర్మిళామాండవీశ్రుతకీర్తులును వచ్చి కొంతదూరమున నిలుచుండిరి. సీతకు రామునిపైని, ఊర్మిళకు లక్ష్మణునిపైని ఎక్కువ ప్రేమకలిగెను. అది తక్కినవారు గమనించి యొకరినొకరొక కొంతకాల మెకసక్కెము లాడుకొని అందఱు నాశ్చర్యపడుచుండఁగా రాముఁ డావింటి నెక్కిడుచుండఁగా అది పెళపెళధ్వనితో విరిగిపోయెను. జనకశతానందులు యథార్థులగు విశ్వామిత్ర రామలక్ష్మణులు వారే యని నిశ్చయించిరి. రావణుఁడు విపరీత మగుకోపముతో వారిని చంపఁదలఁచెను. కాని విద్యుజ్జిహ్వుఁడు మహాస్త్రసంపన్నుఁడగు రాము నప్పుడు చంపుట యసాధ్యమనియు, లంకకుఁబోయి మాల్యవంతుఁడు మున్నగుమంత్రులతో నాలోచించి రాముని జంపుటకును, సీత నపహరించుటకును దగినపన్నుగడఁ బన్నవలెననియుఁ దెల్పుచు చే

నదియే యుక్తమని తలంచి రావణుఁడు విద్యుజ్జిహ్వాహారణులతో లంకకుఁబోయెను. జనకుఁడు సంతోషముతో కౌశికాదులఁ గొనియాడి రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు సీతోర్మిళామాండవీశ్రుతకీర్తుల నిచ్చి వివాహముచేయునట్లు తెలిపెను. సీతాదులు విశ్వామిత్రునికి నమస్కరించుటకు రాఁగా, రామలక్ష్మణులు సీతోర్మిళలంజూచి ముగ్ధులైరి. విశ్వామిత్రుఁడు తనకు నమస్కరించిన సీతాదులను దీవించి, తాను యజ్ఞదీక్షఁ బూనుదు నవియు, సీతాదుల వివాహము నెఱవేర్పవలెననియు జనకునితోఁ బలికెను. జనకుఁడును వివాహములకుఁ దగిన యేర్పాట్లుచేయ సేవకుల కాజ్ఞాపించెను.

సీతారాములయొక్కయు, తక్కినవారియొక్కయు వివాహములైనపిదప దశరథుఁడు సకుటుంబపరివారముగ నయోధ్యకుఁ బోవుచుండఁగా, రాము నెట్లయినఁ బరశురామునిచేఁ జంపింపఁదలఁచి రావణుఁడు 'రాముఁడు శివధనుస్సును విరిచి యవమానపఱచె' నని పరశురామునితోఁజెప్పి యతనికిఁ గోపము కల్గించెను. పరశురాముఁడు దారిలో రాము నడ్డగించి 'ప్రాఁత పడి తుప్పుపట్టినవిల్లు విఱుచుట యొకగొప్పకాదు; శక్తి యున్నచో నీవిల్లు ఎక్కుపెట్టుము' అని తనయొద్ద నుండువిల్లు నీయఁగా రాముఁడు దాని నవలీల నెక్కుపెట్టి పరశురాముఁడు పుణ్యలోకములకుఁ గట్టుకొనిన సోపానపంక్తిని పడఁగొట్టెను,

ఈవిధముగఁ దనప్రయత్నములు విఫలము లగుచున్నను రావణుఁ డూఱకొనక విద్యుజ్జిహ్వాదుల నయోధ్యకుఁబంపి, వారు మంథరా, కైకేయీ, దశరథులం దావేశించునట్లు చేసెను. రాక్షసావిష్టయగు మంథర తనయజమానురాలైన

కైకతో "తొల్లి దశరథుఁడు నీకు రెండువరముల నీయ నంగీకరించెనుగదా! రాము నడవులకుఁ బంపున ట్లొకవరమును, భరతునకుఁ బట్టముఁగట్టున ట్లింకొకవరమును కోరుము' అని చెప్పెను. ఆమె యట్లే కోరఁగా సత్యపాలనమునఁ జేయఁగన్న దశరథుఁడు కైకకోరికలను నెఱవేర్చెను; రాముఁ డడవులకేఁగుట విని సీతయు, లక్ష్మణుఁడును అతని ననుసరించిరి. ఆవెంటనే దశరథుఁడును పుత్రశోకమువలన మరణించెను. రావణుఁ డీరీతిగ రాముని గష్టములపాలుచేసి కొంతతృప్తిఁ బడసెను.

తాతగారియింటినుండివచ్చిన భరతుఁ డిదియంతయు విని, రాముని దిరిగి యయోధ్యకుఁ దెచ్చుటకు వనమునకు వచ్చెను. కాని రాముఁడు తిరిగిరాలేదు. భరతుని బలవంతమువలన, తన పాదుకలనుమాత్ర మిచ్చెను. వానిని గ్రహించి భరతుఁ డయోధ్యకుఁ బోయెను. రాముఁడును సీతాలక్ష్మణులతోఁగూడ దండకారణ్యమునందలి జనస్థానమునఁగల పంచవటియొద్ద పర్ణశాలను నిర్మించుకొని, యచటి రాక్షసులను సంహరించి, యందుండుమునులను రక్షింతు నని ప్రతిన యొనర్చెను. అది యెఱిఁగి యక్కడిరక్కసులఱేఁడగు ఖరుఁడు రామవధార్థము తనమిత్రుఁడగు విరాధుని నియోగించెను. విరాధుఁడును పర్ణశాలకుఁగొలఁదిదూరమున కోవిదారవనమున నక్కియుండి, జానకి పర్ణశాలనుండి బయటికివచ్చినప్పుడు, రామునివేషముతో నామెను దూరముగాఁ గొనిపోయి, సుఖింపవచ్చుననియు, సీతావియోగమున రాముఁడును, అతనికొఱకు లక్ష్మణుఁడును మరణింతురనియు, ఈరీతిని ఖరునికోరికకూడ సులభముగా నెఱవేఱఁగలదనియు విరాధుని యాశయము. విరాధుఁడు

తొలుత నావనమునం బ్రవేశించుటయు, కొలఁదికాలమైన పిదప రాముఁడుగా మాఱుటయు, పొంచియున్న లక్ష్మణుఁడును, గిరిసానువుపై నున్న సీతారాములును గమనించుచునే యుండిరి.

ఆసమయముననే సీత నెట్లయిన నపహరించి తేవలెనని రావణునిచేఁ బంపఁబడిన యాతనిసోదరి శూర్పణఖ యాసమీపమునకుఁ వచ్చి రామునిఁజూచి మోహపరవశయయి తాను సీత వేషమును దాల్చి యాతనిని దూరముగాఁ దీసికొనిపోయి యాతనితో సుఖింపవలెనని తలఁచి కింశుకవనమునకుఁ బోయి సీతగా మాఱి పూవులుకోయుచుండెను. దీనింగూడ సీతారామ లక్ష్మణులు గమనింపకపోలేదు. ఇట్లు రాక్షసీరాక్షసులు సీతా రాములరూపములను దాల్చుట యేలకోయని వారాలోచించు చుండిరి. విరాధుఁడు యథార్థమైనరాముఁడని శూర్పణఖయు, శూర్పణఖ యథార్థసీతయని విరాధుఁడును భావించి యొకరి నొకరాకర్షింప యత్నించుచుండిరి. మాయాసీతకుఁ బూవుఁబందక పోఁగా విరాధుఁడామెదరి కరిగి నేను వంగినిలుచుందును; నీవు నావీఁపుపై నెక్కి పూవులు కోసికొనుము' అని పలికెను. ఆమె తనవీఁపుపై నెక్కినచో నెత్తుకొనిపోవచ్చునని యాతని తలంపు. అతనివీఁపుపై నెక్కి కాళ్లతో నతని నదిమిపట్టి ఎగిరి యాతనిం దీసికొనిపోవచ్చునని శూర్పణఖయుఁ దలంచి, సమ్మతించెను. ఇట్లొకరినొక రెత్తుకొని ఎగురుచు నాకాశమార్గమునఁ బోవుచుండఁగా, అన్నయగు సంపాతిం జూడఁబోయి మఱలి వచ్చుచున్న జటాయువు రాక్షసుం డొకఁడు రామునివేషమును ధరించి, సీత నెత్తుకొనిపోవుచున్నాఁడని భావించి యడ్డగించెను. అతనింజూచి వారిరువురును దబ్బున నేలపైఁబడిరి.

అప్పుడు వారు పరస్పరము నీవెవరవు?' అని ప్రశ్నించుకొని యథార్థమును తెలిసికొనిరి. 'అంత లక్ష్మణుడు విరాధుని సంహరించెను. 'దురాత్మురాలగు శూర్పణఖ నెంతమాత్రమును విడువరా' దని జటాయువు బోధింపఁగా లక్ష్మణుఁ డామె ముక్కు చెవులంగోసి వికారస్వరూపమునుగావించెను. అదిచూచి జటాయువు 'ఇక ఖరాదులతో యుద్ధమునకు సిద్ధపడవలసి యున్నది' అనెను. ఇదియంతయును సీతారాములు గమనించుచుఁ గ్రిందికి దిగివచ్చిరి. 'ఖరుఁడు విరాధవధమునకును, శూర్పణఖ వికారరూపమునకును కోపించి ససైన్యముగ యుద్ధమునకు వచ్చుచున్నాఁ' డని నారదుఁ డాకాశమార్గమునఁ బోవుచుఁ దెలియఁ జేసెను. రాముఁడు సీతనుబర్ణశాలలోని కనిపి, ఆమెను కాపాడుటకు లక్ష్మణుని నియోగించి, ససైన్యుఁడగు ఖరు నెదిరించుటకుఁ దానొక్కఁడే పోయెను.

సహచరులతోఁగూడి యుద్ధమునకువచ్చి ఖరుని రాముఁడు చంపినపిదప శూర్పణఖ లంకకుఁబోయి తనసోదరుఁడగు మహారాజున కీచటి వృత్తాంతము నంతను తెలియఁజేసెను. రావణుఁడును మాయచే రామునిఁ జంపి సీత నపహరించి తెచ్చుటకు మాయావియగు మారీచునితోఁగూడ దండకారణ్యమునకుఁ బోయెను. బంగరులేడి రూపుధరించినమారీచుఁడు పర్ణశాల వద్దకు రాఁగా దానిని పట్టియిమ్మని సీత రామునిఁ గోరెను. రాముఁ డాజింకను వెంటాడి యది లభింపనందున బాణముతోఁ గొట్టెను. దెబ్బతిన్నమారీచుఁడు ప్రాణములు విడుచుచు 'హాలక్ష్మణా! అని యరవఁగా సీత భయపడి పర్ణశాలవద్ద తన రక్షణార్థ ముంచఁబడినలక్ష్మణుని నిర్బంధించి రాముని కొఱకుఁ

బంపెను. అయ్యదను కనిపెట్టి మాయాసన్న్యాసివేషధారియగు రావణుఁడు సీత నెత్తుకొని యాకాశమార్గమునఁ బోయెను. ఆమె యాక్రందనము విని జటాయువు రావణు నడ్డగించి యుద్ధముచేసి, రావణునిచే గట్టిదెబ్బలు తిని నేలపై బడి పోయెను. రావణుఁడు సీతను లంకకుఁ దీసికొని పోయి యశోక వనమున నుంచెను. అత్రిమహామునిభార్య అనసూయాదేవి సీతకిచ్చిన దైవదత్తములగు దుకూలములవలనను అంగరాగము వలనను ఆమెకు యక్షరాక్షసాదులవలన నెట్టి భయమును లేకుండెను. ఆమె యుత్తమశీలమునకును భంగము లేకుండెను. మఱియు స్త్రీలను బలవంతముచేసినచో మరణము సంభవించు నని రావణునకు శాపముండుటచే అతఁడు సీతను బలాత్కరింప లేకుండెను. విభీషణుని పుత్రికయగు అనల సీతకుఁ జెలికత్తెయై యామె నూఱడించుచుండెను. మఱియు నిదివఱకు విద్యుజ్జిహ్వుఁడు దొంగిలించి తెచ్చిన రాముని చిత్రమును అతనిభార్య యగు మాయావతి నడిగి తెచ్చి సీతకు వినోదముకొఱకు మనశ్శాంతికిని జూపుచుండెను.

అచట పర్ణశాలకు తిరిగివచ్చినరామలక్ష్మణులు సీత నచటఁ గానక మిగుల దుఃఖించిరి. వా రామెను వెదకుచుండఁగా కొనయూపిరితోనున్న జటాయువు యాపద్వృత్తాంతమును దెల్పి ప్రాణములు విడిచెను. జటాయువున కగ్నిసంస్కార మొనర్చుటకుఁ బోయి, లక్ష్మణుఁడు తనపనిని నెఱవేర్చి వచ్చుచుండఁగా రావణునిపంపున రామవధార్థమై నిలువఁబడిన కబంధుఁడను మొండిరాక్షసుఁడు ఆతనిని చేతులతోఁబట్టి, పొట్టపైనున్న తననోటిలో వేసికొనఁదలఁచెను. లక్ష్మణుఁ

డా రాక్షసుని సంహరించెను. ఆరాక్షసుఁడు తనరూపువిడిచి దివ్యశరీరధారియయి 'స్థూలశిరుఁడను మునిశాపమువలన నాకిట్టి రాక్షసత్వము కల్గినది; నీయనుగ్రహమున శాపవిముక్తుఁడనైతిని. ఈ యుపకారమునకుఁ బ్రత్యుపకృతిగా నొకటి చెప్పెదను; అన్నయగు వాలివలన భయపడి సుగ్రీవుఁ డనుకపిరాజు ఋశ్యమూకపర్వతముపై సపరివారముగ నున్నాఁడు; మీరాతనిమైత్రిని పొంది వాలిని సంహరించి సుగ్రీవుని కపిరాజ్యమునకుఁ బట్టముకట్టినచో అతఁడు రావణసంహారమున మీకు మహోపకారము చేయఁగలఁడు' అనిపలికి వెడలిపోయెను.

రామలక్ష్మణులు కిష్కింధవైపుఁబోవుచు పంపాసరస్సు జేరిరి. వీరిని దూరమునుండియే కనుగొని సుగ్రీవుఁడు తన్ను జంపుటకయి వాలిచేఁ బంపఁబడిన వీరపురుషులేమో యని యనుమానించి యథార్థస్థితిని దెలిసికొనుటకు తనమంత్రియగు హనుమంతునిఁ బంపెను. హనుమంతుఁడును భిక్షుకవేషమున వారివద్దకువచ్చి వారు వాలిచేఁ బంపఁబడలేదని తెలిసికొని, సుగ్రీవునితోడిమైత్రికయి వారిని ప్రార్థించెను. రామలక్ష్మణులందుల కియ్యకొనిరి. యుద్ధమున వాలిచేఁ జంపఁబడినదుందుభి యస్థిపంజరమును కాలివ్రేలితో మీఁటి చాలదూర మెగఁజిమ్మి రాముఁడు హనుమంతున కాశ్చర్యముఁ గల్గించెను. మఱియు వాలిబాణములచేఁ జిల్లులువడిన సప్తసాలములను రాముఁడొక్కయమ్మున నొక్కసారిగాఁ బడఁగొట్టుటం జూచి యాంజనేయుఁ డాశ్చర్యపడెను. హనుమంతునిమూలమున రామసుగ్రీవులకు మైత్రి కుదిరెను. రాముఁడు వాలినిసంహరించి కిష్కింధారాజ్యమునకు సుగ్రీవునిఁ బట్టముకట్టెను. పిదప

సుగ్రీవుఁడు సీతాన్వేషణార్థము నలుదిక్కులకును గపిసేనను బంపెను. అందు హనుమంతుఁడు లంకకుఁ బోయెను.

అచట లంకలో రావణునికి విభీషణుఁడును, మాల్యవంతుఁడు మున్నగుమంత్రులును సీతను తిరిగి రామున కర్పింపవలసినదని హితవుఁ జెప్పిరి; కాని రావణుఁడు వానిం బెడచెవిని బెట్టెను. రాముని యద్భుతకార్యములను జూచియైనఁ బెదరి, రావణుఁడు మంచిపద్ధతికి రాగలఁడేమో యని మంత్రులు అచ్చరలచే నొకనాటకమును బ్రదర్శింపఁజేసి దానికి రావణు నాహ్వానించిరి. అందు సీతాపహరణము మొదల హనుమంతుఁడు లంకకువచ్చువఱకును గలకథ ప్రదర్శింపఁబడినది. రావణుఁడు తనవేడుకచెలికాఁడగు మహాపార్శ్వునితోఁ గూడ వచ్చెను. ఈనాటకముఁ జూచినయెడల సీతకుఁ గొంత మనశ్శాంతి కలుగునని తలఁచి యనల యామెనుగూడ నాయెడకుఁ దీసికొనివచ్చెను. మున్ను విద్యుజ్జిహ్వునిచే సీతనుండి యపహృతములైన రాత్రిసాంధ్యకరణమణికంకణములను విద్యుజ్జిహ్వునిభార్యయగు మాయావతివలన గ్రహించి యనల అందొకటి ధరింప సీత కొసఁగెను; తానొక్కటి ధరించెను. అందువలన వీరిరువురు నచటికివచ్చినను ఇతరుల కగోచరులై యుండిరి. సీత రామునికష్టములకు దుఃఖించుచు అపాయముల నుండి తప్పుకొనునపు డూఱటను బొందుచునుండెను. రావణునకు నాటకముఁజూచుటవలనఁ దఱచు రామునిపైఁ గోపము కల్గుచుండెను. ఇట్లా ప్రదర్శనము రావణునిమనస్సును మార్పనుపయోగింపకపోయెను.

జటాయువువనన్నయగు సంపాతివలన సీతయున్నచోటుఁ దెలిసికొని హనుమంతుఁడు లంకకుఁబోయి, యశోకవనమునఁ విచారగ్రస్తయైయున్న సీతంగాంచి యామెకు రాముని వృత్తాంతము నెఱిఁగించి ధైర్యము చెప్పెను. హనుమంతునివలన సీత క్షేమసమాచారములఁ దెలిసికొని రాముఁడు కొంత యూరటఁ బొందెను. పిదప హనుమత్సుగ్రీవనీలాదులు వెంటరా కపిసేనతో సముద్రమును దరిసి, సముద్రముపై సేతువును బంధించి, ఆమార్గముగ లంకను ప్రవేశించెను. రావణునికి, హితమును బోధించి, యతనియాగ్రహమునకుఁ బాత్రుఁడైన రావణ సోదరుఁడగు విభీషణుఁడు రాముఁడు సముద్రమును దాఁటుటకుఁ బూర్వమే యతనిం జేరి శరణుఁజొచ్చెను. పిమ్మట వానరరాక్షస సేనలకుఁ బోరుపొసఁగెను. రాక్షససేనానాయకుఁడగు ప్రహస్తుని వానరసేనాని నీలుఁడు వధించెను; లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించెను; రావణకుంభకర్ణాదులు రామునిచేఁ జంపఁబడిరి. విజయి యగురాముఁడు లంకారాజ్యమును విభీషణునకుఁ బట్టము గట్టెను. సీత తనపాతివ్రత్యమును బ్రకటించుచు నగ్నిప్రవేశ మొనర్చెను. అగ్నిపరిశుద్ధయగు సీతను రాముఁడు గ్రహించి, సుగ్రీవవిభీషణాదులతో, లక్ష్మణునితోడను పుష్పకవిమానము నెక్కి యయోధ్యకుఁ బయనమై తనరాకను ముందుగా భరతునకుఁ దెల్పుటకు హనుమంతునిఁ బంపెను.

శత్రువులందఱును జావఁగా మిగిలినశూర్పణఖ తనసోదరులయొక్కయు, బంధువులయొక్కయు మృతికి మిగుల విలపించి, ఎట్లయినను రామునకప్రియమునొనర్చి పగను దీర్చుకొనఁదలఁచెను. ఆమె భరతశత్రుఘ్నులను చంపఁదలఁచి హను

మంతుఁడు భరతునియొద్దకుఁ బోవుటకుమునుపే సన్న్యాసిని వేషము వేసికొని, పర్ణాదిని యను పేరు పెట్టుకొని భరతునియొద్దకు వచ్చి తాను ఋశ్యమూకపర్వతనివాసినిననియు సుగ్రీవాదుల మిత్రమననియు రాక్షసులచే రామాదులు హతులయినందున దుఃఖముతో నున్నాననియుఁ దెలిపెను. ఆమెమాటలు నిజములే యని నమ్మి భరతశత్రుఘ్నులు మిక్కిలి దుఃఖించి యగ్నిలోఁబడి మరణింప సిద్ధముగ నుండిరి. ఇంతలో జనకుఁడు నచటికివచ్చి సీతయు మరణించినవార్త తెలిసికొని, తాను నగ్నిలోఁ బడి ప్రాణములు వీడ సిద్ధపడెను. ఆసమయమున హనుమంతుఁడు వచ్చి వారిప్రయత్నమును వారించి రాముఁడు సీతాలక్ష్మణుల తోడను, మిత్రులతోడను పుష్పకవిమానారూఢుఁడై వచ్చుచున్నవార్తను తెలిపి జనకాదులకు సంతసముఁ గలిగించెను. ఇంతలో రాముఁడు, సీతమున్నగువారును వచ్చిరి. రామాదులు జనకునకు నమస్కరించి యాతనివలన దీవన లందిరి. రాముఁడును భరతునివలన రాజ్యము గ్రహించి, పట్టాభిషిక్తుఁడై ప్రజలను స్వప్రజలట్లు పాలించుచు సుఖంబున నుండెను.

---

# ఉత్తరరామచరిత్రము

## పీఠిక

ఉత్తరరామచరిత్ర మనునీనాటకమును సంస్కృతమున భవభూతి యనుమహాకవి రచియించెను. ఆమహాకవి రామాయణములోని యుద్ధకాండచివఱివఱకును గలకథను మహావీరచరితనాటకముగ వ్రాసి, శేషించిన యుత్తరకాండకథ నీనాటకరూపముగ వెలయించుటచే దీని కీపేరు కలిగినది. 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అను నానుడినిబట్టి భవభూతి యీతన్నాటకరచనమునఁ గాళిదాసుకంటెను మిన్నయని పేరు గాంచెను. దాంపత్యప్రేమను, జీవితమును వర్ణించుటలో నీకవి యందెవేసినచేయి. ఇందు సీతావివాసము, రాముని విరహము, కుశలవులయుద్ధము, సీతాపునస్సమాగమము వర్ణితములు.

ఉత్తములు తమ కెన్నికష్టములుకలిగినను వానిని లెక్కింపక లోకమునఁ బ్రతిష్ఠకొఱకుఁ బాటుపడుదురనియు, సర్వదా ధర్మమే జయించుననియు నిట్టినీతు లీనాటకకథవలన గ్రాహ్యములు.

# పాత్రములు

## పురుషులు

రాముఁడు—కోసలదేశాధిపతి; కథానాయకుఁడు

లక్ష్మణుఁడు—రామునితమ్ముఁడు

కుశుఁడు, లవుఁడు—సీతా రాములపుత్త్రులు

చంద్రకేతువు—లక్ష్మణునికుమారుఁడు

(జనకుఁడు) సీరధ్వజుఁడు—సీతాదేవితండ్రి, మిథిలాధిపతి

వాల్మీకి—వసిష్ఠుఁడు

అష్టావక్రుఁడు—అగస్త్యుఁడు } తాపసులు

దాండాయనుఁడు—సౌధాతకి

గృష్టి—దశరథు నింటఁగలకంచుకి

సుమంత్త్రుఁడు—కోసలాధిపతిసారథి

దుర్ముఖుఁడు—చారుఁడు

శంబూకుఁడు—తపస్సుచేయుచుండిన శూద్రుఁడు

మఱియు, కొందఱుపురుషులు, సేవకులు, విద్యాధరుఁడు మున్నగువారు వత్తురు

## స్త్రీలు

సీత—రామునిభార్య, కథానాయిక

వాసంతి—వనదేవత, సీతచెలికత్తె

ఆత్రేయి—ఒకతాపసి

కౌసల్య—దశరథునిభార్య, రామునితల్లి

అరుంధతి—వసిష్ఠునిభార్య

లోపాముద్ర—అగస్త్యునిభార్య

మురళ, తమస, గంగ—నదులు

భూదేవి—సీతతల్లి

మఱియు విద్యాధరి మున్నగువారు వత్తురు.

## ౮

# ఉత్తరరామచరిత్రము

శ్రీరాముడు లోకకంటకులగు రావణాదిరాక్షసులను సంహరించి, సీతతోఁగూడ నయోధ్యకు మఱలివచ్చి పట్టాభిషిక్తుఁడయి ప్రజారంజకముగఁ బాలించుచుండెను. ఒకప్పుడు రాముని సోదరియగు శాంతాదేవికి భర్తయగు ఋష్యశృంగమహాముని యొనర్చుచున్న యజ్ఞమునకయి అరుంధతీవసిష్ఠులవెంట కౌసల్యాదిజననీవర్గము వెళ్లియుండెను. సంపూర్ణగర్భవతియగుటచే సీత వారి ననుసరింపలేదు. ఆమె కెట్టిమనోవేదనయుఁ గలుగకుండుటకయి రాముడును అయోధ్యయందే యుండిపోయెను.

పెద్దలందఱును యజ్ఞవాటికయందే యున్నను సీతారాముల యోగక్షేమముల నరయుటకయి తఱచు వార్తాహరులఁ బంపుచునే యుండిరి. ఒకసారి అష్టావక్రుండను మునివచ్చి వీరి క్షేమసమాచారముల నరసెను. పూజ్యవసిష్ఠుఁ డష్టావక్రుని మూలమున సీత కిట్లు దీవనలంపెను. 'అమ్మాయీ! పూజ్యురాలైన భూదేవి నీకు తల్లి; బ్రహ్మజ్ఞానియు, బ్రహ్మసదృశుఁడునగు జనకుఁడు నీకు తండ్రి. సూర్యవంశజులగు కాకుత్స్థవంశీయులకు నీవుకోడలవైతివి; ఇట్టి నీకు వేఱేదీవన లనావశ్యకములు; నీవు వీరమాతవు కావలె నని దీవించుచున్నాము.' ఆదీవనకు రాముడు మిగుల సంతసించి 'మహామునులవాక్కులు ముందు జరుగఁబోవుదాని నిప్పుడే తెలుపు'నని వసిష్ఠునిఁ గొనియాడెను.

ఆపిదప అష్టావక్రుఁడు 'సీత గర్భవతి యగుటచే ఆమె యెట్టి కోరికకోరినను మాఱుమాటచెప్పక దానిని నెఱవేర్పవలయు' నని యరుంధతీ, కౌసల్యాదులు సందేశ మంపిరని తెలుపఁగా 'వారి యాజ్ఞను దప్పక నెఱవేర్చెద' నని రాముఁడు జవాబిచ్చెను. మఱియు 'నాయనా! మేము యజ్ఞముకొఱకయి నిన్ను విడిచి రావలసివచ్చినది; నీవా, బాలుఁడవు; రాజ్యమా, క్రొత్తది; కావున అన్ని విధముల ప్రజలమనస్సులను రంజింపఁజేయుచుఁ బాలింపుము; మీ వంశీయులకు కీర్తియే ప్రధానము' అని వసిష్ఠుఁడు పంపినసందేశమును విని రాముఁడు 'లోకము నారాధించుట కయి నాసౌఖ్యమును, స్నేహమును, దయను దూరపోసెదను; చివఱకు సీతను విడువవలసి వచ్చినను, దానికి సంసిద్ధుఁడను' అని ప్రతిజ్ఞ యొనర్చెను. దాని కష్టావక్రుఁడు మిగుల సంతసించి, రాముని యనుమతిపయి దారిబడలికను దీర్చుకొనుటకుఁ బోయెను.

ఇంతలో రాజాజ్ఞ ననుసరించి యర్జునుఁడను చిత్రకారుఁడు చిత్రించిన శ్రీరామకథాచిత్రములను లక్ష్మణుఁడు తీసికొనిరాఁగా సీతను సంతోషపఱచుట కవి యెంతయుఁ దగి యుండు నని రాముఁడు సంతసించెను. ఆచిత్రసంచయములోని చిత్రములు సీత యగ్నిప్రవేశమువఱకు ఉన్నవని తెలిసికొని, యట్టిసంఘటనకు రాముఁడు విచారించి సీతను క్షమింపవేఁడెను. సీత చిత్రములను తిరుగవేయుచు రామునిమనస్సునుమార్చెను. వారు జృంభకాస్త్రములు, సీతావివాహము, పరశురామగర్వభంగము, అయోధ్యాగమనము, మంథరావృత్తాంతము, వల్కలధారణము, గంగాతరణము, విరాధసంరోధము, ప్రస్రవణ

పర్వతము, జనస్థానము, శూర్పణఖాసంవాదము, మాయామృగము, జటాయువృత్తాంతము, పంపాసరోవరము, హనుమంతుఁడు, మాల్యవంతము, మున్నగుహానిచిత్రములం జూచుచు, ఎడనెడ చమత్కారముగ మాటలాడుకొనుచుండిరి.

వీరిట్లు వినోదముగఁ గాలము గడుపుసందర్భమున నా చిత్రములను దర్శించుటవలన సీతాదేవికిఁ బవిత్రమగు గంగానదిజలములందు స్నానముచేయుటకును, మఱల నొకసారి విపినసీమల విహరించుటకును గోరికపుట్టెను. ఆమె తనకోరికను భర్తకుఁ దెల్పఁగా 'గర్భవతికోరికలను దప్పక నెఱవేర్పవలయు' నను అరుంధత్యాదుల యాదేశము ననుసరించియు, ప్రేమైకనిధానమగు సీతాదేవికోరికం దీర్పఁదలచియు రాముఁడట్లే యని రథము సన్నద్ధముచేయుటకు లక్ష్మణునిఁ బంపెను. 'మీరు కూడ నావెంటఁ దపోవనములకు రావలయు' నని యామెఁ గోరఁగా 'ఓసి పిచ్చిదానా! అదికూడఁ జెప్పవలెనా?' యని పలికెను. అలసశరీరయగు సీతకు వెంటనే నిద్ర రాఁగా ఆమె రాముని తొడపై శిరస్సుంచుకొని నిద్రించెను.

ఇంతలో రామసందర్శనార్థమై, దేశములోఁ దన్నుగూర్చి జనులాడుకొనుమాటలు తెలిసికొని, తెలుపుటకై నియోగింపఁబడిన దుర్ముఖుఁడను సేవకుఁడు రాఁగా, ఆసంగతిని ప్రతీహారి శ్రీరామునికిఁ దెలిపెను. దుర్ముఖుఁ డంతఃపురమునను స్వేచ్ఛగా సంచరింపఁదగినవాఁడగుటచే నతనిని నిరభ్యంతరముగ లోనఁ బ్రవేశపెట్టుమని ప్రతీహారికి శ్రీరాముఁ డాజ్ఞయిచ్చెను. దుర్ముఖుఁడు వినయపురస్సరముగ శ్రీరామునిదరికివచ్చి 'ప్రభూ! మిమ్ము జనులు మిక్కిలి కొనియాడుచున్నారు. దశరథమహా

పరహాసక్షమంబగు జృంభకాదులగు నస్త్రములు స్వైవసమయినవి. మహర్షియు వారి నల్లారుముద్దుగాఁ బెంచి చౌలాదికర్మముల నొనరించి శ్రౌతవిధిని ఉపనయనమొనర్చి సమస్తవిద్యలను గఱపెను. ప్రతిభావంతులగు వారితోఁ గలిసి విద్య నభ్యసింపఁ దలఁచిన మాబోటిమందబుద్ధులకోరిక యచట దుర్లభమైనది; ఇంకొకయాటంకముగూడ తటస్థించినది. అది యేమనఁగా బ్రహ్మర్షియగు నావాల్మీకిమహర్షి యొకనాఁటిమధ్యాహ్న సమయమున స్నానాదినియమములను నిర్వర్తింపఁదలఁచి తమసానదికిఁ బోవుచు మార్గమున నొకకిరాతుఁడు క్రౌంచమిథునము నందలి పక్షి నొకదానిని చంపుచుండుటను జూచెను. అప్పు డాతని నోటినుండి కరుణావిలసితమగువాక్కు ఛందోబద్ధమయి యిట్లు వెలువడెను.

*శ్లో. మానిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచ మిథునాదేకమవధీః కామమోహితమ్.

పిదప మహర్షికి బ్రహ్మ ప్రత్యక్షమయి, వాల్మీకిఛందోమయమగు వాక్కును సృజించుటకు సంతసిల్లి శ్రీరామచరిత్రమును గ్రంథరూపమున రచింపవలయునని యానతిచ్చెను. ఇదియు నొకయాటంకము' ఆత్రేయి యిట్లు తనవృత్తాంతమును వాసంతికిఁ దెల్పి యగస్త్యాశ్రమమునకు మార్గమడుగఁగా నామె

---

*'ఓకిరాతుఁడా! నీవు, కామమోహితమగు క్రౌంచపక్షిమిథునము నందలి పక్షి నొకదానిని చంపితివి. కాన నీవు నచిరకాలముననే మరణింతువుగాక!' అని యర్థము. 'ఓరామా! నీవు కామమునఁ గన్ను గానక యున్నరాక్షసమిథునములో నొకఁడగు రావణుని చంపినందున పెక్కేండ్లు ప్రతిష్ఠను బొందియుండుమా!' అని ఇచటి యంతరార్థము.

'ఇదిగో, యీపంచవటీమార్గమునుండి గోదావరీతీరమున కేఁగుము; అచ్చటనే యాగుహామునియాశ్రమ మున్నది.' అని తెలుపఁగా ఆత్రేయ కన్నీటితో 'సఖీ! ఇది తపోవనమా! ఇది పంచవటియా! ఆకానవచ్చునదియే గోదావరియా? ఈకనఁబడు కొండ ప్రస్రవణాద్రియా? అట్లయిన, అమ్మా! నీవు జనస్థానవన దేవతయగు వాసంతివి కావా?' అని యాతురతతోఁ బ్రశ్నింపగా వాసంతి 'అవు' నని సమాధానమిచ్చెను. పిదప ఆత్రేయికి సీత జ్ఞప్తికి రాఁగా దుఃఖించుటను జూచి వాసంతియు విలపించి యాత్రేయివలన సీతాదేవివృత్తాంతమును దెలిసికొని 'వసిష్ఠాదులును, అరుంధతి యున్నగువారును, దశరథభార్యలును దీని కంగీకరించిరా?' అని ప్రశ్నింపఁగా ఆత్రేయి 'సీతను వనమున కంపునపుడు వారెవ్వరును ఇంట లేరు, ఋష్యశృంగుఁడు ప్రారంభించినయజ్ఞముం జూడ నేఁగియుండిరి. పండ్రెండేండ్లు జరుగవలసిన యాయజ్ఞ మిప్పుడు పరిసమాప్తమైనది. అంతదనుక యజ్ఞవాటికయం దుండిన అరుంధత్యాదులు సీతలేనియయోధ్యకు మఱలిరా నంగీకరింపరైరి. రామమాతలును, అరుంధతీవసిష్ఠులును వాల్మీకియాశ్రమమున నివసించుటకు నిశ్చయించిరి.' అని తెలిపెను. అంత వాసంతి రామునివృత్తాంతము నడుగఁగా 'అతఁడు బంగారుతోఁ జేయఁబడిన సీతాప్రతిమను గృహిణిగా నుంచుకొని యశ్వమేధయాగముం జేయఁబూని, యాగాశ్వము వెంట లక్ష్మణకుమారుఁడగు చంద్రకేతువును ససైన్యముగఁ బంపె.' నని యాత్రేయి తెలుపఁగా వాసంతి కొంత తృప్తి నొందెను. మఱియు నొకబ్రాహ్మణుఁడు మృతుఁడగు తనపుత్త్రుని మోసికొని రాజద్వారమునకడకువచ్చి గుండె బాదుకొనుచు

'రాజ్యమున నెద్ది యేని యన్యాయము జరిగియుండవలెను; లేనియెడ పసిబాలుఁడగు నాపుత్రుఁ డేల మరణించును?' అని గోలచేయుచుండఁగా రాముఁడు మిక్కిలికలఁతపడెను; వెంటనే యాకాశవాణి 'ఓరాజా! శూద్రులు తపమొనర్ప రాదను నియమము నతిక్రమించి శంబూకుఁడనుశూద్రుఁడు ఘోరతపం బొనర్చుచున్నాఁడు; ఆయధర్మమువలననె యీబ్రాహ్మణబాలకుఁడు మరణించెను; నీవాశంబూకుని వధించి యీబాలుని బ్రతికింపుము' అని పలికినది. రాముఁడును ఆశూద్రునికయి దశదిశలు వెదకుచున్నాఁడు' అని యాత్రేయి తెలుపఁగా, వాసంతి 'అట్లయిన రాముఁ డిచ్చటికి తప్పకవచ్చును; ఆశంబూకుఁ డీజనస్థానమునందే తపస్సుచేయుచున్నాఁడు' అని కొంత సంతసించెను. అంత మధ్యాహ్నమగుటచే వారు తమ తమ నెలవుల కరిగిరి.

పిదప రాముఁడును జనస్థానమునకు వచ్చి శంబూకుని సంహరించి బ్రాహ్మణపుత్రుని బ్రదికించెను. మృతుఁడైన శంబూకుఁడు దివ్యరూపము ధరించి రాముని వేనోళ్లఁ గొనియాడి 'సర్వశరణ్యుఁడవగు నోప్రభూ! జనులందఱును నిన్ను వెదుకవలసియుండఁగా నీవు మృతుఁడనగు నన్ను వెదకుచు వందలకొలఁది యోజనములదూరము వచ్చుటకు నాతపస్సే కారణమయినదిగదా! నే నధర్మవృత్తిం దప మొనర్పనిచో అయోధ్యనుండి నీ వీదండకారణ్యమునకు వచ్చియుండవుగదా!' అని పలుకుటచే నది దండకాటవి యనియు శంబూకుని సంభాషణమునుబట్టి తా మున్నది జనస్థానమనియుఁ దెలిసికొని రాముఁడు సీతస్మరణము రాఁగా మిగుల విలపించెను. అతని పరిదేవనమును

మూన్పుటకు శంబూకుఁ డచటి నెలవేళ్లను తీఁగలను వర్ణించి కొంత చిత్తశాంతిని కల్గించి యగస్త్యమహాముని దర్శింపఁ బోయెను. రాముఁడును చిరపరిచితములగు నాపరిసరప్రదేశము లను దర్శించుచు విలపించుచు ఆయాస్థలముల మార్పునకు అచ్చెరువందుచు వర్ణించుచుండఁగా శంబూకుఁడు మరలవచ్చి లోపాముద్రయు, నగస్త్యుఁడును, తక్కుంగల మునులును రాము నాహ్వానించుచున్నట్లు విన్నవింపఁగా రాముఁ డతనితోఁ గూడ నగస్త్యాశ్రమమున కేఁగెను.

రాముఁడు సీతావిరహమున నత్యంతము కృశించి యుండుటను గమనించి యగస్త్యమహాముని భార్యయగు లోపాముద్ర రాముఁ డెట్లును పంచవటి మున్నగుపరిచితప్రదేశ ములకు వెళ్లకమానఁడనియు అట్లు వెళ్లినచో వెనుకటిదినములు జ్ఞప్తికివచ్చి సీతావియోగమునఁ బొంగి పొరలివచ్చుదుఃఖము నాపుకొనఁజాలక ఎట్లును మూర్ఛితుఁ డగు ననియు నందువలన అతని కెట్టికష్టమును కలుగకుండ నొకకంటఁ గనిపెట్టి మన శ్శాంతిని గల్గింపవలెనని గోదావరీనదికి మురళ యను నదిమూల మున వర్తమాన మంపెను. మురళ గోదావరియొద్దకుఁ బోవు చుండఁగా తమసానది యామెం గలిసికొని యీవృత్తాంతమును దెలిసికొనెను. దీనిని విని తమస రామునియెడ నీవటకే తగిన జాగ్రత్త తీసికొనఁబడినది.' అని పలికి 'అదెట్లు?' ని మురళ ప్రశ్నింపఁగా నిట్లు చెప్పెను. 'లక్ష్మణుఁ డట్లు సీతాదేవిని వాల్మీకి తపోవనప్రాంతమున విడిచిపోఁగానే ఆమె దుఃఖభారమునఁ గంగలో పడి యందే యిద్దఱుపుత్త్రులను ప్రసవించెను. పుత్త్రు లతోఁగూడ నామెను గంగయు భూదేవియుఁ బాతాళమునకుఁ

దీసికొనిపోయి యచట భద్రముగఁ గాపాడిరి. స్తన్యమును విడుచు వయస్సురాఁగానే గంగాదేవి యాబాలుర నిరువురను వాల్మీకి కప్పగించెను. వారచ్చట పెరిగి పెద్దవారై సమస్త విద్యలయం దారితేరిరి. రాముఁడు శంబూకవధార్థము జనస్థానమునకుఁ బోవుసమాచారమును గంగాదేవి సరయువువలనఁ దెలిసికొని, లోపాముద్రవలెనే రామునియెడఁ గనికరముచెంది యేదో యొకమిష పెట్టుకొని సీతతోఁగూడ గోదావరీతీరమును జేరినది. అందునను రామునిశోకము కొంత యుపశమింప వచ్చును.' దానికి మురళ 'భాగీరథితలంపు బాగుగనే యున్నది; కాని యామె సీతమూలమున రామున కెట్లూరటకల్గింపఁ దలఁచినదో యెఱుఁగలేకయున్నాను.' అని పలుకఁగా దానికి తమస యిట్లు బదులుచెప్పెను. 'భాగీరథి కుశలవుల పండ్రెండవ పుట్టినదినమున *జన్మగ్రంథులనువేసి వంశమూలపురుషుఁడగు సూర్యదేవునిఁ బూజింపవలె నని సీతతోఁ జెప్పెను; భాగీరథి ప్రభావమువలన సీత వనదేవతలకుఁగూడ కానరాక యదృశ్యరూపయైయుండును. గంగ సీత నట్లాజ్ఞాపించి నన్ను సీతకు దగ్గఱనుండి సహాయ మొనరింప నియమించినది. కావున నామె యత్నము కొంత ఫలింపవచ్చును.' మురళ దీనిని లోపాముద్రాదేవికి విన్నవింపఁబోయెదననియు, రాముఁడుకూడ నీపాటికి

*తమసంతానమున కెన్నియేండ్లవయస్సుండునో, ఆ వత్సరములసంఖ్య ననుసరించి, వత్సరమునకొక్కటివంతున గ్రంథులను (ముడులను) బంధించుట సంప్రదాయమును, శాస్త్రసిద్ధము నయియున్నది. ఆ నియమము ననుసరించి జానకీదేవి పండ్రెండు గ్రంథులనుబంధించి (ముళ్లువేసి) కులదేవతనారాధింపవలె నని భాగీరథియానతి.

వచ్చియుండవచ్చు ననియుఁ బలికెను. వారిరువురును సీతాదేవి గోదావరిలో మజ్జనమొనరించి బయటికివచ్చుటను జూచి, ఆమె మూర్తీభవించిన శోకదేవతవలె మిగులఁ జిక్కిపోయి యుండుటకు విచారించిరి.

జానకీదేవి స్నానము చేసి సూర్యభగవానుని పూజకయి పూవులను గోయుచుండఁగా 'అయ్యో! ప్రమాదము; ప్రమాదము. సీతాదేవి ముద్దుగాఁ బెంచుకొన్న గున్న యేనుఁగు భార్యతోఁగూడ నీటియం దాటలాడుచుండఁగా మదపుటేనుఁగొకటి దానిపైకివచ్చినది.' అనుమాటలు వినఁబడఁగా స్వరమును బట్టి యట్లు పలికినది వనదేవత యగు వాసంతియని తెలిసికొని, విశ్వసించి—'ఆర్యపుత్రా! నాకుమారుని రక్షింపుము రక్షింపుము.' అని పంచవటీదర్శనమున యలవాటు ననుసరించి యుచ్చరించియు తనపొరపాటు గ్రహించి దుఃఖాతిరేకమున మూర్ఛపోఁగా వెంటనే తమస వచ్చి శీతలోపచారముల నొనరించెను. ఇంతలో 'విమానరాజమా! నీ విచటనే నిలువుము.' అను రామునిమాటలను విని సీత భయసంభ్రమములతో డిగ్గున లేచి, ఇది భర్తగారికంఠస్వరమే' యని సీత పలుకఁగా 'కావచ్చును; తపమొనర్చుశంబూకుని శిక్షించుటకయి రాముఁ డిచ్చటికి వచ్చె నని వింటి' నని తమస పల్కెను. రాముఁ డచటి పరిచితప్రదేశములను జూచి, సీత తలఁపునకుఁ రాఁగా విచారించుటం గాంచి సీత మూర్ఛపోయి తమస యూపచరింపఁగా తేరుకొనెను; రాముఁడు సీతం దలఁచుచు, దుఃఖాతిరేకమున మూర్ఛపోఁగా, అతని నెట్లయిన రక్షింపవలె నని సీత తమసను గోరఁగా ఆమె అమ్మాయీ! నీకరస్పర్శమే యాతనిని దేలుకొనఁజేయు' నని

ప్రోత్సహింపఁగా 'ఏది యెట్లయినం గానిమ్ము; నీయానతిని నెఱవేర్చెద' నని పలుకుచు జానకి రాముని౯ దాకి తెలివి తెప్పించెను. ఆస్పర్శమున రాముఁడు అమందసుఖము ననుభవించి 'దేవి నన్ను స్పర్శించినట్లున్న' దని యనుకొనెను. తన్నాతండు చూచెనేమో యని సీత శంకింపఁగా తమస 'అట్లు శంకింపఁ బనిలేదు; భాగీరథివరమునంగతి మఱచితివా!' యని సీత సందేహమును పోఁగొట్టెను. స్పర్శసుఖ మనుభవించిన రాముఁడు తన కచ్చట నెవ్వరును కనఁబడక పోఁగా మిగుల నాశ్చర్యపడెను. ఇంతలో నతనికి 'అయ్యో! ప్రమాదము, ప్రమాదము—' అని యిదివఱకు సీతకు వినఁబడినమాటలే వినరాఁగా, రాముఁడు 'దేవి పుత్త్రునిరీతిఁ బెంచిన యాగున్న యేనుఁగును ఎదిరించినదురాత్ముఁడెవ్వఁ?' డని యనుచుండఁగా వాసంతి వచ్చి రాముని౯ జూచి సంతసించి 'దేవా! ఇదిగో! జటాయుతీర్థమునకు దక్షిణముగా సీతాతీర్థముకడ గోదావరిగట్టు దిగి తా మాయేనుఁగుగున్నను కాపాడవలయు' నని ప్రార్థించెను. రాముఁడు వాసంతిని గుర్తుపట్టి యామెమాటలు హృదయమర్మములను భేదింపఁగా విచారముతో నావైపు మఱలెను. కాని, రాముఁడు శ్రమపడనక్కఱలేకయే యాయేనుఁగుగున్నయే జయించినందున అందఱును మిగుల సంతసించిరి.

అప్పుడు సీత తమసతో 'అమ్మా! తమసా! అప్పటి పిల్లయేనుఁగిట్లు పెద్దదయి సంతసము గొల్పుచున్నది. పుత్త్రులగు కుశలవు లీపరి కెట్లుందురో?' అని యడుగఁగా 'వారును ఈ రీతినే యుందు' రని యామె సమాధానమిచ్చెను. తరువాత 'నాకుఁ బతివియోగమే కాక పుత్త్రవియోగమును విధి నియ

జించుటచే, నావంటిమందభాగ్యురాలు పుత్రవతియైననేమి? కానున్ననేమి?' అని జానకి విచారింపఁగా 'అంతయు విధివిలసిత' మని తమస జబాబిచ్చెను. అప్పుడు వాసంతి జానకి పెంచిన వనమయూరమును పర్ణశాలాప్రదేశమును జూపఁగా రాముఁడు మిక్కిలి దుఃఖముతో విలపించుచు వాసంతికోరికపయి నొకయెడఁ గూరుచుండెను, సీతయు దిరస్కరిణీ ప్రభావమున నదృశ్యయై తమసతోఁగూడ నచట నేయుండి రాముని స్వేచ్ఛగాఁ జూచుచుండెను. వాసంతియు రామునికోరికపయిం నతని చేరువఁ గూరుచుండెను.

వాసంతి పిదపఁ గన్నీళ్లతో 'మహారాజా! కుమారలక్ష్మణునకు సేమమా?' అని ప్రశ్నింపఁగా విచారవ్యగ్రుఁడగు రాముఁడు దానిని వినిపించుకొనకపోఁగా ఆమె మఱల ఆప్రశ్ననే వేసెను. రాముఁ డట్టి సంబోధనను, ప్రశ్ననుబట్టి యామెకు సీతావృత్తాంతము తెలిసియుండు నని గ్రహించి 'సేమమే' యని జబాబిచ్చెను. పిదప వాసంతి యేడ్చుచు 'ఎంత ఘోర మాచరించితివి, దేవా! నీవే నాజీవితమువు; నారెండవ హృదయము నీవే; నాచూపులకు వెన్నెలవు; అమృతమువు— అను నిట్టిమాటలచే అమాయికయగు సీతను నమ్మించి, తుదకు ఇట్టిఘోరమున కొడిగట్టుట న్యాయమా?' అని ప్రశ్నింపఁగా 'లోకాపవాదమున నట్లు చేయవలసివచ్చె నని రాముఁడు జబాబిచ్చెను. అంత వాసంతి 'దేవా! ఎంత కఠినహృదయుఁడవైతివి! నీవు లోకులవలనఁ గీర్తినే కోరితివి. ఈఘోరమువలనఁ నీకపకీర్తి కలుగదా! నిర్జన మగు నడవిలో విడిచిన యా సీతసంగతి యేమై యుండునో ఆలోచించితివా?' అని పలుకఁగా రాముఁడు విపరీత

ముగ దుఃఖించుచు 'ఆలోచన కేమున్నది? ఆమె క్రూరమృగముల వాతఁబడి యసువులఁ బాసియుండును.' అని విచారమును పట్ట జాలక 'ఓ పౌర జానపదులారా! దేవియగు సీత యింట నుండుట కిష్టపడక మీరు లేనిపోని నిందకల్పించితిరి; మిమ్ము తృప్తిపఱచుట కయి గడ్డిపోచవలె నే సామెను విడిచిపెట్టియుఁ బశ్చాత్తాపపడ నైతిని. ఆమె పరిచయమువలనఁ గల్గినభావములు పొంగిపొరలి నామనస్సు నిప్పుడు ద్రవింపఁజేయుచున్నవి. అశరణస్థితిలో నే నిప్పుడు విలపించుచున్నాను. ఇపుడు మీరు సంతుష్టులైనారు కదా!' అని పలుకుచు వలవలయేడ్చెను. సీతాదేవి తనచెలియగు వాసంతి శ్రీరాముని నిష్ఠురముగ నిందించి యతనిమనస్సునకు క్షోభను గల్గించినందులకు మిగుల నొచ్చుకొని 'ఆర్యపుత్రా! నే నిచ్చటనే యున్నాను; మరణింప లేదు' అని తనలోనే యను కొనెను. 'దేవా! గతమునకు విచారింపక ధైర్యము నవలం బించవలె' నని వాసంతి హెచ్చరింపఁగా రాముఁడు 'దేవిని విడిచి పండ్రెండేండ్లు నిండినవి; ఆమెపేరును విస్మృతప్రాయ మైనది. ఇంతవఱకును రాముఁడు జీవించియే యున్నాఁడు; ధైర్యమునకుఁ గొఱంతలేదు.' అని మఱియుఁ బెక్కువిధముల విచారించెను. వాసంతి యెట్లయిన నాతని మనస్సును విషయాం తరమునకు మరల్పఁదలఁచి చిరపరిచితములగు జనస్థానప్రదేశ ములను జూచి, గౌరవింపఁగోరఁగా రాముఁడు 'సరియే' యని లేచెను. దీనివలన రామున కుపశాంతి కల్గుటకు బదులు దుఃఖ మధికమగు నని సీత తలంచెను. వాసంతి యొకలతాగృహమును జూపి వెనుక సీతతో నందించినదినములు స్మరణకు తేఁగా రాముఁడు విలపించుచు మూర్ఛపోయెను. అతని యవస్థను జూచి సీతయును

మూర్ఛిల్లి తమస చేసినయుపచారములవల్ల తెలివితెచ్చుకొని, రాముని స్పృశించి అతనికిని తెలివితెప్పించెను. కాని యామె భర్తను స్పృశించి పరవశయగుటచే తనచేతిని క్షణకాల మట్లే యుంచుటచే రాముఁడాహస్తమును గ్రహించి సీత తనయెదుటనే యున్నదనియు, తనకు స్పర్శసుఖము నొసంగెననియు, తానామె హస్తమును గ్రహించితిననియు వాసంతితోఁ బలుకఁగా నామె తన కేమియుఁ గానరానందున రామున కున్మాదము కల్గెనని యనుకొనెను. సీత తనపొరపాటును గ్రహించి, మెల్లగఁ దనహస్తమును లాగికొని, దూరముగాఁ బోయెను. అపుడు 'చేఁజిక్కిన సీత తప్పించుకొని పాఱిపోయె నని విచారింపఁగా వాసంతి 'దేవా! నీ దుఃఖము మితిమీఱి యిట్టి భ్రాంతికల్గుచున్నది. ఇఁట సీత యెక్కడ? ధైర్య మవలంబింపుము' అని పలుకఁగా రాముఁడు వాసంతికిఁగూడ సీత కానరానందున తనకు గలిగినది స్వప్నానుభూతియే యని నిశ్చయించుకొనెను.

వాసంతి పిమ్మట రావణ, జటాయువుల యుద్ధరంగమును జూపఁగా రాముఁడు మైమఱచి రావణునిఁ జంపుటకు వెడలఁ దలఁచియు వాసంతిచే వారింపఁబడి సీతకొఱకు ఎక్కువ విలపించెను. అట్లు విలపించి 'వాసంతీ! ఇప్పుడు రామునిఁ జూచు నేత్రములకు దుఃఖముతప్ప సంతోషము కలుగదు. నిన్నింకను నొప్పించుట నాకిష్టముగ లేదు, సెలవిమ్ము నేను పోయెదను' అని పలుకఁగా సీత యా మాటలు విని తానును పోయెద నని తమసతోఁ జెప్పఁగా ఆమె పూజానిమిత్తము గోదావరీతీరమునకుఁ బోవలెనని చెప్పె.

తాను అశ్వమేధయాగమును జేయుసంగతిని రాముఁడు వాసంతికిఁ దెల్పి వేగముగాఁ బోవలెనని చెప్పఁగా నామె 'మఱల వివాహమాడితివా ?' అని వేసిన ప్రశ్నకు 'స్వర్ణమయమగు సీతాప్రతిమను గ్రహించితి' నని జబాబుచెప్పఁగా వాసంతియు, సీతాతమసలును సంతసించిరి. సీతకు రామునియెడఁ గల కోంచెపుటనుమానమును దీనివలన మటుమాయమయ్యెను. పిదప రాముఁడు విమానమునెక్కి యయోధ్యకుఁ బోయెను. సీతాతమసలు గోదావరీతీరమున కేఁగిరి.

శ్రీరాముఁడు సీతను విడిచిన వృత్తాంతమును విని సీతాజనకుఁడగు సీరధ్వజుఁడు వికలచిత్తుఁడై వైఖానసవృత్తి నవలంబించి చంద్రద్వీపమున తపమాచరించుకొనుచు ఒకపుడు ప్రియమిత్రుఁడగు వాల్మీకిమహామునిని జూడ నెంచి యాతని యాశ్రమమునకువచ్చెను. ఆసమయముననే, ద్వాదశవార్షికసత్రము ముగిసినపిదప అయోధ్యకుఁ బోవొల్లక, ఋష్యశృంగుని యాశ్రమమునుండి యరుంధతీ కౌసల్యాదులును, వసిష్ఠమహర్షియు వాల్మీకిమహర్షి యాశ్రమమునకు రాఁ దటస్థించెను. అతిథులను గౌరవించుటకయి మహర్షి యొనరించు ప్రయత్నములను వర్ణించుచు, దాండాయనుఁడు, సౌధాతకియు నను మునికుమారులీయంశములను వెల్లడించిరి.

సీరధ్వజాపరనాముఁడగు జనకుఁ డాయాశ్రమమున నొంటరిగాఁ గూరుచుండి సీతవిషయముసే తలపోయుచు మిక్కిలి విచారించుచుండెను. జనకుఁ డచ్చట నున్నసంగతి విని వసిష్ఠుఁడు కౌసల్యతో 'స్వయముగా పోయి, యతనిం జూడవలయును' అని పలుకఁగా, ఆమెకు—చూచుటకు మొగము

చెల్లకున్నను వసిష్ఠుని యాజ్ఞను దిరస్కరింపఁజాలక గృష్టియను కంచుకి ముందు నడువఁగా, అరుంధతీదేవితోఁగూడ జనకుఁ డున్నతావునకు వచ్చెను. జనకుఁడు దూరమునుండియే ఆవచ్చు వారిం గాంచి, కౌసల్యాదేవిపోలికకట్టుటకు వీలులేనట్టుగా మాఱిపోయినందుల కాశ్చర్యపడెను. వారు సమీపించిన తోడనే యరుంధతికి నమస్కరించి, ప్రశంసించి, గృష్టిం జూచి 'ప్రజాపాలకుఁ డగు ప్రభునిమాతకు సేమమేగదా?' అని ఎత్తి పొడుపుగాఁ బ్రశ్నించెను. అందులకు గృష్టి 'ఓరాజర్షి! రామభద్రుఁడు సీతనువిడిచె ననుకోపముచేతనే యీదేవి యింతవఱకును తనపుత్రునిఁజూడక, అయోధ్యకయినను వెళ్లకయున్నది. అట్టి మాకౌసల్యాదేవి దుఃఖముతోఁ గుమిలిపోవుచుండఁగా మఱియు నీ విట్లు పల్కి బాధించుట తగదు. రామభద్రుఁడు మాత్ర మేమి చేయఁగలఁడు? లోకులు కాకులవంటివారు; సీతాదేవి యగ్నిశుద్ధయైనను అల్పబుద్ధులగువారు ఆడుకొను మాటలవలన నతఁ డట్లు చేయవలసివచ్చెను.' అని బదులు పలికెను. ఆమాటలు విని జనకుఁడు సీత యగ్నిప్రవేశముచేసి పవిత్రయగుటకును దుఃఖించెను. ఈసంఘటనను చూచుచు, ప్రసంగమును వినుచున్న కౌసల్య దుఃఖాతిరేకమున మూర్ఛపోయెను. జనకుఁ డదిచూచి యత్యంతమృదువగు కౌసల్యాహృదయమును నొప్పించి తా నీస్థితికిఁ దెప్పించుటకు మిగుల వగచి ఆమెముఖముపయి కమండలూదకమును చల్లి తెలివి తెప్పించెను. స్మృతిపొందినకౌసల్య సీతను దలఁచి పరిపరివిధముల వాపోయెను. దశరథుఁ డిట్టికష్టములను జూడకయే స్వర్గము నలంకరించినందుకును, తాను బ్రదికియుండి వీనిం జూడ

వలసివచ్చినందులకును జనకుఁడు మిగుల దుఃఖించెను. కౌస ల్యయును దుఃఖించుచుండఁగా అరుంధతి యామె నూరడించెను.

ఇంతలో కోలాహలము వినరాఁగా, జనకాదులు పరికించి అనధ్యయనము కారణమున మునికుమారులాడుకొనుచుండఁ కలకల మని గ్రహించిరి. ఆమునిబాలకులనడుమ నొక తేజస్వి రామునిపోలిక కలిగియుండుట చూచి కౌసల్య యుత్సాహముపొందెను. భాగీరథివలన కుశలవులవృత్తాంతము నిదివఱకే యెఱిఁగినయరుంధతీదేవి మిగుల సంతోషించి యీతఁడు కుశలవులలో నెవ్వఁడో యని యాలోచించుచుండెను. ఆకుఱ్ఱవాఁడు క్షత్రియబ్రహ్మచారి యయియుండు నని కంచుకి యగు గృష్టి యనుకొనెను. జనకుఁ డాబాలుని వర్ణించి యీతఁడెవ్వఁడై యుండునని గృష్టి నడుగఁగా అతఁడు తనకుఁ దెలియదనెను. జనకుఁడు 'పోనిమ్ము! మహర్షి వాల్మీకినే యడిగి తెలిసికొందము; కాని నీవు ముందుగా ఆబాలునియొద్దకుఁబోయి 'బాలకా! కొందఱు వృద్ధులు నిన్ను చూడఁగోరుచున్నా రని చెప్పి, అతనిని దీసికొనిరమ్ము' అని చెప్పఁగా గృష్టి 'యట్లే' యని పోయి లవునిఁ దీసికొనివచ్చెను. లవుఁడు వారందఱికిని సవినయముగ నమస్కరించి దీవనలందెను. ఆబాలునియాకారమే కాక, కంఠస్వరముకూడ రాముని సామ్యమును దెల్పుటచే కౌసల్య యానందముతో జనకునివైపుచూచి 'ముఖము సీతముఖమును బోలియున్న' దని చెప్పఁగా అతఁడు నట్లే యూహించెను. కౌసల్య లవునిఁగూర్చి 'నీతల్లి యెవరు?' అని ప్రశ్నింపఁగా నతఁడు 'నాకుఁ దెలియదు; నేను మహాముని వాల్మీకికి సంబంధించినవాఁడను' అని చెప్పెను. ఇంతలో 'ఓసైనికులారా!

మీలో నొక్కఁడునుగూడ ఆశ్రమసమీపప్రదేశమువైపు పోఁగూడదని కుమారచంద్రకేతు వాజ్ఞాపించుచున్నాఁడు' అను మాటలు వినఁబడఁగా—అశ్వమేధాశ్వరక్షణార్థము ససైన్యముగ లక్ష్మణపుత్త్రుఁడగు చంద్రకేతువు వచ్చినసమాచారము నీవఱకే యెఱిఁగియున్న అరుంధతీజనకు లతనిం జూడవచ్చునని కుతూహలపడిరి; కౌసల్యయు నాసంగతిని దెలిసికొని సంతసించెను. చంద్రకేతువు లక్ష్మణపుత్త్రుఁడని లవుఁడు జనకునివలనఁ దెలిసికొని 'ఊర్మిళాపుత్త్రుఁడు జనకరాజదౌహిత్త్రుఁ డితఁడేనా!' అని తనకథాకథనపాండిత్యమును వెల్లడించెను. పిదప జనకుఁడు 'నీకు వారివృత్తాంతమంతయుఁ దెలిసియున్నచో, దశరథపుత్త్రులకు ఏయేభార్యలయం దెవ్వరెవ్వరు జన్మించినదియు వివరింపు' మని లవుని బ్రశ్నింపఁగా 'దానిని మాకు వాల్మీకి మహర్షి చెప్పలే' దని లవుఁడు జవాబిచ్చెను. మఱియు నతఁడు 'మహర్షి రామాయణమును పూర్తిగా రచించెనుగాని, కొంత భాగమునే ప్రచురించెను. అందలియొకభాగమును—అప్సరసలచేఁ బ్రదర్శింపఁజేయుటకయి నాట్యశాస్త్రవేత్తయగు భరతమహామునియాశ్రమమునకు శిష్యులమూలమునఁ బంపెను. ఆగ్రంథముపయి వాల్మీకిమహర్షికి మక్కువ యెక్కువ. కావున తత్సంరక్షణార్థము మునిపుత్త్రులతోఁబాటు నాసోదరుఁడగు కుశుఁడు చాపహస్తుఁడు పంపఁబడెను' అని చెప్పెను. 'కుశుఁడు నీకు అన్నయా?' అని కౌసల్య ప్రశ్నింపఁగా 'జన్మముచేత అతఁడే పెద్ద' యని తాము కవలగుటను దెల్పెను. 'మహర్షి మీకు రామాయణకథ నెంతవఱకుఁ జెప్పె?' నని జనకుఁడు ప్రశ్నింపఁగా లవుఁడు 'అసత్యమగు పౌరాపవాదమును విని

రాముఁడు ఆజ్ఞాపింపఁగా, ఆయానతి ననుసరించి లక్ష్మణుఁడు సీత నొంటరిగా అడవిలో విడిచి వచ్చినంతవఱకు' నని సమాధానమిచ్చెను. ఆమాటలను విని కౌసల్యాజనకులు దుఃఖించుటను జూచి 'వీరెవ్వరు?' అని లవుఁ డరుంధతి నడిగెను. 'ఈమెఁ కౌసల్య; అతఁడు జనకుఁడు' అని యామె, తెల్పఁగా లవుఁడు గౌరవ, ఖేద, కౌతుకములతో వారిం జూచుచుండెను. దుఃఖోద్రిక్తుఁడగు జనకుఁడు మిగుల కోపముతో శస్త్రమునుగాని, శాపమునుగాని ప్రయోగింపఁ దలంపఁగా అరుంధతి యాతని కోపము నుపశమింపఁజేసెను.

అప్పుడు కొందఱు ఋషికుమారులు పరుగెత్తివచ్చి 'గుఱ్ఱము, గుఱ్ఱమని యిదివఱకు వినుటయే గాని, ఆమృగ మిపుడు ప్రత్యక్షముగా వచ్చినది' అని దానిస్వరూపమును వర్ణించి చెప్పి, దానిని వెంబడించుటకు రావలె' నని లవునిఁ బిలుచుచు, లాగసాగిరి. లవుఁడు పెద్దలయొద్ద సెలవుతీసికొని వారివెంబడి పోయెను. అవశ్యముగ నొకసారి చూడవలె నని వాల్మీకి మహాముని కబు రంపఁగా అరుంధతీజనకాదు లేఁగిరి.

పిదప లవుఁడు ఋషికుమారులతోఁ బోయి గుఱ్ఱమును దానిలలాటమునఁ గట్టఁబడినపటమునందలి 'ఈయశ్వమును సప్తలోకైకవీరుఁడును, రావణాంతకుఁడునగు శ్రీరాముఁడు విడిచిపెట్టెను; శూరులైనవా రున్నయెడల దీనిం బట్టుఁడు.' అనునక్షరములను జూచి పౌరుషముతో 'ఏమేమీ! భూమిపై వేఱు క్షత్రియులే లేరా?' అని గట్టిగాఁ బలికెను. అంతియగాక రాళ్లతోఁ గొట్టి యశ్వమును మళ్లించి, రోహితమృగములనడుమఁ జేర్పవలెనని మునికుమారులతోఁ బల్కెను. ఇంతలో నొకవీర

పురుషుఁడు కోపముతో వచ్చి 'ఓబాలకా! నీమాటలు సహింపఁ రానివి; కుమారచంద్రకేతువు చండశాసనుఁడు; ఈయరణ్యములోని వింతలఁజూచుచు, నింతవఱకిచ్చటికి రాకున్నాఁడు; అతఁడువచ్చిన నపాయము; అతఁడు రాకముందే యీచెట్లచాటునఁ బాఱిపొమ్ము' అని పలికెను. ఆమాటలు విని మునిబాలకులు బెదరి పాఱిపోయిరి; లవుఁడు మాత్రము భీతిల్లక నవ్వుచు, వింట బాణమును సంధించెను.

ధనుర్బాణహస్తుఁడగు లవుఁడు సేనల నెదిర్చి, తీవ్రముగఁ బోరుచు వానిని దఱుముఁగొట్టుచుండఁగా సైన్యములోనివీరులు చెల్లాచెదరై పరుగిడసాగిరి. అట్టిసమయమున సుమంత్రుఁడు నడపురథము నధిరోహించి, చంద్రకేతు వచటికి రాఁగా, సేనలకుఁ గొంతధైర్యము కలిగెను. ఒంటరిగా లవుఁడు పెక్కుమందితోఁ బోరుచుండుటకు సుమంత్రచంద్రకేతువులు మిగుల నచ్చెరువందిరి. చంద్రకేతువు తక్కినసైనికులనువిడిచి, తనతోనే పోరవలెనని లవుని గోరెను. ఇంతలోఁ జంద్రకేతువు వచ్చుటను గాంచి, పాఱిపోయినవీరులు మఱల ముందునకువచ్చి లవుని వెనుకనుండి యెదుర్కొనిరి. ఒక్కనిపైకిఁ బెక్కుమంది వచ్చుట యన్యాయమనియు, ఒకవేళ అతనినిపట్టినను అందువలన అవమానమేగాని కీర్తికలుగదనియు తనసేనలోనివీరులకు చంద్రకేతువు బోధించెను. కాని యింతలో లవుఁడు జృంభకాస్త్రములను ధ్యానించి, తత్ప్రయోగమువలన సైన్యములను కదలకుండ నిలిపివేసెను. ఆయస్త్రమును జూచి, సుమంత్ర, చంద్రకేతువులు మిగుల నాశ్చర్యపడిరి. రామునకే రావలసిన యీయస్త్ర మితని కెట్లబ్బెనో యని సుమంత్రుఁ డాలోచించు

చుండఁగా నది వాల్మీకియనుగ్రహమువలన లభించియుండునని యును, మంత్రద్రష్టలగు మహర్షుల కసాధ్యమగునస్త్రము ఏదియు నుండదనియు, చంద్రకేతువు సమాధానమిచ్చెను. పిదప లవుఁడు చంద్రకేతువును సమీపింపఁగా, వారిరువురి యాకార సాదృశ్యమును వీరావేశమును జూచి సుమంత్రుఁడు ముచ్చట పడెను. లవచంద్రకేతువులకుఁ బరస్పరము వైరమునకుఁబదులు స్నేహము కలిగెను. వారిరువురును పరస్పరమభివాదన మొనర్చు కొనిరి. చంద్రకేతువు రథమునుండి దిగుటంజూచి లవుఁడు రథము నెక్కవలెనని యతనిం గోరెను. 'అట్లయిన నీవును రథము నధిరోహించుట న్యాయ్య'మని చంద్రకేతువు కోరఁగా, లవుఁడు 'అరణ్యకుఁడనగు నాకు రథగమన మపరిచిత' మని పలికెను. సుమంత్రుఁడు 'కుమారా! నీపరాక్రమము, సౌజన్య మును, మర్యాదయును మెచ్చఁదగినవి. ఇక్ష్వాకువంశజుఁడగు రామభద్రుఁడే యిట్టి నిన్ను గాంచినచో, అతనిహృదయము ప్రేమచే మిక్కిలి ద్రవించును' అని పలుకఁగా లవుఁడు 'రాక్షస సంహారకుఁడగు నా శ్రీరామునియుత్తమగుణము లెవ్వరికి గౌరవ పాత్రములు కాకుండును? కాని లోకములోని సమస్తక్షత్రి యుల నాక్షేపించు నశ్వలలాటపట్టిక, అశ్వరక్షకులపయి నాకుఁ గోపమును గల్గించినది.' అని పలికెను. వానికిఁ జంద్రకేతువు 'ఏమీ! నీకు తాతపాదులప్రతాపోత్కర్షమును సహింపరా నిదా?' అని ప్రశ్నింపఁగా లవుఁడు 'అసహనముసంగతి యట్లుం డనిమ్ము; ఆ రాజు, అతనిప్రజలును మిక్కిలి దాంతులని విం దుమే. నిరహంకారులగు ప్రజలు దృప్తులు పలుకవలసిన రాక్షస వాక్కులను (అవాచ్యములను) ఏల పలుకవలసివచ్చినదో

తెల్పుము.మఱియు నో చంద్రకేతూ! తాతపాదులప్రతాపోత్కర్షమును నీకు సహింపరానిదా? అని యడిగితివే! ఏమి? లోకములో రాముఁ డొక్కఁడేనా వీరుఁడు?' అని ప్రశ్నించెను. దానికి సుమంత్రుఁడు 'బాలకా! నీవు రామభద్రు నెఱుఁగవు; కాన నిట్లనుచుంటివి. అధికప్రసంగము మానుము. సైనికులబడి పెట్టుటవలనఁ గోపించి నీవిట్లు పల్కితివి; వీరాధివీరుఁడగు పరశురాముని జయించిన రామభద్రునిఁగూర్చి పరుషవాక్యములాడఁజనదు' అని పలుకఁగా లవుఁడు నవ్వి 'పరశురాముని జయించెనని యేల గొప్పగాఁ జెప్పెదవు? బ్రాహ్మణుఁడగు పరశురామునికి మాటయందే శక్తియున్నది; క్షత్రియులకున్నది బాహుపరాక్రమము; బ్రాహ్మణుఁడు శస్త్రమును గ్రహింపఁగా, అతని నోడించిన రాముని ఘనత యేమున్నది?' అని పలికెను. అప్పుడు చంద్రకేతువు 'సుమంత్రా! ఇతనితో వాదులాట లేల? లోకోత్తరుఁడగు పరశురామునే యెఱుఁగని యీయింతపురుషావతారమునకు తాతపాదులపుణ్యచరిత్రము లెట్లు తెలియఁగలవు?' అనిపలుకఁగా, లవుఁడు 'అవును! శ్రీరాముని మహిమలు ఎవరికిఁ దెలియవు? ఆయన పెద్దవాఁడగుటచే గౌరవయోగ్యుఁడే యగును; అతఁడు తాటకను వధించుట, ఖరుని సంహరించునపుడు మూఁడడుగులు వెనుకకువెళ్లుట, వాలిని చంపుటలోఁజూపిన నేర్పు ఎవ్వ రెఱుఁగనివి?' అని జబాబీయఁగా చంద్రకేతువు కోపముతో మండిపడెను. లవుఁడును యుద్ధమునకు సిద్ధముకాఁగా, సుమంత్రుఁడు వారిరువురిని యుద్ధము చేయఁదగినచోటికిఁ దీసికొని వెళ్లెను.

పిదప లవచంద్రకేతువులు యుద్ధము చేయుచుండఁగా దానిని దేవతలు విమానమునుండి చూచుచు, వర్ణింపసాగిరి. ఆయాయోధనమున చంద్రకేతు వాగ్నేయాస్త్రమును బ్రయోగింపఁగా లవుండు వారుణాస్త్రమున దాని నాపెను. పిదప చంద్రకేతువు వాయవ్యాస్త్రమును బ్రయోగించెను. ఇంతలో రాముఁడు విమానమునుండి వారిద్దరినడుమను దిగెను. అతనిఁజూచి లవచంద్రకేతువు లిద్దఱును యుద్ధమును విరమించిరి. రాముఁడు చంద్రకేతువుప్రతాపమునకు సంతోషించి, యాతనిఁ గౌఁగిలించి గౌరవింపఁగా, చంద్రకేతువు 'అంతపాదులు ముందు నాకంటె నెక్కువప్రేమతో నామిత్రుని గౌరవింపవలెను; ఈతం డతిసాహసముగల మహావీరుఁడు' అని పలుకుచు లవునిఁ జూపెను. రాముఁడు లవుని గంభీరాకృతిని వర్ణించి యాతనింజూచుటవలన ననిర్వాచ్యమగు నానందము ననుభవించెను. రామునిఁ జూచినవెంటనే లవునకసూయయంతయు నశించి గొప్పగౌరవము కలుగసాగెను. లవుఁడు చంద్రకేతువువలన నతఁడు శ్రీరాముఁడని యెఱింగి యతనికి నమస్కరించి, తనతప్పును మన్నింపవలెనని ప్రార్థించెను. శ్రీరాముఁ డాతనిని కౌఁగిలించుకొని, 'క్షత్రియోచితధర్మము నెఱవేర్చిన నీతప్పేమియు లే'దని ప్రశంసించెను. పిదపఁ జంద్రకేతువు జృంభకాస్త్రముచే సేనలు కట్టివేయబడుటను రామునకుఁ జూపెను. శ్రీరామునికోరికపయి లవుఁ డాయస్త్రము నుపహరించుకొనెను. ఆయస్త్రము లెట్లు అబ్బినవని రాముఁ డడుగఁగా కవలలగుతమసోదరుల కిద్వారకు నవి స్వతఃప్రకాశములైనయస్త్రములని లవుఁడు రామునకుఁ దెల్పెను. 'ఆరెండవయాతఁ డెక్కడ?' అని రాముఁ డడుగు

చున్నంతలో 'హాఁడాయరా! దాఁడాయరా! ఏమిపలికితివి? చిరంజీవియగు లవునకు రాజసైన్యములతో యుద్ధము సంభవించెననియా? ఇప్పుడే లోకములో రాజశబ్దము నశించుఁగాక! క్షత్రశస్త్రములను అగ్ని చల్లారుఁగాక!' అను తీవ్రములైన వాక్యములు వినఁబడెను. ఆయౌద్ధత్యమునకు రాముఁ డాశ్చర్యపడు చుండఁగా 'అతఁడు భరతాశ్రమమునుండి మఱలివచ్చిన తన యన్న కుశుఁ'డని లవుఁ డెఱిఁగించెను. రాముఁడు 'అట్లయిన నీ వాతని నిటకుఁదీసికొనిరమ్ము' అని లవునిఁ బంపెను.

లవుఁడు కుశునివద్దకుఁబోయి 'ఏదో చిన్నయుద్ధము సంభవించి, యుపశమిల్లుటయు జరిగిన' దని చెప్పి, కుశునికోపమును తగ్గించి 'అన్నగారు దృప్తభావమునువిడిచి వినయము నవలంబింపవలెను. రామాయణకథానాయకుఁడగు రఘునందనుఁ డిటకు వచ్చియున్నాఁడు; అతనిం జూడవలసియున్నది' అని పలుకఁగా, కుశుఁడు 'సరియే! పుణ్యదర్శనుఁడగు నామహాత్ము వేరీతిని దర్శింపవలెనో తెలియకున్నది' అని పలికెను. అందుకు లవుఁడు 'సుజనుఁడును, ఊర్మిళాకుమారుఁడునగు చంద్రకేతువు నన్ను 'వయస్యా!' అని సోదరప్రేమతో పిలుచుచున్నాఁడు. ఆసంబంధమునుబట్టి యితఁడు మనకు పితృతుల్యుఁడు; కాన గురువులను సమీపించిన ట్లీయనను చేరవలె' అని పలికెను. పిదప వారిరువురును రాముని సమీపించిరి. కుశుఁ డతని తేజస్వితకు మిక్కిలి యచ్చెరు వొందెను. రాముఁ డాతనిని కౌఁగిలించి పుత్రాలింగనసౌఖ్యము ననుభవించెను. పిదప లవుఁడు 'ఎండ తీవ్రముగా నున్నందున ఈమద్దిచెట్ల నీడను కూర్చుండ' మని చెప్పఁగా 'సరే' యని యందఱు నట్లొనర్చిరి.

ముగాఁ గూర్పఁబడినవానిని సావధానముగ నవధరింపవలెనని యాజ్ఞాపించుచున్నా' రని పలుకుచుండఁగా తెరలో 'హా! ఆర్యపుత్రా! కుమారా! లక్ష్మణా! అడవిలో విడువఁబడిన— ఆసన్నప్రసవవేదననగుననన్ను మృగములు తినఁగోరుచున్నవి! కాన ఈగంగలోఁబడి మరణింతును' అనుమాటలు వినఁబడినవి. 'రామునిచే విడువఁబడిన సీత గంగలోఁబడుచున్న' దని చెప్పుచు సూత్రధారుఁడు నిష్క్రమించెను. ఆమాట విని రాముఁడు కలఁతపడఁగా 'ఇది నాటక' మని లక్ష్మణుఁడు బోధించెను. పిదప గంగాభూదేవులు తమతొడలపై నిరువురు బాలకుల నుంచికొని మూర్ఛావస్థలోనున్న సీతతోఁగూడఁ బ్రవేశించి 'అమ్మా! జానకీ! అదృష్టవంతురాలవు! జలములోనే వంశకరులగు నిరువురుపుత్రులను బ్రసవించితివి' అని పలికి యూరడించుచుండిరి. దానికి లక్ష్మణుఁడు మిగులసంతసించెను. సీతస్థితిని గాంచి రాముఁడు మూర్ఛపోయెను. కొంతవడికిఁ దెలివొంది తన్ను గాపాడినవారు గంగాభూదేవులని యెఱిఁగి ఎక్కువ దుఃఖముతో భూదేవిని కౌఁగిలించుకొనెను. సీతాభూదేవులు మూర్ఛనొందఁగా గంగాదేవి వారి కుపచారము లొనర్చి మూర్ఛ తేర్చెను. పిదప భూదేవి సీతకష్టములఁ దలఁచి రాముని నిందించెను. గంగాదేవి భూదేవితో 'అమ్మా! భూదేవీ! అన్నియు నెఱిఁగిన నీవు రామునిపైఁ గోపింపఁదగదు. లోకమున నపకీర్తికల్గకుండుటకయి ఆతఁ డట్లొనర్చెను; ఎక్కడో లంకలో జరిగిన అగ్నిపారిశుధ్యము నిక్కడిజనులు నమ్ముటెట్లు! లోకులనందఱిని దృప్తిపఱచుట యిక్ష్వాకువంశజుల కులధనము; ఇట్టిస్థితిలో రాముఁ డేమిచేయఁగలఁడో నీవే యాలోచిం

వుము’ అని పలికి యామెను శాంతింపఁజేసెను. భాగీరథి యొనరించిన యీయుపకృతికి రాముఁ డామెను మెచ్చుకొనెను. భూదేవియు ‘అవును; సీతను విడిచి అతఁడు దహింపఁబడుచున్న మనస్సుతో ప్రజలపుణ్యములవలననే జీవించియున్నాఁడు’ అనిపలికెను. అంత సీత భూదేవితో ‘అమ్మా! నన్ను నీలోనికిఁ దీసికొనుము’ అని పలుకఁగా గంగాదేవి యట్లు పల్కరాదనెను. ‘బిడ్డలను జూచికొనవలె’ నని భూదేవియుఁబల్కఁగా ‘దిక్కులేని యీబిడ్డలవలన నేమిప్రయోజనము’ అని సీత పలికెను. ‘లోక కల్యాణస్వరూపవగు నీవట్లు పలుకరాదు. నీతోడిసాంగత్యము వలన మా పవిత్రతము నినుమడించుచున్నది’ అని గంగాభూదేవు లామెతోఁబలుకఁగా లక్ష్మణుఁడు ‘వినవలె’ నని రామునితోఁ బలికెను. ‘లోకము వినుఁగాక!’ అని రాముఁ డనెను. ఇంతలో ఒక గొప్ప వెలుఁగు కనఁబడఁగా ‘అది జృంభకాస్త్రముల వెలు’ గని గంగాభూదేవులు గ్రహించిరి. ‘ఓసీతాదేవీ! నీకు నమస్కారము; మేము నీసంతానమునకు స్వాధీనమైతిమి. చిత్రదర్శన సందర్భమునవే శ్రీరాముఁడు మమ్ము నీసంతానమువశము చేసెను’ అని యాయస్త్రములు పలికినమాట వినఁబడెను. అంత లక్ష్మణుఁడు ‘అవును; అన్నగా రప్పుడు ఈయస్త్రములు నీసంతానమును చెందఁగలవని సీతాదేవితోఁ జెప్పియుండిరి’ అని పలికెను. గంగాభూదేవు లాయస్త్రములను నమస్కరించి ‘అమ్మాయీ! ఇప్పుడు నీకుమారులు రామభద్రతుల్యులైనారు’ అని పలికి, సీతకు సంతోషముఁ గల్గించిరి. ‘వీరికి క్షత్రియోచితవిధి నెవ్వరు నిర్వర్తింతురు?’ అని సీత విచారింపఁగా ‘పాలను విడుచు వయస్సు రానిమ్ము; అప్పుడు నేను వీరిని పూజ్యవాల్మీకుల కప్పగించెదను’

అని గంగాదేవి పలికెను. 'గంగాదేవి మిక్కిలి చక్కఁగాఁ జెప్పి నది' అని రాముఁడు పలికెను. లక్ష్మణుఁడు 'ఇప్పు డన్ని విధముల నీబాలురు కుశలవులనియే అన్నగారు గ్రహింపవలెను. ఏలయన వీరు జన్మసిద్ధాస్త్రులు; వాల్మీకిశిష్యులు; మిూపోలికకలవీరులు; పండ్రెండేండ్ల వయస్సుకలవారు' అని పలుకఁగా 'నేనును అట్లే యనుకొనుచున్నా' నని రాముఁడు ననెను.

అప్పుడు సీత 'అమ్మా! నే నీప్రజావమానమును సహింప లేను; నన్ను నీలోనికిఁ దీసికొనుము' అని భూదేవితోఁ బలు కఁగా నామె 'అమ్మాయీ! పాలుత్రాగువయస్సు దాటువఱ కును బిడ్డలను గాపాడుము; ఎట్లుకోరిన నట్లు చేయుదును' అని పలికెను. పిదప రంగమునుండి గంగాభూసీతలు నిష్క్రమించిరి. అదిచూచి రాముఁడు మూర్ఛిల్లఁగా, లక్ష్మణుఁడు పరిచర్య చేయుచుండెను. అప్పుడు తెరలో 'జంగమస్థావరరూపము లగు జీవులారా! దేవమానవులారా! ఈయాశ్చర్యముఁ గాంచుఁడు'అనుమాట వినఁబడెను.'దేవర్షు లాకసమున వ్యాపించి యుండఁగా గంగాజలములనుండి సీతాదేవి గంగాభూదేవులతోఁ గూడ బయటకు వచ్చుచున్న' దని లక్ష్మణుఁడు చూచి పలికెను. మఱల తెరలో 'పూజ్యురాలవగు ఓ అరుంధతీ! మేము గంగా భూములము; పవిత్రయగు సీత నిదిగో నీ కర్పించుచున్నాము; గ్రహింపుము' అను మాటలు వినఁబడఁగా లక్ష్మణుఁడు సంత సించియు రాముఁ డింకను మూర్ఛతేఱమికి దిగులొందెను. ఇంతలో సీతయు, అరుంధతియు నటకు వచ్చిరి. అరుంధతి కోరిక పయి సీత రాముని స్పృశింపగా అతనికిఁ దెలివివచ్చెను. రాముఁ డంత తెలివొంది అరుంధతీ సీతలను జూచి ఆశ్చర్యలజ్జలలో

మునిఁగెను. అరుంధతీదేవి గంగా భూదేవు లాతనియెడఁ బ్రసన్నులైనసంగతిఁ దెల్పెను. రాముఁడు మిగుల సంతసించెను. అరుంధతి యప్పుడు 'ఓ పౌరజానపదులారా! గంగాభూదేవులుఁ బ్రశంసించి సీత నప్పగించిరి. ఈమెమహిమ నిదివఱకే వైశ్వానరుఁడు నిర్ణయించెను; బ్రహ్మాదిదేవత లీమెను ప్రశంసించిరి. ఈజానకి నిపుడు గ్రహింపవచ్చునా? మీరేమందురు?' అని యడుగగా, వారు 'అంగీకరింపవచ్చు నని గట్టిగాఁ బలికి యామెకు నమస్కరించిరి. సప్తర్షులును, అష్టదిక్పాలకులును పుష్పవర్షమును గురిసిరి. పిదప అరుంధతియాదేశము ననుసరించి రాముఁడు సీతాదేవిని గ్రహించెను; లక్ష్మణుఁడు సీతకు నమస్కరింపఁగా, ఆమె దీవించెను.

పిదప అరుంధతియాదేశము ననుసరించి వాల్మీకి కుశలవుల నచ్చటికిఁదెచ్చి రామలక్ష్మణసీతా జనకులను వారి కెఱుకపఱచెను. వారిం గాంచి యందఱును సంతసించిరి. ఇంతలో లవణాసురుని సంహరించుటకుఁబోయి, ఆపనిని నెఱవేర్చిన శత్రుఘ్నుఁడు నటకు వచ్చెను. ఒకదానివెనుక నింకొక శుభముకలైనని రాముఁడు మిగుల ఆనందించెను. పిదప శ్రీరాముఁడు సుతద్వయముతోను, జానకితోను, సోదరులతోను, తల్లులతోను అయోధ్యకేఁగి ప్రజాపాలన మొనర్చుచు సుఖముగానుండిరి.

---

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

## ఉపోద్ఘాతము



సంస్కృతవాఙ్మయమున భాసమహాకవిరచించిన నాటకములు ప్రసిద్ధములైనవి. ఇతఁడు మహాకవి కాళిదాసునికంటె ప్రాచీనుఁడు; కాళిదాసీతని గ్రంథములను బాగుగ నెఱుఁగు ననియు, భాసునిమీఁద గొప్పగౌరవము గల్గియుండెననియు, కాళిదాసునాటకములవలనఁ దెలియుచున్నది. భాసునిపోలికలు కొన్ని కాళిదాసునాటకములలోఁ గలవు.

భాసునినాటకము లిప్పటికి పదమూఁడుమాత్రము లభించినవి. అందు వత్సరాజుకథను సంబంధించినవి రెండు; అవి ప్రతిజ్ఞాయౌగంధరాయణమును, స్వప్నవాసవదత్తమును. ఈ రెండునాటకములును చాల మనోహరములయినవి; ప్రతిజ్ఞాయౌగంధరాయణమున వాసవదత్తావివాహమునకుఁ బూర్వము నందలి ఉదయనచరిత్రము వర్ణితము; స్వప్నవాసవదత్తయందు వివాహానంతరకథ వర్ణితము.

ఈనాటకమున ప్రద్యోతుఁడు మోసముచేసి, వత్సరాజగు నుదయను నపహరింపఁగా, వత్సరాజమంత్రియగు యౌగంధరాయణుఁడు ప్రద్యోతుని మోసపుచ్చి తమరాజును విడిపించుటయేగాక, అతఁడు వలచిన ప్రద్యోతుని పుత్రికయగు వాసవదత్తనుగూడ అపహరించి తెత్తునని ప్రతిజ్ఞయొనర్చి

దానిని కెలవేర్చుకొనినట్లు వర్ణింపఁబడినది; కావున ఈనాటకమున కు 'ప్రతిజ్ఞాయౌగంధరాయణ' మనుపేరు ఎంతయును తగి యున్నది.

అమాయకులు శత్రువులమోసములకు లోఁగిపోవుదు రనియు, మంత్రులు తమ కెన్నియిక్కట్టులుకలిగినను వానిని లెక్కగొనక తమప్రభువుల నాపదలనుండి తప్పింతురనియు మోసగాండ్రను మోసముచేతనే లోఁగదీయవలయుననియు అను నీరీతి నీతు లెన్నియేని యీనాటకమువలన గ్రహింపఁదగి యున్నవి.

# పాత్రములు

## పురుషులు

ఉదయనుఁడు—వత్సదేశపురాజు - నాయకుఁడు
యౌగంధరాయణుఁడు—వత్సరాజు ప్రధానమంత్రి
రుమణ్వంతుఁడు—వత్సరాజుమంత్రి
వసంతకుఁడు—వత్సరాజు వేడుకచెలికాఁడు
ప్రద్యోతుఁడు—అవంతీపతి; మహాసేనుఁడు
సాలంకాయనుఁడు—ప్రద్యోతునిమంత్రి
భరతరోహకుఁడు—ప్రద్యోతునిమంత్రి
బాదరాయణుఁడు—ప్రద్యోతునికంచుకి
హంసకుఁడు—ఉదయనుని అంగరక్షకుఁడు
సాలకుఁడు—యౌగంధరాయణుని వార్తాహరుఁడు
నిర్ముండకుఁడు—యౌగంధరాయణుని సేవకుఁడు
బ్రాహ్మణుఁడు—యౌగంధరాయణుని పురుషుఁడు
గాత్రసేవకుఁడు—యౌగంధరాయణుని పురుషుఁడు
ప్రద్యోతునింట మావటీనిగాఁజేరినవాఁడు
సాధారణులు—భరతరోహకుని పురుషులు

## స్త్రీలు

వాసవదత్త—ప్రద్యోతునిపుత్రిక - కథానాయిక
అంగారవతి—ప్రద్యోతుని పట్టమహిషి
విజయ—ఉదయనునింట ప్రతీహారి

---

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

తొల్లి కౌశాంబీనగరము రాజధానిగా వత్సదేశమును ఉదయనుఁ డను రాజు పరిపాలించుచుండెను. అతనికి వత్సరాజను నామాంతరము ప్రసిద్ధమై యుండెను. అతఁడు సకలకళాప్రవీణుఁడు; అన్నివిద్యలయందును సమర్థుఁడు; అందును గాంధర్వవిద్యయం దసమానపాండితీవిలసితుఁడు; సాధారణముగా వేఁటలకుఁబోవుట యనిన అతని కిష్టము; ఆసమయములందు నారదునివీణయగు మహతి కెనయైన తనఘోషవతి యనువీణను కూడఁదీసికొనిపోయి దానిని మీటుచు నడవియేనుఁగుల నవలీలగా స్వాధీనముచేసికొనుచుండును.

ఆ రాజుసన్నిధిని అన్నివిధముల ననుకూలురగుమంత్రులు ముగ్గురుండిరి. వారిలో యౌగంధరాయణుఁడు ప్రధానామాత్యుఁడు; అతఁ డఘటనఘటనాసమర్థుఁడు ప్రభుభక్తిపరాయణుఁడు; అతనియుక్తికి తిరుగులేదు. ఈయంశములను బాగుగ నెఱుఁగుటచేతనే వత్సరాజు రాజ్యభారమును సర్వము నాతనిపై నే వైచి సచివాయత్తుఁడయి, ఎట్టి చీకుచింతలును లేక హాయిగా కాలమును గడుపుచుండెను.

రుమణ్వంతుఁ డనునతఁ డింకొకమంత్రి; అతఁడు యుద్ధములం దాఱితేఱినవాఁడు; వేఁటసమయములం దెప్పుడు నతఁడు వత్సరాజు వెంటనంటియే తిరుగును. వీరిరువురును గాక వసంతకుఁడనునతఁడు రాజునకు నర్మసచివుఁడు కలఁడు. వసంతకుఁడెల్లప్పుడును రాజునకు మనస్సంతోషమును గూర్చుచు,

కష్టసమయములం దూఱడించుచు తృప్తిని, ఆనందమును కలిగించుచుండెను.

అవంతిదేశము వత్సరాజ్యపు పొరుగు దేశము. ఉజ్జయినీ నగరము రాజధానిగా, ఆరాజ్యమును ప్రద్యోతుఁడను రాజు పాలించుచుండెను. ఇరుగుపొరుగు రాజులకుఁ బరస్పరము వైర ముండుటయు, వీలుచూచుకొని, ఒకరిరాజ్యము నింకొకరు కబళింపఁజూచుటయు సహజము. ఆసంప్రదాయ మందయున, ప్రద్యోతులయెడను ఫలించినది. వత్సరాజు విద్యాపక్షపాతి యగుటను, నిర్విచారముగ ఆనందముతో కాలము గడుప నిచ్ఛగించువాఁడగుటను, రాజ్యకాంక్ష యతనికి లేకుండెను; కాని ప్రద్యోతుఁ డట్టివాఁడు కాఁడు; అతఁడు గొప్పసేనలను కూర్చుకొని పరరాజులపయి దాడివెడలి వారి నోడించి తనకు సామంతులుగా నొనర్చుకొనెను; అతని కాకారణమువలననే మహాసేనుఁ డనుబిరుదము కలిగినది; రాజులందఱును తనకు లొంగియుండఁగా వత్సరాజుమాత్రము స్వతంత్రుఁడై యుండుటవలన ప్రద్యోతుఁడు అతనిపై తీరనిపగఁబూనెను. యౌగంధరాయణుఁ డున్నంతవఱకు వత్సరాజను న్యాయపద్ధతిని జయించుట యసంభవమని యెంచి, మాయోపాయములచేత నైనను, అతనిని చేఁజిక్కించుకొనుటకు తగినపన్నుగడలు పన్నుచు సమయమున కెదురుచూచుచుండెను.

ఒకప్పుడు ఉదయనుఁడు ససైన్యముగ అడవికి వేఁటకుఁ బోయెను. రుమణ్వంతుఁడు కూడ నతనితో నుండెను. వత్స రాజు వేణువనములో వేఁటను ముగించుకొని, దానిపిదప మూఁడువనముల కవ్వలగల నాగవనమునకు ఏనుఁగులవేఁట

కయి బయలుదేరనుండెను; అదను వేచియున్న ప్రద్యోతుఁడు నాగవనమునకు వత్సరాజు వచ్చుచున్నాఁడని చారులవలన నెఱిఁగి ఒకకృత్రిమపు నీలగజమును కల్పించి, దానిని వీరులనడుమ నుంచెను. ఈయంశమును యౌగంధరాయణుఁడు చారులవలన నెఱిఁగి, నాగవనమునకుఁ బోరాదని వేణువనమున నున్న ఱేలికకు తనసేవకుఁడగు సాలకుఁడను జంఘాలునిమూలమున లేఖను, ప్రభుశ్రేయస్సుకొఱకు అతని రాణులకొరముల నుండి తాయెత్తులను పంపనుండెను.

ఇంతలో నిర్ముండకుఁడను సేవకుఁడు వచ్చి 'రాజుగారి వద్దనుండి హంసకుఁడు వచ్చె' నని యౌగంధరాయణునికి తెలిపి యతని యాజ్ఞను గొని హంసకుని సమాత్యుని యొద్దకుఁ బంపెను. వత్సరాజునకు సదా పార్శ్వవర్తియగు హంసకుఁడు ఒక్కఁడే వచ్చుటకు యౌగంధరాయణుఁడు మిగుల కలఁతఁ జెంది, అతనిం గాంచినవెంటనే 'మహారాజుగారు నాగవనమునకు వెళ్లలేదుగద!' అని యాతురతతో ప్రశ్నించెను. దానికి హంసకుఁడు 'నిన్ననే వెళ్లినా' రని చెప్పఁగా, మహామాత్యుఁడు నిర్విణ్ణుఁడై 'అయ్యయ్యో! నాప్రయత్నము వ్యర్థమైనది; ఇఁక సాలకునిఁ బంపనక్కఱలేదు' యని యనుకొనుచు, తర్వాతివృత్తాంతము నంతటిని గ్రహించినవానివలె హంసకునితో 'హంసకా! ఇంకను ఏమయిన ఆశయున్నదా; లేక ప్రాణములను విడువవలెనా!' అని పలుకఁగా, నతఁడు 'ప్రభువువారు జీవించియే యున్నారు; కాని బందీకృతులై యున్నారు' అని జవాబిచ్చెను. అది విని యౌగంధరాయణుఁడు 'ఏమేమి! ప్రభువు బందీ యయ్యెనా? ప్రద్యోతుని యదృష్టము నేటికి ఫలించి,

యాతనికోరికతీరెనా ? ఇప్పుడు వత్సరాజమంత్రులచేతకాని తనము తేటతెల్లమైనది ; వారికి కళంకము వాటిల్లినది ! ప్రభువు పట్టుపడుచుండఁగా రుమణ్వంతుఁ డేమిచేయుచున్నాఁడు? మన యాశ్వికబల మేమైనది?' అని పలికెను. దానికి హంసకుఁ డిట్లు వివరముగా సమాధాన మొసఁగెను. 'అమాత్యవరు రుమణ్వంతుఁడు, ఆశ్వికబలమును దీసికొని, వెళ్ళియుండిన నెట్టియుపద్రవమును లేకయే యుండెడిని ; వివరముగా మనవిచేయుచున్నాను ; అమాత్యులు చిత్తగింతురుగాక ! ఇంకను బూర్తిగఁ దెల్లవాఱకమునుపే వాహ్యాళికి కనుకూలమగు నాసమయమున ప్రభువులు మహారాజ్ఞిని వేణువనముననే యుంచివేసి, ఛత్రగ్రాహిమాత్ర సేవకపరివృతులయి యేనుఁగులవేటకుఁ గావలసిన సైన్యమును మాత్రము దీసికొని, నాగవనమునకు నర్మదానదిని దాఁటి ప్రయాణమైరి. జాముప్రొద్దయిన నెక్కటపూర్వమే పెక్కుయోజనములదూర మేఁగితిమి. మదగంధిపర్వత మింకను క్రోశదూరమున నున్నదనఁగానే వప్రక్రీడ నొనర్చుచున్న గజయూథ మొకటి దూరమున మాకంటఁబడెను. అప్పుడు సైనికులు తమతమ ప్రయత్నములలో నుండఁగా, వారిప్రయత్నమును కనిపెట్టి గజయూథము చెల్లాచెదరగుచుండెను. ఆసమయమున ఈయనర్థమున కంతటికిని కారణమైన యొక కాలిబంటు ముందునకు వచ్చి నిలిచెను. హంసకుఁ డిట్లు చెప్పుచుండఁగా యౌగంధరాయణుఁ డడ్డము వచ్చి 'ఆభటుఁడు, గోళ్లును, దంతములును, తప్ప—తక్కిన అవయవములు ఏకనీలముగానున్న గజరాజును నేను చూచితినని చెప్పెనుగదా!' అని యడుగఁగా దాని కతఁడు 'ఔను' అని చెప్పి యాసంగతి మహా

మంత్రికి వార్తాహరులవలనఁ దెలిసినదని గ్రహించి గూఢచారులు యిట్లు చెప్పసాగిరి— 'ఆ మాట విని ప్రభువు మిగుల సంతసించి నీలకువలయతనువను పేరుగల యాగజము గజములకు చక్రవర్తి.' అని పలుకుచు ఆ వృత్తాంతము తెలిపిన భటునకు నూరు సువర్ణములు పారితోషిక మొసఁగి గజయాత్రకు జాగ్రత్తగా మాకుఁ గావలెనని సేనకొండ్రకాజ్ఞ యిచ్చి ఘోషవతియను వీణాసహాయమున నా నీలకువలయతనువును స్వాధీనము చేసికొనుటకుఁ బోఁదలంచెను. అప్పుడు రుమణ్వంతుఁడు ప్రభువును సమీపించి 'ప్రభూ! ఇంద్రగజమగు నైరావతమునుకూడ లొంగించుకొనుట ప్రభువులకు కష్టతరము కాదు; కాని యిప్పుడు మన రాజ్యపుఁ బొలిమేర నున్నాము; ఇచ్చట చుట్టుప్రక్కలనున్న జనులు నిర్లజ్జులు, నిర్దయులునై యున్నారు. కావున గజయాత్రమును కాల్బలమునకు మాత్ర మప్పగించి తక్కిన సేనతోఁ గూడ ముందున కరుగుట మేలని తోఁచుచున్నది' అని మనవిచేసెను; కాని ప్రభువు లామాటను పెడచెవినిబెట్టిరి. మఱియు ఎవ్వరిని దనవెంట రానీయక ఇరువదిమంది కాల్బలమును మాత్రము వెంట నిడుకొని తాను నీలవలాహకగజమునుండి దిగి సుందరపాటలమను నశ్వము నధిరోహించి ముందునకుఁ బోయెను. పిదప రెండింతలదూరముపోఁగా ఆనీలగజము నల్లనిమద్దిచెట్లనడుమ వానినలుపులోఁ గలిసిపోయి తెల్లనిదంతముల కాంతులవలననే వానినడుమనున్నట్లు మాచే తెలిసికొనఁబడెను. అంతఁ బ్రభువు గుఱ్ఱమునుండి దిగి, దానిని సమీపించి దేవతలకు నమస్కరించి వీణను పట్టుకొని నంతలో మావెనుకనుండి యొకసింహము వచ్చుచుండెను. దానిం దఱుముటకు మేము వెనుకకుఁబోఁగా మాన

టీనితోఁడను, యోధులతోఁడను గూడినయాకటగజము మా పై బ్రభువునకు రాఁదొడంగెను; అదిచూచి యుదయనప్రభు వది యంతయును బ్రద్యోతుఁ డొనర్చినమోసమని తెలిసికొని 'మీ రందఱును నన్ననుసరింపుఁడు; నేనిదే శత్రువునకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేయఁబోవుచున్నాను' అని వారితోఁ బలుకుచు, ఆశత్రువులగుంపునఁ జొరఁబడెను. యజమానునిమనస్సు కనిపెట్టి సుందరపాటలమును శత్రువులను చెండాడుటలో ప్రభువునకు మిక్కిలి సాయపడెను. కాని శత్రువులసంఖ్య యధికమగుటవలన ప్రభువునకు బలము క్రమక్రమముగ తగ్గసాగెను. సుందరపాటలమును శత్రువులచే హతమయ్యెను. అంత బ్రభువు మూర్ఛపోఁగా శత్రువీరులు ప్రాకృతునట్లు ప్రభువును తమకు దొఱకినలీఁగలతో గట్టిగా బంధించిరి. పిదప శత్రువీరులు ప్రభువుచుట్టును మూఁగి 'ఈయన నాతండ్రిని చంపెను; ఈయన మామిత్రుని చంపెను; ఈయన మాసోదరుని చంపెను; ఈయన నాకుమారుని చంపెను' అని చెప్పుకొనుచు, మనప్రభువుపరాక్రమమును పరిపరివిధముల మెచ్చుకొనసాగిరి.

అంత నొకవిచిత్రసంఘటనము జరిగెను. శత్రువీరులలో నొకఁడు ప్రభువును దక్షిణాభిముఖముగా త్రిప్పి ఒకచేతితో ప్రభునికేశములనుబట్టుకొని రెండవచేతితోఁ గత్తిబూని, తీవ్రవేగమునఁ గొట్ట సిద్ధపడెను, కాని యావేగావేశమున నాతుచ్ఛుఁడు నేలపైఁబడెను; ఇట్లు ప్రభువునకు గండము తప్పెను; ఇంతకుమున్ను జరిగినయుద్ధమున మనప్రభువుచే బల్లెపుపోటుతిని మూర్ఛపోయిన సాలంకాయనుఁడను ప్రద్యోతుని ప్రధానమంత్రి మూర్ఛతెలిసి 'సాహసము వలదు; సాహసము వలదు'

అని యుఱపుసు నటకువచ్చి ప్రభువునకుఁ బ్రణమిల్లి యాతని బంధనములను తొలఁగించెను. పిదప నుత్తముఁడగు నా మంత్రి సాంత్వనవచనములు పల్కి ప్రభువు నూఱడించి, ఆయనను పల్లకిలోఁ బరుండఁబెట్టి యుజ్జయినికిఁ దీసికొనిపోయెను. నేనును ప్రభువు వెనుకనే పోఁదలఁచితిని; కాని సాలంకాయనుఁడు—ఈవృత్తాంతము కౌశాంబీనగరమునఁ దెలుపుటకయి నన్ను పంపెను.'

హంసకుఁ డిట్లు పలికి తనవృత్తాంతమును ముగించెను. ప్రభు వుజ్జయినిలో బందీయగుటకు యౌగంధరాయణుఁడు మిగుల కలఁతఁజెందెను. ఇంతలో నంతిపురమునుండి తాయెత్తును దీసికొని ప్రతీహారి యగు విజయ రాఁగా, యౌగంధరాయణుఁ డీవృత్తాంతము నామె కేకాంతముగాఁ దెలిపి అంతఃపురజన మాందోళనపడకుండునట్లు నిదానముగా రాజుగారిసతికిని తెలుపఁగోరెను. ఆమె 'యట్లే' యనుచుఁ బోయెను.

అంత యౌగంధరాయణుఁడు హంసకునితో 'ప్రభువు లేమైన నాతోఁ జెప్పఁగోరిరా?' అని పలుకఁగా, అతఁడు 'అవును; నేను ప్రభువులకుఁ బ్రదక్షిణమొనర్చి సెలవుతీసికొని రానుండఁగా వీరు గ్రమ్మినకన్నులతో మహారాజుగా రిట్లనిరి. "పొమ్ము, పోయి ఆర్య యౌగంధరాయణునిఁ జూడుము" అని. అది విని యౌగంధరాయణుఁడు 'ఇందఱు మంత్రు లుండఁగా నన్నే చూడుమనెనా? అట్లయినఁ బ్రభువు నెడ తగినశ్రద్ధపూనక తగినరక్షణ మొనర్పక యుండుటయు, ప్రభువులయుప్పుడిని తగిన సేవ యొనర్పకుండుటయు నాదోషములుగా వ్యక్తమగుచున్నవి. ఇదిగో చూడుము, రాజుగారు శత్రునగరమున నున్నను,

చెఱలో నున్నను, అడవిలో నున్నను లేక లోకాంతరమున నున్నను సరే; యౌగంధరాయణుఁ డాయనను నీడవలె వెంట వంటియుండి తీరును; మఱియొక విశేషము తాను గెలిచితినని పలుకుచున్న శత్రురాజును వంచించి, మనప్రభువును విడిపించి, రాజ్యమున నిలిపి శ్లాఘాపాత్రుఁడ నయితీరుదును.' అని పలికెను. ఇంతలో నంతఃపురమునుండి పెద్దకోలాహలము వినఁబడెను; రాజుగారి వృత్తాంతమును విని యంతఃపురస్త్రీలు దుఃఖించుచున్నట్లు యౌగంధరాయణుఁడు గ్రహించెను: వెంటనే యంతఃపురమునుండి యొకప్రతీహారివచ్చి యౌగంధరాయణునికి నమస్కరించి 'మహామాత్యా! రాజమాత తమతో నిట్లు మనవి చేయుచున్నది. అమాత్యయౌగంధరాయణుఁడు నాకు పుత్రుని వంటివాఁడు; కష్టములలో విచారింపకుండుటయు, చిక్కులకు లొంగుపాటు చూపకుండుటయు, మోసగింపఁబడియు నిర్వేదము నొందకుండుటయు, పరాజయమునను ప్రాణత్యాగ మొనరింపకుండుటయు నతనికి సహజగుణము; అట్టియుత్తమగుణములుకల అమాత్యుఁడు నాపుత్రుని చెఱవిడిపించి తేవలెనని కోరుచున్నాను.' అని. ఆమాటలు విని యౌగంధరాయణుఁడు 'విజయా! రాజమాత ఉత్తమరాజవనిత చెప్పవలసినట్లు చెప్పి ధైర్యమువలంబించుట ముదావహము; జలమును తెమ్ము.' అని యామెచే జలమును తెప్పించి 'విజయా! రాజపుత్రుని తేవలెననిగదా, రాజమాతయాదేశము! హంసకా! ప్రభువు నన్ను చూడవలెననికదా నీతోఁ బలికెను! చూడుఁడు రాహువు చేఁబట్టుకొనఁబడిన చంద్రునిరీతిని-శత్రువులచే బంధింపఁబడిన

ప్రభువును తీసికొనిరానిచో నేను యౌగంధరాయణుఁడనే కాను.' అని విజయ తెచ్చిననీటి నాచమించి ప్రతిజ్ఞ యొనర్చెను.

అప్పుడు నిర్ముండకుఁడువచ్చి 'అమాత్యుల్లీయాశ్చర్యము నవధరింపవలెను. రాజుగారి శ్రేయస్సుకొఱకిప్పు డొకబ్రాహ్మణ సమారాధన జరిగినది; అందు వెక్కండ్రుద్విజులు భుజించుచుండఁగా నున్మత్తవేషధారియగు నొకవిప్రుఁడు 'భుజింపుఁడు; మీరందఱును స్వేష్టతృప్తిగా భుజింపుఁడు; ఈరాజవంశమున కభ్యుదయము కలుగనున్నది.' అని గట్టిగా నవ్వుచుఁ బలికి మాయమయ్యెను.' అని పలికి, యౌగంధరాయణు నాశ్చర్యని మగ్నునొనర్చెను. పిదప నొకబ్రాహ్మణుఁడు కొన్నిదుస్తులను దెచ్చి 'ఇవిగో! అతఁడు ధరించినదుస్తులు! ఏదో ప్రయోజనమునకయి, వీని నాతఁ డిచ్చట విడిచిపోయెను. ఈదుస్తులతో పూజ్యుఁడగుద్వైపాయనుఁడు వచ్చె.' నని పలుకుచు వానిని మంత్రి కర్పించెను. ఆదుస్తులతో వచ్చి, మాయమైనవాఁడు ద్వైపాయనుఁ డని తెలిసికొని యౌగంధరాయణుఁడు మిగుల నాశ్చర్యపడి, ఏదో యాలోచనతోఁ జేఁగ, ఆదుస్తులను తానే ధరించెను; అంత నతనిరూపము పూర్తిగా మాఱిపోయెను. దాని కతఁడు మిగుల సంతసించి 'ఎంతమాఱిపోయితిని! ఈవేషము రాజును విడిపించుటయేగాక, నన్ను కప్పిపుచ్చును; ఈదుస్తులు నాకొఱకే యుంచబడినట్లున్నది; ఇఁక నేను రాజు సమీపమున నున్నట్లే' అని యనుకొనెను. రాజమాత యమాత్యుని చూడఁగోరుచున్నట్లు విజయ తెలుపఁగా శాంతిగృహమున నామెదర్శనముచేసికొనునట్లు జబాబిచ్చి యామెను

పంపి యుత్సాహవంతులగు నరులకు లోకమున అసాధ్యము లేదని యనుకొనుచుఁ బోయెను.

అంతఁ బ్రద్యోతమహారాజు సంతిపురమునఁగల బాదరాయణుఁడను కంచుకి పరిచారకుఁడగు నాభీరకునితో 'ఆభీరకా! నీవుపోయి మహాసేనప్రభువుల యాజ్ఞయైనదని ప్రతీహారులపెద్దతో నిట్లు చెప్పుము 'కాశీరాజుగారి యుపాధ్యాయుఁడగు ఆర్యజైవంతి యిటకు రాయబారిగా వచ్చియున్నాఁడు; దౌత్యమున వచ్చినవారిని గౌరవించినట్లుగా నాతనిని గౌరవింప వలెను.' అనిపలికి వానిని పంపి కంచుకి తనలో 'ఈ ప్రద్యోత మహారాజుపద్ధతి చాల వింతగ నున్నది. రాజకుమారియగు వాసవదత్త వివాహయోగ్యవయస్కయై యున్నది; ప్రతిదినమును కులీనులు నుత్తములునగు మహారాజులు కన్యార్థులయి రాయబారులను పంపుచునేయున్నారు. కాని ప్రభు వెవ్వరిని ఆమోదింపఁడు; తిరస్కరింపఁడు. అయినను ఈవిషయము దైవాధీనమనవలెను' అని యనుకొనుచుండఁగా ప్రద్యోతుఁడు వచ్చి ఆర్యజైవంతిని గౌరవింప నేర్పాట్లుజరిగినందుకు సంతసించి 'చాల సంతసము! మన మతిథులను యుక్తరీతిని గౌరవింప వలెను; అన్నియు బాగుగనే యున్నవి; కాని, కన్యావివాహ విషయమును ప్రశ్నింప నందఱును తాటస్థ్యమునే వహింతురు.' అని పలికెను. అంతఁ గంచుకి 'ప్రభూ! ప్రతిదినమును రాయబారులు వచ్చుచునేయున్నారు; పోవుచునేయున్నారు; ప్రభువు లెవ్వరికిని ప్రతికూలురును కారు; అనుకూలురును గారు; దీనిభావ మేమో బోధపడకున్నది' అని పలికెను. ప్రద్యోతుఁడు 'బాదరాయణా! వరునిగుణములు ఉత్తమము

ఋగా నుండవలెనను కోరిక యొకటియు, పుత్రికను విడువలే కుండుట యొకటియు నిందుకు కారణములు' అని పలుకఁగా సమస్తగుణపరిపూర్ణుఁ డగు నతఁడు ప్రద్యోతమహారాజాతక్క వేఱొక్కఁడు కానరాఁడు' అని కంచుకి జవాబిచ్చెను. మహా సేనుఁడు 'కన్యకుఁ దగినవరుండు లభించుట తండ్రిప్రయత్న ములపయి నాధారపడియున్నది; ఆపిదప దైవాధీనము. మఱియు కన్యయొడఁ దండ్రికిఁగల బాధ్యతకంటెఁ దల్లికిఁగల బాధ్యత యధికము; కావున నీవిప్పుడు దేవినిఁ బిలువఁగోరెదను' అని పలుకఁగా మహారాజ్ఞిని పిలుచుటకుఁ గంచుకి వెళ్లెను.

అప్పుడు ప్రద్యోతునకు వత్సరాజుసంగతి జ్ఞప్తికిరాఁగా 'ఏమీ! వత్సరాజును పట్టుకొని తెచ్చుటకుఁబోయిన అమాత్య సాలంకాయనుఁ డింతవఱకును తిరిగిరాలేదు; పోనీ! ఒకవార్త నైనను పంపలేదు' అని యనుకొనుచుండఁగా నతనిదేవి యగు నంగారవతి యటకు వచ్చెను. రా జామెను కుశలమును ప్రశ్నించి 'అమ్మాయి వాసవదత్త యెక్కడ?' అని యడిగెను. 'ఆమె సంగీతవిద్వాంసురాలగు ఉత్తరయొద్ద వీణనేర్చుకొను టకుఁబోయినది.' అని రాణి బదులుచెప్పఁగా 'ఏమి? ఆమెకు సంగీతమునెడ నిట్టియభిలాష యెట్లు కలిగినది?' అని రాజు ప్రశ్నించెను; అంగారవతి 'కాంచనమాల వీణనుమీటుచును, గాన మభ్యసించుచుండఁగా చూచుటచే, అమ్మాయికిని గాంధర్వ విద్యయెడ నభిలాషపుట్టెను; నావోకమనవి. అమ్మాయికిఁ దగిన వీణాచార్యు నేర్పఱుపవలె నని ప్రార్థన' అని పలికెను. దానికి రాజు 'ఆమెకు వివాహము చేయఁదగినసమయము వచ్చియున్నది; ఇప్పుడు వీణాచార్యుని నియమించుట అనవసరము; పెండ్లియైన

పిదప ఆమెభర్తయే యామెకు గాంధర్వవిద్య నేర్పఁగలఁడు.' అని పల్కఁగా రాణి 'ఏమేమీ! అప్పుడే మనకన్యకకు వివాహ యోగ్యకైవయస్సువచ్చినదా? సంబంధమును నిశ్చయించితిరా?' అని ప్రశ్నించెను. ప్రద్యోతుఁడు 'ఇప్పటివఱకును దేనిని నిశ్చ యింపలేదు; కాశీరాజు రాయబారి యగు ఆర్యజైవంతి నేఁ డందులకే వచ్చియున్నాఁడు; ఇంతకుఁబూర్వము వంగ, మగధ, సురాష్ట్ర, శూరసేన, మిథిలారాజులు వాసవదత్తకొఱకుఁగా రాయబారముల నంపియున్నారు. వీరందరిలో నెవ్వఁడు యోగ్యుఁడో తెలుపుము' అనుచుండఁగా కంచుకి వచ్చి 'వత్స రాజు, వత్సరాజు' అని యఱచెను. రాజు 'వత్సరాజేమి?' అని యడుగఁగా, నతఁడు 'ప్రభువులు క్షమింపవలెను. తొందర పాటున అట్లంటిని. అమాత్యసాలంకాయనుఁడు వత్సేశ్వరుఁడగు ఉదయనుని పట్టితెచ్చెను' అని సంతోషముతో తెలిపెను. దానిని విని ప్రద్యోతుఁడు మిగుల ఆశ్చర్యపడెను. 'ఏమీ? యౌగంధరాయణుఁడు బ్రతికియుండఁగానే వత్సరాజు పట్టు వడెనా?' అని యడుగఁగా, కంచుకి 'ఆయన కౌశాంబీనగరమున నున్నాఁడు; వత్సరాజు వనములోఁ బట్టుపడెను' అనెను. 'ఈ వృత్తాంతమును సాలంకాయనుఁ డెవ్వనిమూలమునఁ బంపె' నని రాజడుగగా 'వే రెవ్వరిని పంపలేదు; ఆయనయే స్వయ ముగా వత్సరాజును దీసికొనివచ్చెను' అని బాదరాయణుఁడు జవాబిచ్చెను. అంతఁ బ్రద్యోతుఁడు 'అమ్మయ్య! ఇప్పుడు మన సేనలన్నియును విశ్రాంతిని పొందవచ్చును; రాజులందఱును లొంగియుండియు, వత్సరాజు లొంగకున్నందున ఇంతవఱకును నాకున్నమహాసేనబిరుదము చరితార్థము కాకున్నది; ఇప్పుడు నేను

యథార్థముగ మహాసేనుడనైతిని; కృతార్థుడనైతి' ననికలుగగా, అంగారవతీదేవి 'వత్సరాజును మనస్సులో నుంచికొనియే ఇంతవఱకును వాసవదత్తంగూర్చి యొవ్వరికినిమాటనీయమైతిమి.' అని పలికెను. పిదప మహాసేనుడు కంచుకితో 'బాదరాయణా! రాజకుమారునికిఁ దగినరీతిని, వత్సరాజును గౌరవింపవలె నని భరతరోహకునితోఁ బల్కుము; ఉదయను నెవ్వరు చూడవచ్చి నను, నిరభ్యంతరముగా వతనిని దర్శించుట కందఱకు ననుమతి నీయవలె ననుము.' అని పలికెను. అంత రాణి 'మహారాజా! ఈ రాజకులమున కింతవఱ కెన్నియేని అభ్యుదయములు కలిగి నవి! కాని దీనితో సాటియైన దెద్దియును లేదు' అని పల్కఁగా మహాసేనుఁ డవు నని పలికెను. అంగారవతి 'ఇంతవఱకును లెక్క లేనిసంబంధములు వచ్చుచున్నవి; కాని వాసవదత్తకు సరియగు సంబంధ మిదితప్ప వేఱొకటి కానరాదు' అనెను. దానికి రాజు 'దేవీ! ఉదయనుఁడు నామహాసేనబిరుదమునుకూడ లెక్కింపఁడు; అతఁ డుత్తముఁడగు భరతవంశమున జనించెను; గొప్పవిద్వాంసుఁడు; వంశపరంపరగా వచ్చిన గాంధర్వవిద్య అతనిసొమ్ము; లోకోత్తరసౌందర్యవంతుఁడు; ప్రజానురాగమును జూఱగొన్న వాఁడు; అట్టివాఁడు మనతోడిసంబంధము నభిలషించునా?' అని పలికెను. అంతలోఁ గంచికి వచ్చి యొకగొప్పవీణను ప్రదర్శించుచు — 'ప్రభూ! అమాత్యశాలంకాయనుఁ డిట్లు మనవిచేయఁగోరినాఁడు. ఇయ్యది ఘోషవతి యనుపేరిటి గొప్ప వీణ; భరతవంశీయులగు రాజుల కులక్రమాగతముగ వచ్చుచున్న ధనము-వత్సేశ్వరుని నిథానము; దీనిని ప్రభువులు గ్రహింతురు గాక!' అని ఈరీతి పలుకుచు దానిని సమర్పింపఁగా మహారాజు

వీణావాదనప్రియయగు వాసవదత్తకు వాని నీయఁదలఁచెను. దేవి యప్పుడు 'దీని నాకు కిచ్చినచో నాకును సంగీతప్రఁబిచ్చి మఱియు నధికమగును' అని పలుకఁగా, రాజు 'మన యింటిలో నున్నంతకాలము స్వేచ్ఛగా నుండనిమ్ము; ఆమీఁద అత్తవారింట నెట్లును స్వేచ్ఛ యుండ' దనెను.

పిదప ప్రద్యోతుఁడు వత్సరా జెట్లున్నదియు నెక్కడ యున్నదియుఁ బ్రశ్నింపఁగా 'శరీరము నిండుగను దెబ్బలు తగులుటచే నాయనను పల్లకిలోనే పరుండఁబెట్టి ముఖ్యగృహమునకుఁ దీసికొనివచ్చిరి.' అని కంచుకి తెలిపెను. అప్పు డతఁడు 'అయ్యయ్యో! ఎంతపని జరిగినది! శరీరమంతయు దెబ్బలేనా! కఠినుఁడనగు నే నుపేక్షించుటవలన ఎంత ప్రమాదము జరిగినది! ఆయనకు వెంటనే తగిన వ్రణచికిత్స యొనర్చునట్లు భరతరోహకునితోఁ జెప్పుము. మఱియు నతని యభిప్రాయమును గమనించి తగినరీతిని సత్కరింపవలెను; వెనుకటికథ లేవియు నాతని యెదుటఁ దడవరాదు; తుమ్మునపుడు దీవించుటయు, ఆ యాకాలములందు స్తోత్రపాఠములును జరుగవలెను.' అని యాదేశించెను. కంచుకి పోయి మరల వచ్చి 'వత్సరాజునకు మార్గమధ్యముననే వ్రణచికిత్స జరుపబడినది; ఇప్పు డాయన మయూరయష్టిముఖమున నున్నాఁడు' అని చెప్పెను. అంత రాజు 'ఆచోటున ఎండ దెబ్బతలుగును; కావున నతనిని వెంటనే యచ్చటినుండి తీసికొనివెళ్లి మణిగృహమునఁ బ్రవేశపెట్టవలె' నని యానతిచ్చెను. ఇంతలో భరతరోహకుఁడు మహారాజును జూడఁగోరఁగా, వత్సరాజు నీరీతిని గౌరవించుట ఆతని కిష్టము కాదనుసంగతి ప్రద్యోతుఁడే గ్రహించి, తానే యాతనిం జూడ వచ్చెద నని వార్త

నంపెను. మహారాజ్ఞి 'సంబంధమును నిశ్చయించిరా?' అని ప్రశ్నింపఁగా 'లేద'ని జబాబిచ్చెను; 'అమ్మాయి యింకను పసిది; తొందరయేల?' అని రాణి పలుకఁగా, రాజు 'సరే! నీయిష్టమే కానిమ్ము' అని పలికెను. పిదప నందఱును తమతమ నెలవుల కేఁగిరి.

తమ ప్రభువును శత్రుహస్తములనుండి విడిపించి తెచ్చుటకు తగిన యుపాయముల నాలోచించి తదనుసారముగా యౌగంధరుఁడు పిచ్చివాఁడుగను, వసంతకుఁడు భిక్షుకుఁడుగను, రుమణ్వంతుఁడు బౌద్ధసన్న్యాసిగను మారిరి. వీరుముగ్గురు నుజ్జయినీ నగరమునఁ బ్రవేశించి, వేర్వేఱుగ సంచరించుచు విశేషములఁ గనిపెట్టుచు, రాత్రి యొకయెడఁ గలిసికొనుచుఁ గార్యాలోచన మొనర్చుచుండిరి. ఒకనాఁడు భిక్షుకుఁడగు వసంతకుఁ డిట్లఱచుచుండెను. 'అయ్యో! అయ్యో! నా మోదకముల పాత్రమును దేవాలయపీఠమున నుంచి, దక్షిణగా వచ్చిన బంగారునాణెములను లెక్కించి, వానిని బాగుగా కట్టుకొని వచ్చులోపల, మోదకపాత్రము మాయమైనదే! దీని నెవ్వరు తీసియుందురు? నా వెంటవచ్చు బిచ్చగానికి ఒకమోదకము నీయఁగా వాఁడు తృప్తినంది వెనుకకుపోయెనే! వాఁడు రాఁడుకదా! పోనీ, కుక్క వచ్చి యెత్తుకొని పోయెనని యనుకొందమన్నను, ఇంతయెత్తు గోడలను దాటి రాఁగలదా? పోనీ! నేనే తినియుందునేమో అనిన త్రేన్చిన మోదకముల వాసనతోడి త్రేన్పు రాలేదే! ఒకవేళ లోహితశాక్యాయ నీదేవికి నివేదించిన మోదకములు తనవే యనుకొని శివుఁడే వీనిని తినివేసియుండిన నుండవచ్చును! ఈ దేవుఁ డెంతటికయినఁ దగినవాఁడే! పోయి

మూఁచెదఁగాక! అదిగో! అదిగో! శివునిపాదపీఠముననే నా మోదకపాత్ర మున్నది. ఓయి దేవుఁడా! నీకును నా మోదకములను దొంగిలింప బుద్ధిపుట్టెనా? ఇచ్చివేయుము, నా మోదకముల నిచ్చివేయుము; ఏమి? ఎంతతీసినను రాకున్నవే! ఏమిరా! ఇది చిత్రమా! ఈబొమ్మను తుడిచివేసి నాకువలె శివునకును మోదకములు లేకుండఁ జేసెదనుగాక! ఏమి? తుడిచినకొలఁది రంగు హెచ్చుచున్నదే! చిత్రకారుఁడా! ఎంత నేర్పరివిరా నీవు! చూడుము; నీటితెచ్చి కడిగివేసి చిత్రము లేకుండఁజేసెదను గాక! నాకు నీళ్లెక్కడ దొరకును? అదిగో! చెఱువు; అక్కడికిఁబోయి జలము తెచ్చెదఁ గాక!' ఇట్లనుచు పోవుచుండఁగా నతనికి పిచ్చివాని వేషముతోనున్న యౌగంధరాయణుఁ డెదురుపడి 'హహ్హహ్హా! మోదకములా?' అని నవ్వసాగెను. అతనిం జూచి భిక్షుకుఁడు 'ఇదుగో! ఈపిచ్చివాఁడు నామోదకముల పాత్రను తీసికొని నవ్వుచు, సురుఁగుతోఁ బొంగి వీథులలోఁ బాఱు మురికినీటివలెఁ బరిగెత్తిపోవుచున్నాఁడు. ఓరీ! పిచ్చివాఁడా! నిలు, నిలు. ఈముద్దుకఱ్ఱతో నీతల పగులఁగొట్టెదను' అని యనఁగా వాఁడు 'మోదకములా! ఎవరిమోదకములు? ఎక్కడి మోదకములు? వాని నేమిచేయుదురు? తిందురా? మూట కట్టుదురా? పాఱవేయుదురా?' అని యనుచు నవ్వసాగెను. విదూషకుఁడు 'వానిని తినరు; కట్టరు; పాఱవేయరు' అనఁగా 'వానిని తినుటకు నా నోరూరుచున్నది' అనెను. విదూషకుఁడు 'ఓపిచ్చివాఁడా! నా మోదకములను నాకిమ్ము; పరులసొత్తు దొంగిలించిన, బంధింపఁబడుదువుసుమీ!' అనెను. ఉన్మత్తుఁడు 'నన్నెవ్వరు బంధింపఁగలరు? నన్ను మోదకములు తప్పక రక్షించును'

అనెను. భిక్షుకుఁడు 'అయ్యా! నా మోదకములను నాకిమ్ము; వీనితో నే సుధాఖ్యాయిక లయింటికి పోవలెను' అనెను. పిచ్చివాఁడు 'ఈ మోదకములతో నేను నూఱు యోజనములు ప్రయాణము చేయవలె' ననెను. 'నూఱు యోజనములు పోవుటకు నీవింద్రుని వాహనమగు నైరావతమువా?' అని విదూషకుఁ డడుగఁగా నున్మత్తుఁడు 'ఔను, ఐరావతమునే; ఇంద్రుఁ డిప్పుడు నాపై నధిష్ఠింపలేఁడు; అతఁడు కాలిసంకెలలచే బద్ధుఁడైనట్లు నేను వింటిని. వర్షధారలచేతను, మెఱుపుకోరలచేతను, అతని మేఘబంధములను ఛేదించెదను' అనెను. భిక్షుకుఁడు 'నీవు నా మోదకముల నీయనిచో గట్టిగా నఱచెదను' అని పల్కఁగా 'సరే అరువుము ఏమ్మగుము' అని పిచ్చివాఁ డనెను. విదూషకుఁడు గట్టిగా నఱచెను.

ఆసమయమున క్షపణకవేషమున నున్న రుమణ్వంతుఁ డక్కడకువచ్చి, సమాచారమును తెలిసికొని భిక్షుకుని మోదకముల నాతనికీయనిచో శపింతునని యున్మత్తునితోఁ బలికెను. పిచ్చివాఁడు భయపడుచున్నట్లు నటించి మోదకపాత్రము నట నుంచెను. బౌద్ధభిక్షువు 'ఓ భిక్షకోపాసకా! ఈ మోదకముల పాత్రను నాకు సమర్పించి స్వస్తిపలుకుము' అని పలికెను. విదూషకుఁడు 'ఓహో! నా మోదకములను నీకిచ్చి స్వస్తిచెప్పవలెనా? వీనినొకగృహస్థు నాకిచ్చెనుగదా! పోనీ; ఇవి నీకును బహుకృతము లగునుగాక! ఆయున్మత్తుఁ డగ్నిగృహమువంక పోవుచున్నాఁడు; ఇప్పుడు మధ్యాహ్నమైనది; పూర్వాహ్ణమునఁగూడ నీచోటు విశ్రాంతుమ్యమై యుండును. నే నీదక్షిణగా వచ్చిన నాణెములను దాపిలోనున్న యొకయింటిలో దాచివచ్చె

దను' అని పలుకుచుఁ బోయెను. క్షపణకుఁ డగ్నిగృహమున కేఁగెను. అచట నిద్దరును గలిసికొనిరి.

యౌగంధరాయణుని కోరికపై విదూషకుఁడు తన వృత్తాంతము నిట్లు చెప్పెను. 'నేను చూచితిని; ప్రభువు లిదివఱకంటె నారోగ్యముగ నున్నారు. ఈ చతుర్దశినాఁడు స్నానము చేయుచున్నపుడే నే నాయనను జూచితిని. నన్ను చాల సేపు తనవద్ద నుంచివేసిరి. దేవునికి నమస్కరించి ధ్యానించుట తప్ప క్రమముగా పూజ చేయలేకపోయిరి!' ఇది విని రుమణ్వంతుఁడు 'ఇఁక మహామాత్యుల ప్రతిభవలన ప్రభువులు సమగ్రముగనె దేవపూజ చేయఁగల' రనెను. అంత యౌగంధరాయణుఁడు వసంతకునితో నిట్లనెను—'వసంతకా! నీవు మన ప్రభువును దర్శించి, మనము చేయఁదలఁచిన కార్యమునకు రేపే తగిన రోజని తెలుపుము. నళాగిరి యుండుచోట్లను గడ్డితినుచోటను, సంచరించుచోట్లను స్నానము చేయుచోటను ఔషధమూలిక లుంచఁబడినవి; యుక్తసమయమున ధూపమునకును తగిన యేర్పాటు చేయఁబడినది. రోషము నుద్రేకింపఁజేయుటకు శత్రుగజవిజృంభణము నేర్పఱుపఁబడినది. గజశాలకుఁ జేరువనున్న ఇన్నియిల్లు కాల్చివేయ నేర్పఱుపఁబడెను; ఏలయిన అగ్నియన ఏనుఁగులకు భయమెక్కువ. శంఖములు, దుందుభులును దేవాలయములం దాసమయముననే ధ్వనించును. అప్పుడు నళాగిరి పిచ్చియెక్కి చెలరేఁగును. అప్పుడు ప్రద్యోతుఁడు తప్పక మన మహారాజుగారిసాయమును కోరును. ఆయేనుఁగును స్వాధీన పఱచుకొనుటకు మనప్రభువు బంధవిముక్తుఁడై ఘోషవతి సాయమున దానిని స్వాధీనముచేసికొని దానిపై నధిరోహించి

మిక్కిలి వేగముగా నగరమును నిర్గమించును; మనసేన అతని ననుసరింపఁగా అవలీలగా వింధ్యాటవినిదాఁటి కౌశాంబిని చేరఁ గలఁడు. ఇట్లొక్క దినములోనే వ్యసనము వనము సౌఖ్యము నను మూఁడవస్థలను పొందఁగలఁడు. గజమిషతో మోసగింపఁ బడిన ప్రభువు నానెపముననే ఇట్లు విడిపించి ప్రద్యోతునకుఁ దగిన శాస్తి చేయవీలగును"

అంత వసంతకుఁ డిట్లనెను 'అమాత్యవర్యుని యాలోచన సరిగా నున్నది; కాని యిది ఫలించునట్లు నాకుఁ దోఁచదు. ఈయుపాయమువలన వత్సరాజును సులభముగాఁ జెఱనుండి తప్పింప సాధ్యమైనను, అతఁడు మాత్రము సులభముగా రాఁగలఁడని యనుకొనను' ఇదివిని చకితులై యౌగంధరాయణ రుమణ్వంతులు విషయమును వివరముగాఁ దెల్పఁగోరఁగా వసంతకుఁడు మఱల నిట్లనెను.

'కడచిన బహుళాష్టమినాఁడు రాజకుమారికయగు వాసవదత్త ధాత్రితోడురాఁగా యక్షిణీదేవతను పూజించుటకు, ఆదేవాలయమునకుఁ బల్లకిలో వచ్చెను. రాజపుత్రిక కన్యకయగుటచే ఇతరులకంటఁబడినను తప్పు లేదను భావమున ఆ పల్లకీ తెఱలు తొలఁగింపఁబడియుండెను. యక్షిణీదేవియాలయము కారాగృహమున కెదుటిభాగమున నున్నది. రాజకుమారి యటకు వచ్చునపుడు మార్గముప్రక్క నున్నమురుగుకాలువ పాడగుటచే మురికినీరంతయు రాజమార్గమున వ్యాపించుటచే వాసవదత్తపల్లకి యొకసందునుండి చెఱసాలప్రక్కగా వచ్చెను. కారాగారమునందున్న శిబకుఁడను నధికారి యనుమతిని పొంది మన ప్రభు వా సమయముననే కారాగృహముదాఁటి బయటికి

మన ప్రభువుల రక్షణార్థము మీరందఱును ఘోరముగఁ బోర వలెను; వత్సేశ్వరుని యుప్పుదిననవాఁ డొక్కఁడును వెను దీయరాదు.' అని తనవారిని ప్రబోధించుచు పోయి యుద్ధ రంగమునఁ బ్రవేశించెను; చారులుగను, వేషధారులుగనున్న కౌశాంబీవీరులు శత్రుసేనలు తమ ప్రభువును వెన్నంటకుండ అడ్డుకొని వారిని సంహరించుచుండిరి. కొంతవఱకును పోరి యౌగంధరాయణుఁడు పట్టువడెను. గాత్రసేవకుఁ డాతఁడున్న వైపునకే పోయెను. ఈసంఘటనమునకు భటుఁడు మిక్కిలి యచ్చెరువంది 'ఏమిది? ప్రాకార, తోరణములువిడిచి తక్కిన రెడల నంతటను కౌశాంబిప్రజలే కానవచ్చుచున్నారే! ఈసంగతి నమాత్యునకుఁ దెలియఁజేయుదునుగాక!' అని యను కొనుచుఁ బోయెను.

శుతగాత్రుఁడగు యౌగంధరాయణు నొకపల్లకిలో నుంచుకొని యిరువురు సాధారణయోధులు వచ్చుచు, దారిలో గుమిగూడియున్న జనులను తప్పుకొనవలెనని హెచ్చరించు చుండిరి. వారెంత హెచ్చరించుచున్నను వత్సరాజును, వాస వదత్తయును వెళ్లిపోయిరని సంభ్రమించుచున్న జనులు వీరిని లక్ష్యముచేయరైరి. ఆయోధులలో నొకఁడు 'ఆర్యులారా! ఆర్యయౌగంధరాయణుఁడు వచ్చుచున్నాఁడు; తొలఁగుఁడు; ఈయన కత్తి చేతఁబూని యక్షౌహిణిసేన కడ్డముగా నిలిచి అద్భుతముగాఁ బోరెను. ఆసమయమున విజయసుందరగజము యొక్క దంతములనడుమ నీతనికత్తి చిక్కువడి, విరుగుటవలన పట్టువడెను.' అని పలికెను. యౌగంధరాయణుఁడు 'శత్రుహస్త గతుఁడగు ప్రభువును విడిపించి, యుద్ధమునందు శస్త్రమువిరు

ఘటవలన శత్రువులకుఁ జిక్కితిని; భర్తృదుఃఖమును పోఁగొట్టి శత్రువునకు వశమైతిని. భార్యలేనివానికి వనవాస ముచితము; కోరికలు నెఱవేఱినవానికి వినిపాతము సుఖకరము; ధర్మము నెఱవేర్చువానికి మృత్యువు రమణీయము. అట్లే నాకును ఈవ్రతసనమానందదాయకము. ఓవీరులారా! నన్ను చూడ వచ్చిన ప్రజలను తొలఁగింపకుఁడు; అందఱును స్వేచ్ఛగా నన్ను చూతురుగాక! పిచ్చివానివేషమున బాటలపై పరుగెత్తిన నన్ను ప్రజలెఱుఁగుదురు; ఇప్పుడు నాకార్యమును ప్రజలు గుర్తెఱుఁగుదురుగాక!' అని పలికెను.

అంత నొకభటుఁడువచ్చి 'అమాత్యయౌగంధరాయణా! వత్సరాజు పట్టువడినాఁడు; అతఁడు వాసవదత్తాదేవితో భద్రవతిపై నెక్కి అతిరయమునఁ బోవుచుండగా, నళాగిరి దానిని వెన్నంటుటచేఁ బట్టువడె' నని యసత్యముగఁ బలికెను. అమాత్యుఁడు 'ఓయీ! నీమాటలు కల్ల. నిమేషమాత్రమున పెక్కు యోజనములుపోవు నాపిడియేనుఁగు నెవ్వరు ననుసరింపఁజాలరు; నళాగిరికట్టి శక్తియున్నమాట వాస్తవమే; కాని తగిన యాధోరణుఁ డుండునపుడే దాని కట్టిశక్తి కలుగును; వత్సరాజును విడిచి వేఱెవ్వరును (దానిని) నడుపఁజాలరు' అని పలికి వానిని నిరుత్తరు నొనర్చెను. భటుఁడు 'ఆర్యా! తగినరక్షక వర్గముగల యాయుధాగారమున భరతరోహకామాత్యుఁడు మిమ్ము చూడఁదలఁచియున్నాఁడు' అని పలుకఁగా, యౌగంధరాయణుఁడు 'ఏమీ! నేను తప్పించుకొని పోవుందుటకు రక్షకులు కావలెనా? అగ్నిని మూటకట్టినట్లు వత్సరాజును బంధించి నపుడే తగినరక్షణ యేర్పఱపవలసియుండెఁగా మీమంత్రులు నిశ్చి

చారముగా నిద్రించిరి. రత్నము పోయినపిదప, దానినుంచెడి బరిణెను కాపాడునట్లు, నన్ను తగిన రక్షణలో నుంచుట హాస్యాస్పదముగా నున్నది. మఱియు నేనును మీ భరతరోహకునిఁ జూడఁదలఁచి యుంటిని. రోషముతోఁగూడిన నాకఠినవాక్యములచే నాతని హృదయము ఖేదముపొందెడిది; నాయుక్తులకుఁ బ్రతియుక్తులను బన్న నతనికి శక్తిలేకుండెడిది; ప్రతిభయు నాలోచనయుఁ దక్కువ; ఇట్టిగుణములుగల మంత్రిని నేఁజూడఁదలఁతును.' అని పలికెను.

పిదప నతనికడకు భరతరోహకుఁడు వచ్చెను. 'మోసము చేసి, తన ప్రతినను నెఱవేర్చుకొనిన యౌగంధరాయణునిఁజూడ నంత ఇష్టపడను; ఈతఁడు ప్రభువునకయి విపన్నుఁడైన యుదారుఁడు; ఆయౌగంధరాయణుఁ డెక్కడ ?' అని యతఁడు ప్రశ్నించుచువచ్చెను. యౌగంధరాయణ భరతరోహకు లొకరినొకరు పల్కరించుకొనిరి. యౌగంధరాయణుని కంఠస్వరము హీనముగా నున్నను, గంభీరముగా నున్నది. రక్తప్లావితశరీరుఁడగు యౌగంధరాయణుని భరతరోహకుఁడు గమనింపలేక పోయెను. 'ఓ భరతరోహకా ! ఇదిగో! రక్తసిక్తదేహుఁడనయ్యు వీరునివలె ధైర్యముతోనుండి, పితృఘాతకుని జంపి నిలిచిన యశ్వత్థామవలె ఇదె! నేనున్నాను' అని యౌగంధరాయణుఁడు పలుకఁగా భరతరోహకుఁడు 'మోసముచేసి గజమూలముగా కార్యము నెఱవేర్చి నీప్రభావముగా చాటుకొందువేమి ?' అని పలికెను. యౌగంధరాయణుఁడు 'ఓయీ! మల్లికసాలవృక్షములకడ మోసమున నీలగజమును నిర్మించి, మాప్రభువును బంధించి బావులవేతలాడగా నతఁడు బాధపడునట్లుచేయుట గొప్ప

కార్యమము కాఁబోలు! కల్పితగజము ననుసరించియే, ఘోష-వతితో యథార్థగజమును స్వాధీనముచేసికొనుట వంచనయే కావచ్చును; ఇయ్యది నీవు నేర్పినవిద్యయే కాని క్రొత్తది కాదు' అని జవాబీయఁగా, భరతునిరోహకుఁడు 'మాప్రభు వగ్ని సాక్షిగా దానముచేయని కన్యను శిష్యురాలను దొంగతనముగాఁ దీసికొనిపోవుట యుచితమేమి ?' అని యడిగెను. యౌగంధ రాయణుఁడు 'లేదు; వారిరువురికిని గాంధర్వవివాహము జరిగి యుండును ; భరతవంశమునఁ బుట్టిన యుత్తమక్షత్రియుఁడగు వత్సరాజు ఆ నామెను వివాహమాడు కోరికయే లేనిచో గాంధర్వ విద్యను నేర్పియే యుండఁడు' అనెను. 'ఇప్పుడును మారాజు దయనుసిపై గౌరవముతోనే యున్నాఁడు; దానినైన నాతఁడు గమనింపలేదు' అని ప్రద్యోతమంత్రి పలుకఁగా 'నళాగిరిని లొంగఁదీసికొనుట కట్లు దయచూపఁబడెను; వత్స రాజును విడిచి వేఱెవ్వరును దానినిఁ లొంగఁదీయ లేరని యాతఁ డెఱుఁగును' అని పలుకఁగా 'అట్లయిన కుఱుల వేల బంధింప లేదు?' అని భరతరోహకుఁ డనెను. 'లోకులు హర్షింపరని' అని యౌ గంధరాయణుఁ డనఁగా 'రాజద్రోహ మొనర్చినవారికి మరణ దండనమే శిక్షయని నీవెఱుఁగుదువుకదా ! మారాజు వత్సరాజు నేల వధింపలేదో తెలియదా?' అని ప్రద్యోతునిమంత్రి పలికెను. 'అందుకనియే మారాజు మీరాజును చెఱఁగొని తీసికొనిపోలేదు; లేనిచో అదియు సులభము' అని యౌగంధరాయణుఁడనెను. 'అది సులభమా?' అని భరతరోహకుఁ డడుగఁగా 'కాకేమి? చేఁజిక్కిన మీరాజును, దయాళువగుమారాజు విడిచిపెట్టెను, ఐరావతము నధిరోహింపక వైజయంతిని ప్రయోగించుట అసంభ

వముకదా !' అని యౌగంధరాయణుఁ డనెను; భరతరోహ కుఁడు కోపించి 'ఇట్లు పలికిన నీవు కౌశాంబి కెట్లు పోఁగలవో చూచెదముగాక!' అని పల్కఁగా, యౌగంధరాయణుఁడు 'ఏమి మాట లివి ? మూలచ్ఛేదము చేసినవానికి కొమ్మలునఱకుట యొక లెక్కయా ? మీయెదుటనే కన్నులలో దుమ్ముకొట్టి వెళ్లి పోయిన మారాజునకు నన్ను విడిపించుట లెక్కలోనిది కాదు' అని పలికెను.

అంత నొకకంచుకి యొకవిలువైనపాత్రముఁ దెచ్చి 'మహాత్మా! యౌగంధరాయణా! నీవు మా యోపాయ ములన్నిఁ నాకపకార మొనర్ప సమర్థుఁడవు. అట్లయినను, ఎట్టి యపకృతినొనర్పక నన్ను విడిచితివి. నీకిదే, నాయిచ్చుబహు మానము; స్వీకరింపు' మని ప్రద్యోతప్రభువు పంపె' నని యనుచు యౌగంధరాయణున కాపాత్రముఁ సమర్పించెను. అతఁడు 'నేఁ దగులపెట్టినయుం డ్లింకను మండుచునే యున్నవి; వానితోఁబాటు మంత్రులమనస్సులు కోపముచ మండుచున్నవి. వధార్హుఁడనగు నాకు మరణదండన కావలసినది; పూజించుట యుచితముకాదు' అనెను.

ఇంతలో నొకకలకలము వినవయ్యెను. అదేమో కను గొనిరా మంత్రిచేఁ బంపఁబడి కంచుకి తిరిగివచ్చి యిట్లనెను. 'కుమారికవృత్తాంతము విని అంగారవతీదేవి దుఃఖితయై మేడ మీఁదినుండి పడి ప్రాణములు విడువ సిద్ధపడెను. అప్పుడు మహాసేనుఁడు 'నీకుమార్తె కుదయనునితో వివాహ మీవఱకే నిశ్చితమైయున్నది. వాసవదత్తయు, ఉదయనుఁడు నిచట లేకున్నను, వారిచిత్రములకు యథావిధిని వివాహము జరి

గింతము; విచారింపకు'మని యామె నొడార్చెను. ఆవివాహ మురుకూర్చినదే యౌగంధరులకలము!' అని మనవిచేసెను. యౌగం ధరాయణుఁ డదివిని చాల సంతోషించి 'మహాసేనుఁడు మా ప్రభువుతోడి సంబంధము నంగీకరించెను; కాన నేను తప్పక భృంగారమును గ్రహించెద' నని చెప్పుచు నాపాత్రమును గ్రహించెను. పిదప భరతరోహకాదులు నీసంఘటనమునకు సంతసించిరి. మహాసేనుఁడగు ప్రద్యోతుఁడు తగినరీతిని యౌగంధరాయణుని గౌరవించి కౌశాంబికి సాగనంపెను.

వత్సరాజు వాసవదత్తను వివాహమాడి యౌగంధ రాయణుఁడు రాజ్యకార్యము నందీప్ప సుఖము నుండెను.



# స్వప్నవాసవదత్తము

## పీఠిక.

స్వప్నవాసవదత్తమను నీనాటకమును భాసమహాకవి సంస్కృతమున రచించెను. భాసుఁడు కాళిదాసమహాకవికంటెఁ బ్రాచీనుఁడు. అంతియేకాక కాళిదాసుచే మిగులఁ గొనియాడఁబడిన నాటకకర్త. కాళిదాసు తనరూపకముల కీతనినాటకములను మేలిబంతులుగా గ్రహించియున్నాఁడు.

భాసమహాకవి వత్సరాజగు నుదయనునిగూర్చిననాటకములను రెండిటిని వ్రాసెను; అం దిది రెండవది; ఈనాటకమున ఉదయనుండు—మరణించినదనుకొన్న తనతొలిభార్యయగు వాసవదత్తాదేవిని స్వప్నమునందుఁ గాంచుటయు, ఉదయన వాసవదత్తల పునస్సమాగమమున కయ్యది దోహదమగుటయు నిందు వర్ణితములు. కావుననే దీనికి స్వప్నవాసవదత్తమను పేరు పెట్టఁబడినది.

భాసునినాటకములు పదమూఁడులబ్ధములు. ఆనాటకచక్రములోని రసవంతములగు నాటకములలో నీ 'స్వప్నవాసవదత్త' మొకటి.

---

## పాత్రములు

### పురుషులు

ఉదయనుఁడు—వత్సదేశప్రురాజు, కథానాయకుఁడు
వసంతకుఁడు—ఉదయనుని వేడుక చెలికాఁడు
యౌగంధరాయణుఁడు—వత్సరాజు మంత్రి
బ్రహ్మచారి—లావణకమునకు విద్యాభ్యాసమునకేఁగినవాఁడు
రైభ్యుఁడు—ప్రద్యోతుని కంచుకి
సంభషకుఁడు, భటుఁడు—పద్మావతి సేవకులు
కంచుకి—

### స్త్రీలు

వాసవదత్త—ఉదయనుని తొలిభార్య; వేషమున అవంతిక
పద్మావతి—మగధరాజసోదరి, ఉదయనుని రెండవభార్య
తాపసి—
చేటి—పద్మావతి పనికత్తె
మధురిక, పద్మినిక—పద్మావతి చెలికత్తెలు
ధాత్రి—పద్మావతి పెంపుడుతల్లి
విజయ—ఉదయనునింటి సేవకురాలు
ధాత్రి—వాసవదత్త పెంపుడుతల్లి

---

# స్వప్నవాసవదత్తము

కౌశాంబీనగరము రాజధానిగా వత్సదేశమును ఉదయనుఁడను రాజు పరిపాలించుచుండెను. అతఁడు సమస్తకళాకుశలుఁడు; ఉదారహృదయుఁడు; విశేషించి సంగీతశాస్త్రమునను, వీణావాదనమునను సాటిలేని పండితుఁడు. ఘోషవతి యను తనవీణను మీటుచు నతఁ డెంత మదించిన ఏనుఁగునైనను అవలీలగ లోఁగఁదీసికొనఁగలఁడు. ఉజ్జయినీపాలకుఁడగు ప్రద్యోతునిపుత్రికయగు వాసవదత్తాదేవి యుదయనుని పట్టమహిషి. బృహస్పతిని మించిన మేధావియు, సాటిలేని ప్రభుభక్తిపరాయణుఁడునగు యౌగంధరాయణుఁడు ఉదయనునికిఁ బ్రధానామాత్యుఁడు; యుద్ధములం దెదురెఱుఁగని రుమణ్వంతుఁడు యుద్ధమంత్రి; కుశాగ్రబుద్ధియు, రాజభక్తుఁడు నగు వసంతకుఁడు నర్మసచివుఁడు. కావున ఏవిధమునను లోప మెఱుంగక యుదయనుఁడు నిర్విచారముగఁ గాలముగడుపుచుండెను.

కాని కాల మొక్కతీరుగా నుండదు. వత్సరాజు విరోధియగు నారుణియను రాజు సమయము కనిపెట్టి, తగినబలములఁ గూర్చుకొని వత్సదేశముపయి దాడివెడలి చాలభాగము నాక్రమించెను. ఉదయనుఁడు చేయునదిలేక లావాణకమను గ్రామమున నివాస మేర్పఱచుకొని నష్టశేషమును అత్యల్పమునగు తనరాజ్యము నచటనుండియే పాలింపసాగెను.

మహామేధావియగు యౌగంధరాయణుఁడీవిషయమున నుపేక్షించలేదు. బలవత్సహాయమును పొంది తత్కాలమున పోయినరాజ్యమును మఱల సంపాదించి ప్రభువున కర్పింపవలె నని యతఁడు తహతహపడుచు తగినయుపాయము నన్వేషించు చుండెను. అక్కాలమున మగధదేశాధిపతియగు దర్శకమహా రాజు ప్రబలుఁడయియుండెను. అతనికి పద్మావతియను సోదరి కలదు. వయోరూపలావణ్యములందామెకు సాటి యెందకత్తె లేదు. ఆమె నెట్లయినను వత్సరాజగు నుదయనున కిప్పించి వివాహ మొనరించినచో ఉదయనునకు దర్శకునిసాహాయ్యము యత్నసిద్ధమే యగును. దానివలన తమప్రభువు పోయినరాజ్య మును మఱల సంపాదింపఁగలఁడు. ఉదయనునిరాజ్యము శత్రు హస్తగతమగునని తొలుతఁజెప్పిన పుష్పకభద్రాదులగు దైవ జ్ఞులు కాలక్రమమున పద్మావతీదేవి యుదయనునికి భార్య కాఁగలదనియు, పోయినరాజ్యమును మఱల నుదయనుఁడు పొందుననియుఁ జెప్పుటచేతను వారియాదేశము యథార్థమై నట్లు తోఁచుటచేతను యౌగంధరాయణుఁడు పద్మావతిని తమ ప్రభునిరాణిగాఁజేయ నాలోచింపసాగెను.

ఉదయనుఁ డెట్టియుత్తమగుణసంపన్నుఁడయినను, అతఁడు తమబంధుకోటిలోని వాసవదత్తాదేవిని వివాహమయియుండు టచే దర్శకుఁడు పద్మావతి నుదయనున కిచ్చుట కంగీకరింపఁడు; వాసవదత్తపయి గాఢానురాగముగల యుదయనుఁడను వేఱొ కతెను పెండ్లియాడ నిచ్చగింపఁడు. ఈయంశములను గని పెట్టియే యౌగంధరాయణుఁడు తమప్రభు వొకపుడు వేఁట కయిపోయినపిదప, ఈవిషయములన్నియును వాసవదత్తకుఁ

దెల్పి నచ్చఁజెప్పి కొంతకాల మామె అజ్ఞాతవాసమునం దుండ వలెననియు, ఆమె మరణించెనని లోకమున వదంతిపుట్టింతు ననియుఁ దెలిపెను. భర్తృశ్రేయోఽభిలాషిణియగు నామె దాని కంగీకరించెను. యౌగంధరాయణుఁడు తాను మాఱు వేసము వేసికొని, ఆమెకును మాఱు వేషము వేయించి, 'అవంతిక' అని పేరుపెట్టి లావాణకగ్రామమునుండి యామెను దూరముగఁ దీసికొనిపోయినపిదప, ఆగ్రామమునకు నిప్పంటించి, 'వాసవదత్తా దేవియు, ఆమెను రక్షింప సాహసించిన యౌగంధరాయణుఁ డును అయగ్ని కాహుతియై (మరణించి) రని కింవదంతిని బుట్టించెను.

ఆసమయమున దర్శకుని సోదరియగు పద్మావతీదేవి మగధ రాజ్యమునందేగల యొకతపోవనములోఁ దాపసియై యున్న తనతల్లిని సందర్శించుటకయి యావనమునకు వచ్చియుండెను. అప్పుడు పద్మావతీదేవి తనతోనున్న కంచుకితో 'ఈయాశ్రమము నందున్న మును లేమికోరినను ఈయఁదలఁచితినని తెల్పుము, కమండలువులుగాని, కావిగుడ్డలుగాని, గురుదక్షిణలుగాని— ఎవ్వరేమి కోరినను సరియే; మా రాజకుమారి యిచ్చుటకు సిద్ధ ముగా నున్నదని పలుకుము' అని చెప్పఁగానే యతఁడు నల్దె యందఱి నాహ్వానించెను. కాని యాతపోవనమునందలి తపస్వు లందఱును నిత్యసంతుష్టులగుటచే నొక్కరును రారైరి. కాని తాపసవేషముననున్న యౌగంధరాయణుఁడు అవంతికావేష మునను న్న వాసవదత్తాదేవిని వెంటఁబెట్టుకొని సమయము నెదురుచూచుచున్నందున నెదుటికివచ్చి నిలువఁగాఁ గంచుకి "నీకేమి కావలయు?' నని ప్రశ్నించెను. దాని కాతఁడు తనతో

నున్న యవంతికం జూసి 'ఈమె నాసోదరి; ఈమెభర్త దేశాంతరమున కేఁగియున్నాఁడు. అతఁడు మఱలివచ్చునందాఁక ఈమెను మీరాజకుమారి తనయొద్దనుంచికొని రక్షింపవలయు నని కోరుచున్నా' నని పలికెను. అవంతికను రాజకుమారియొద్ద న్యాసముగా నుంచుట తనకార్యసిద్ధి కెంతయు ననుకూలమని యౌగంధరాయణుని తలంపు. వాసవదత్తాదేవి వేఱొకయింట నుండుట తనకెంతమాత్రము నిష్టములేకున్నను, ఎంతయో యాలోచించినఁగాని యౌగంధరాయణుఁ డిట్లాచరించఁడనియు, దీనివలన మేలే కలుగవచ్చుననియుఁ దలఁచెను' కంచుకి 'వేఱెట్టి కార్యమైనను సుకరముగాని, న్యాసరక్షణము సాధ్యము; దుష్కరము' అని పద్మావతితోఁ దెలుపఁగా యౌగంధరాయణుఁడు 'నాకు ధనముగాని, వస్త్రములుగాని, వేఱెట్టిభోగములుగాని అపేక్షణీయములు కావు; జీవికకయి నేనీకావిగుడ్డలు కట్టలేదు; ఈ నాసోదరి ధర్మశీల, ధీర; పురుషులను జూడనొల్లదు. ఈ నాసోదరిని రక్షించుటకు మీ రాజకుమారియే యర్హురాలని యిట్లు కోరుచున్నాను' అని పలుకఁగా; పద్మావతి 'తొలుత, ఏమికోరినను ఇచ్చెదనని ప్రతినచేసి, యిప్పు డీకోరికను దిరస్కరించుట తగునా?' అవంతికను రక్షించుట కంగీకరించెను. యౌగంధరాయణుఁడు వాసవదత్తను రాజపుత్రిక కప్పగించి 'వాసవదత్తను తగినచోట దాఁచినందున సగముబరువు తగ్గినది. ఉదయనునకుఁ గాఁబోవుభార్యయగు పద్మావతిదగ్గఱ నీమె నుంచుటచే మునుముందు నాకీమెవిశ్వాస్యస్థానము కాఁగలదు' అని యనుకొనెను.

అప్పుడొక బ్రహ్మచారి యచటికిఁ బోవుచు మధ్యాహ్న సమయమైనందున అచ్చట ఆయాశ్రమమున విశ్రమింపఁదలఁచి యా యాశ్రమశోభ కచ్చెరువందుచుండఁగా నతనికిఁ గంచుకి రాజకుమారి మున్నగు నాశ్రమవిరుద్ధజనులు కానవచ్చిరి. కాని యతఁడు మఱియొకవైపు చూచి యట మునిజన ముండుటకు సంతసిల్లెను. అప్పుడు కంచుకి 'అయ్యా! ఇది సర్వజన సాధారణమగు ఆశ్రమము; మీరు స్వేచ్ఛగా రావచ్చును' అని యాహ్వానించెను. అప్పుడు యౌగంధరాయణుఁ డాతనిఁ జూచి, 'అయ్యా! మీ రేయూరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు?' అని యడుగఁగా బ్రహ్మచారి తనవృత్తాంతము నిట్లు చెప్ప సాగెను.

'నేను వేదాధ్యయనముకొఱకు వత్సదేశమందలి లావాణకమను గ్రామమునకుఁ బోయితిని; కాని యచట విద్యపూర్తి కాకుండ నొక అంతరాయము కలిగినది. అదేమన; వత్సదేశాధీశ్వరుఁడును, లావాణకనివాసియునగు ఉదయనుఁ డొకప్పు డడవికి వేఁటకై పోఁగా, ఆయూరు కాలిపోయినది. కావున నే నా చోటు విడిచి స్థలాంతరమునకు విద్యాపూర్తికొఱకుఁ బోవుచున్నాను'

బ్రహ్మచారిపల్కిన యీమాటలు విని యౌగంధరాయణుఁడు 'అగ్నివలన నెవ్వరికి నపాయము కలుగలేదుగదా!' అని యడుగఁగా బ్రహ్మచారి 'కలుగకేమి? అప్పుడు రాజపత్నియగు వాసవదత్తాదేవియుఁ గాలిపోయినది; ఆమెను రక్షించుటకయి యౌగంధరాయణుఁ డగ్నిలోఁ నురుకుటచే నతఁడును మరణించెను; వేఁటనుండి తిరిగివచ్చిన యుదయనమహారా

జీవృత్తాంతమును విని తానుగూడ ఆయగ్నిలోఁబడి మరణింపఁ దలఁచెనుగాని రుమణ్వంతుఁడు మున్నగు మంత్రులతని వారించిరి. ఉదయనుఁడు ప్రియావియోగము నోర్వలేక దుఃఖించుచు, దగ్ధశేషములగు నామె యాభరణములను గౌఁగిలించుకొని యేడ్చుచు మూర్ఛిల్లెను. అతనిదుఃఖమునకు రాళ్లకుఁ గూడ నేడ్పువచ్చు ననవచ్చును. అంత మంత్రిపుంగవుఁ డగు రుమణ్వంతుఁడు రాజు ననేకవిధముల నూరడించుచుండెను. తన ప్రభువుతోఁబాటాతఁడును తిండిలేక, నిద్రలేకయుండి, రాజుసేవ చేయుచు, అహోరాత్రము లొక్కనిముసమైన నతనిని విడిచి యుండక యాతనితోడిదే లోకముగా నుండెను. ఉదయనుఁడు వాసవదత్తాదేవితోఁ గలసి, మెలసి తిరిగినచోట్లను జూచుచు, ఆమెను స్మరించుచు నెప్పటికిని దుఃఖమును విడువకపోఁగా మంత్రు లతిప్రయత్నమున నాతనిని శోకస్థలమునకుఁ దీసికొనిపోయిరి. 'ఉదయనుఁడు విడిచినదిమొదలాయూరు చంద్రనక్షత్రశూన్యమగు నాకాశమువలె కళాహీనమైపోయినది.' అని యచటివృత్తాంతమును సమగ్రముగాఁ దెలిపెను. దీనిని విని యచటివారందఱును, ఉదయనునియుత్తమ గుణములను మిగులఁ బ్రశంసించి, అతనికిఁ గలిగిన యావ్యసనమునకు మిగుల దుఃఖించిరి. బ్రహ్మచారి యట్లు పలికి, ఆతిథ్యమును గైకొని కొంచెముసేపు విశ్రమించి తనదారిం బోయెను. యౌగంధరాయణుఁడును, తనతలఁచినపని యింతవఱకును నిర్విఘ్నముగఁ గొనసాఁగినందులకు సంతసించుచు, వాసవదత్తను మఱియొకసారి పద్మావతి కప్పగించి కంచుకితోడను జెప్పి వెళ్లిపోయెను. పిదపఁ బద్మావతి వృద్ధతాపసికి నమస్కరించి 'అను

రించుచుండఁగా ఆమెను వెదకికొనుచు నొకచేటివచ్చి 'అమ్మా నీకొఱకు రాణెల్ల వెదకుచున్నాను. నీవు గొప్పయింటిబిడ్డవు. పద్మావతికి మిత్రురాలవు, నేర్పుకలదానవునని, మా రాణి వివాహకౌతుకమాలికను నీచేఁ గట్టించి తెమ్మని యానతిచ్చినది; ఇవిగో, పత్ర, పుష్పపల్లవములు; శీఘ్రముగాఁ దయచేయుము.' అని చెప్పఁగా వాసవదత్త 'అయ్యో! దైవమా! ఈపనికూడ నేనే చేయవలసివచ్చినదా?' అని తనలోఁ జింతించుచు, మాలికను మెల్లగా గ్రుచ్చుచుండఁగా, చేటి 'అమ్మా! త్వరగాఁ గానిమ్ము; అల్లుఁడుగారిపుడే స్నానమాచరించి చతుశ్శాలలోఁ బ్రవేశింపనున్నా' రనెను. వాసవదత్త వేగముగా గ్రుచ్చుచు 'నీవాయనను జూచితివా? ఎట్లున్నారు?' అని ప్రశ్నింపఁగా చేటి 'అట్టియందగాని నిదివఱకుఁ జూడలేదు; ఆయన శరచాపములులేని మన్మథుఁడే.' అని పలుకఁగా వాసవదత్త 'ఇఁక చాలును; పరపురుషసంకీర్తనమును వినఁగా' దని పలుకుచు, దండఁ గ్రుచ్చుచు కొన్ని దళములం జూపి, వానిపేర్లడిగెను. చేటి 'ఇది సౌభాగ్యవర్ధన మనునది; ఇది సపత్నీమర్దనము' అని వేర్వేఱుగాఁ జూపఁగా, వాసవదత్త 'ఆయన ప్రథమభార్య మరణించియున్నందున సపత్నీమర్దనమును గ్రుచ్చనక్కఱలే' దని దానినిమాత్రము విడిచి, మిగిలినవి గ్రుచ్చి దండకట్టియిచ్చి, దానిని బంపెను. మఱియు నామె 'భర్త పరాధీనుఁడయ్యెఁగదా!' అని పరితపించుచు, ఎందేని శయనించి, కొంత సంతాపశాంతిని కలుగఁజేసికొందు' నని తలఁచుచు నటనుండి లేచిపోయెను.

వివాహానంతర మొకనాఁడు పద్మావతీదేవి సపరివార యయి, అవంతికావేషధారిణియగు వాసవదత్తతోఁగూడ నుద్యానవనమునకువచ్చి యొకవేదికపయిఁ గూర్చుండి కొన్ని శేఫాలికాపుష్పములను గోసి కొనిరమ్మని చేటిని బంపి యవంతికతో ముచ్చటలాడుచుండెను. ఇంతలో చేటి కొన్నిపూవులను గోసికొనివచ్చి యామె కందిచ్చి 'అమ్మా! ఇంకను గోసికొని వత్తునా?' అని యడుగఁగా పద్మావతి 'వలదు; వలదు. ఆర్యపుత్త్రులిచటికివచ్చినచో, పూలతోఁగూడినచెట్లను జూడ ముచ్చటపడుదురు.' అని పలికెను. అప్పుడు వాసవదత్త 'సఖీ నీభర్త నిన్ను మిక్కిలి ప్రేమించునా?' అని యడుగఁ బద్మావతి 'అది నే నెఱుఁగుదును; కాని నేనాయననువిడిచి యొకనిమిషమైన నుండఁజాలను.' అని పలికెను. మఱియు నామె 'నా కొక్క సందేహము కలుగుచున్నది; ఇప్పుడు నన్ను ప్రేమించినట్లు భర్తగా రప్పుడు వాసవదత్తాదేవిని ప్రేమించియుండిరా? అని పలుకఁగా 'ఇంతకంటె నెక్కువగానే ప్రేమించియుండి' రని వాసవదత్త జబాబిచ్చెను. 'ఈసంగతి నీకెట్లు తెలియు?' నని పద్మావతి యడుగఁగా, వాసవదత్త తాను పొరపాటున నాసంగతిని చెప్పినట్లు తెలిసికొని దానిం గప్పిపుచ్చి 'చెలీ! ఎక్కువ ప్రేమలేనిచో ఆమెంగూర్చి యిట్లేల విలపించును?' అని పలికెను. అప్పుడు చేటి 'అమ్మా! వాసవదత్తాదేవికివలె నాకుఁగూడ వీణ నేర్పవలె నని భర్తగారి నడుగవమ్మా!' అని పలుకఁగా, పద్మావతి 'అడిగితిని; దాని కాయన మాఱుపలుకక కొంచెము నిట్టూర్పు విడిచి యూరకుండిరి.' అని చెప్పఁగా, వాసవదత్త దానికిఁ గారణ మేమైయుండును?' అని యడుగఁగా, పద్మావతి

'వేఱేమున్నది? పూజ్యురాలగు వాసవదత్తాదేవిగుణములను దలఁచుకొనియు నాయెడఁట విలపించుట బాగుండదని దుఃఖమును దిగమ్రింగెనని యనుకొంటిని' అని పలుకఁగా, వాసవదత్త తాను ధన్యురాలనైతి నని తలఁచెను.

ఈ రిట్లు మాటలాడుకొనుచుండఁగా, ఉదయనుఁడు తన వేడుకచెలికాఁడగు వసంతకునితోఁగూడ నాపూలతోఁటలోనికి వచ్చి వానిరామణీయకమున కచ్చెరువడుచు వసంతకునితో మిత్రుఁడా! నాఁ డుజ్జయినిలో వాసవదత్తాదేవిని జూచునపుడు మన్మథుఁడు తనకున్నయైదుబాణములను నాపయిఁ బ్రయోగించెను; అవి యిప్పటివఱకును నాహృదయమున నాటుకొని యున్నవి. ఇప్పుడు నన్నేఁచుట కతని కాఱవబాణ మెక్కడ నుండివచ్చినదో!' అని యనుచుండఁగా, విదూషకుఁడు 'మిత్రుఁడా! పద్మావతీదేవి లతామండపములో నున్నదో, చంద్రకాంతవేదికపై నున్నదో యేడాకులయనఁటులతోఁటలో నున్నదో తెలియకున్నది. కాని, చూడుము; అదిగో, ఆకాశమున బారులుకట్టి యెగురుచున్న యీసారసపక్షు లెంత యందముగా నున్నవో!' అని చూపఁగా చూచి యుదయనుఁడు మిగుల సంతసించెను. వీరిట్లు మాటలాడుకొనుచుండఁగాఁ గని పెట్టి చేటి రాజుగారు వచ్చిన సమాచారమును పద్మావతికిఁ దెల్పఁగా- పరపురుషులఁ జూడనొల్లనియవంతికతోఁ దానున్నందున, తానును రాజుగారికిఁ గానరాకుండుటకయి సపరివారముగ మాధవీలతామండపములోనికిఁ బోయెను. ఉదయన వసంతకు లా వేదికకడకువచ్చి అప్పుడే కోయఁబడినపూవులుగల శేఫాలికాలతలం జూచి దేవి యచ్చటకు వచ్చి వెళ్లియుండునని

యూహించి, మాధవీలతామండపములోఁ బ్రవేశింపఁదలఁపఁగా, ద్వారముకడనున్న చేటిక యచ్చటికొమ్మలను గదల్చెను. అప్పుడు దాని నంటియున్న తుమ్మెదలు ఝుమ్మనుచు లేచి ముందువచ్చుచున్న వసంతకునిఁ గుట్టుటచే, వారిరువురు మఱిముందునకు రాక, వేదికపైనే కూర్చుండిరి. అట్లు కూర్చున్న యుదయనుని వాసవదత్త తీగలసందులనుండి చూచి, అతండు కృశించక, తొంటియట్లే యున్నందుకు సంతసించియు, వియోగమునకు దుఃఖించి కన్నుల నీరు పెట్టుకొని, పద్మావతి యనుమానింపకుండుటకయి 'పుష్పాడి తుమ్మెదలచే నెగురఁగొట్టఁబడి కన్నులలోఁబడిన' దని పలికెను.

అప్పుడు వసంతకుఁడు 'మిత్రుఁడా! ఈయుద్యానవనమున నిప్పుడింకెవ్వరును లేరు; ఒక్కచిన్న ప్రశ్న నిన్నడిగెదను. సంశయింపక జవాబిమ్ము. పద్మావతీ, వాసవదత్తలలో నీప్రేమ నెక్కువగాఁ జూఱఁగొన్నవా రెవరు?' అని ప్రశ్నింపఁగా, పద్మావతీ వాసవదత్త లిరువురు నతఁ డేమి జవాబు చెప్పునో యని యెదురుచూచుచుండిరి; రాజేమియు ననక యూరకొనఁగా, వసంతకుఁడు 'సందేహించెద వేల? వాసవదత్త మరణించినది గదా! పద్మావతి ఇక్కడ లేదుగదా! యథేచ్ఛముగాఁ జెప్పుము' అని యడుగఁగా ఉదయనుఁడు 'వయస్యా! నీబలాత్కారము వలనఁ జెప్పుచున్నాను; రూపవిలాసశీలములచేతం బద్మావతియును నాకెక్కువ ప్రియురాలే యగును; కాని వాసవదత్తయందు లగ్నమైన నామనస్సు నీమె యంతఁగా నాకర్షింపఁజాలకున్నది.' అని మెల్లగఁ జెప్పెను. దానికి వాసవదత్త మిగుల సంతసించి 'అజ్ఞాతవాసమునందును నామనస్సున కెంతో యూఱట కల్గుచున్న' దని తనలోఁ దృప్తిపడెను. అప్పుడు చేటిక

'నీభర్తకు నీపై దయలే' దని పలుకఁగా, పద్మావతీదేవి 'అట్లన
కుము; ఇప్పటికినిగూడ భర్తగారు వాసవదత్తాదేవిని స్మరించు
చుండుటవలన, ఆయన ఎంతయో దాక్షిణ్యముకలవా రని
తెలియుచున్న' దని పలికెను. పిదప ఉదయనుఁడు 'నీయభి
ప్రాయ మేమో చెప్పు' మని వసంతకు నడుగఁగా, నతఁడు
'పూజ్యురాలగు వాసవదత్తాదేవిపై నాకిష్టమే; కోపమున్ననేమో
యెఱుఁగని పద్మావతీదేవి చాల అందకత్తె; యువతీరత్నము;
మధురవాణి; దయారాశి; అన్నింటికన్న విశేషమేమన పద్మావతీ
దేవి నే నెక్కడనున్నను వెదకించి, పిలిపించి, నాకు భోజనము
పెట్టించుచుండెడిది.' అని చెప్పఁగా, ఉదయనుఁడు 'ఉండు
ముండుము; ఇది యంతయు వాసవదత్తకుఁ దెల్పి నీపని పట్టించె
దను' అని వాడుకచొప్పున పరధ్యానముగాఁ బల్కఁగా, వసం
తకుఁడు 'వాసవదత్తాదేవి చాలకాలముక్రిందటనే పోయినది
గదయ్యా! ఇంకెక్కడివాసవదత్త!' అనిపల్కి ఉదయనునకు
ఎక్కువసంతాపమును గల్గించెను. 'వసంతకుఁడు మనస్సు కలఁ
చినాఁ' డని పద్మావతి విచారించెను; తనపయి భర్తగారికిఁ గల
ప్రేమ వ్యక్తమైనందుకు వాసవదత్త మిగుల సంతసించెను.
ఉదయనుఁడు వాసవదత్తను దలఁచుకొని, వాపోవుచు కన్నుల
నీరు కార్చుచుండఁగా, వసంతకుఁ డాతని నూఱడించి ముఖము
కడుగుకొనుటకు నీళ్లు తెచ్చుటకయి వెడలెను. అప్పుడు వాసవ
దత్త భర్తగారివద్దకుఁ బొమ్మని పద్మావతితోఁ జెప్పి తాను వెడలి
పోయెను. పద్మావతి తామరాకుదొన్నెలతో నీరు తెచ్చుచున్న
వసంతకుని దారిలోఁ గలిసికొని 'ఇదియేమి?' అని యడుగఁగా
'మఱేమియులేదు; గాలి కెగిరివచ్చిన రెల్లుపుప్పొడి రాజుగారి

కన్నులలోఁ బడినందున, అతని ముఖము కన్నీటిచేఁ దడిసినది; దానిం గడిగికొనుటకయి జలము తెచ్చుచున్నాను; ఈనీటిని నీవే తీసికొనిపోయి యిమ్ము' అని పలుకఁగా, ఆమె వసంతకుని దాక్షిణ్యభావమునకు సంతసించి, యానీటిపాత్రను తీసికొని భర్తగారికిచ్చెను. ఉదయనుఁడును వసంతకుని యుక్తిని గ్రహించి తనకన్నులలోఁ బుప్పొడిపడినదని పద్మావతికిఁ దెల్పుచు ముఖము కడిగికొనెను. క్రొత్తపెండ్లికూఁతురు నిజము వినిన దుఃఖము వచ్చునని తలఁచి యుదయనుఁడు యథార్థస్థితిని బయలుపఱుప లేదు. అప్పుడు వసంతకుఁడు 'మిత్రమా! మధ్యాహ్నమైనది: మగధమహారాజు నీతోఁగూడికొని, మిత్రులకు దర్శన మిచ్చుసమయ మిది.' అని తెల్పఁగా, రాజును అక్కడికిఁబోవు టకు లేచెను. తక్కినవారును తమతమనివాసముల కరిగిరి.

తరువాత నొకనాఁడు పద్మినికయను పద్మావతీదేవి చెలికత్తె మధురికయను వేఱొకచెలికత్తెను బిలిచి 'పద్మావతీదేవి తలనొప్పిచే బాధపడుచు కోటలోని 'సముద్రగృహము' నందు పండుకొని యున్నది. నీ వీసంగతిని పూజ్యురాలగు నావంతికకుఁదెల్పి యామె వచ్చుటకిఁ బంపుము. ఉదయనమహారాజుల కీవిషయ మును దెలియఁజేయుటకు నేనును ఆర్యవసంతకుని వెదుకఁ బోయెదను' అని పలుకఁగా మధురిక 'ఆవంతిక యేమిచేయఁ గలదు?' అని యడుగఁగా 'వినోదములైనకథలను చెప్పి శీర్ష వేదనను బోఁగొట్టఁగలదు; త్వరగాఁ బొమ్ము' అని పంపి తాను వసంతకునిఁ గలిసికొని యతని కీవృత్తాంతమును దెల్పి తాను తలనొప్పిమందును తెచ్చుటకుఁ బోయెను.

వత్సరాజు విదూషకునివలనఁ బద్మావతీదేవికిఁదలనొప్పిగా నున్నదని తెలిసికొని విచారముతో నామెయున్న 'సముద్ర గృహము'నకుఁ బోయెను. కాని వీరు వెళ్లునరి కచ్చట నెవ్వరును లేకుండిరి. అప్పుడు వసంతకుఁడు 'వయస్యా! పద్మావతీ దేవి యిచ్చటికి వచ్చి మఱల వెళ్లిపోయియుండును.' అని పలుకఁగా ఉదయనుఁడు 'ఆమె యిచ్చటికి రాలేదనియే తలఁచెదను. ఏలయన పఱచినపడక పఱచినట్లే యున్నది; దుప్పటి ముడుతలు పడలేదు; తలనొప్పిమందుల డాగులయిన లేవు; రోగులమనస్సును బాధనుండి వేఱొకలక్ష్యముపయిఁ ద్రిప్పుటకు ఇచ్చటఁ జిత్ర పటములు మున్నగునవయినను లేవు; కావున ఆమె యిచ్చటికి వచ్చియుండలేదనియే నానమ్మకము' అని చెప్పెను. అంత వసంతకుఁడు 'అట్లయిన నామె వచ్చువఱకు నిందే వేచి యుండుము.' అని చెప్పెను. ఉదయనుఁడు 'అట్లే' యని యాశయ్యపయిఁ బరుండి నిద్రరాఁగా 'మిత్రమా! నాకు నిద్ర వచ్చుచున్నది; ఏదయిన కథ చెప్పుము.' అని యడుగఁగా, వసంతకుఁడు 'అనఁగ ననఁగా ఉజ్జయినియను నొకపట్టణమున్నది; అందు మంచిమంచి స్నానతీర్థము లున్నవి.' అని ప్రారంభింపఁగా ఉదయనుఁడు 'దొరకకదొరకక నీ కుజ్జయినియే దొఱకినదా?' అని పలుకఁగా విదూషకుఁడు 'నీ కిది యిష్టము కానిచో వేఱొకటి చెప్పెదను లెమ్ము' అని పలుకఁగా ఉదయనుఁడు 'నాకిష్టము లేక కాదు; కాని యుజ్జయినిని దలఁచినంతనే యామెఁ డుజ్జయినినుండి కౌశాంబికివచ్చుచున్నపుడు వాసవదత్త స్వజనమును విడిచివచ్చుటవలనఁ గల్గుదుఃఖముచేఁ గన్నుల నీరు విడుచుటయు, ఆమెకు నేను వీణనేర్పుసమయమున, ఆమె నన్ను

జూచుచుఁ బరవశయయి, సారెలనువిడిచి వట్టియాకాశమున నే మీఁటుటయు తలఁపునకువచ్చి, మిక్కిలి దుఃఖమును గలిగించు చున్నవి.' అని పలికెను. వసంతకుఁడు 'పోనిమ్ము; మఱియొక కథను చెప్పెదను, వినుము. బ్రహ్మదత్తమను నగరమును కాంపిల్యుఁ డనురాజు పాలించుచుండెను' అని మొదలిడఁగా వత్సరాజు 'ఓయీ! కథను తలక్రిందుగఁ జెప్పుచున్నావు; రాజు బ్రహ్మదత్తుఁడు; నగరము కాంపిల్యము' అని సరిదిద్దగా, మందుఁడగు విదూషకుఁ డారీతిని వ్రాలెవేసికొని, తగువాతఁ గథచెప్పఁ బ్రారంభించుసరికి రాజు నిద్రపోయెను. చలిగా నుండుటచే విదూషకుఁడు శాలువఁ దెచ్చుకొనుటకయి పోయెను.

అంత మధురిక యవంతిక నచ్చటికిఁ దీసికొనివచ్చి విడిచి తాను తలనొప్పిమందు తెచ్చుటకై వెడలిపోయెను. తాను అప్పు డవంతిక 'అయ్యో! దైవ మెంత ప్రతికూలమైనది! నావియో గమువలన దుఃఖించుభర్తగారికి కొంతయునో విశ్రాంతి నొసంగి యీపద్మావతి సుఖపెట్టు ననుకొనుచుండ నీమెయుఁగూడ నస్వస్థురాలయినది; ఇచ్చట నొక్కతెయయి, నిస్సహాయముగ నున్నదేమి? పరిజన మెవ్వరును లేరేమి? ఈమెకు నిద్రపట్టినట్లు న్నది. నే నీమెప్రక్కనే కూరుచుండెదనుగాక!' అని యను కొనుచుఁ గూరుచుండెను. అట్లు కూర్చుండి 'ఈమె శ్వాసము సమముగా నున్నది; తలనొప్పి తగ్గియుండవచ్చును; ఈమె ప్రక్కకొత్తిగిలి పండుకొనియుండుటచే మిగిలినభాగమున నేను బండుకొనవలెనని యీమె తలంపై యుండ వలెను.' అని మెల్లగ నాపడకపయిఁ బరుండెను. అంత నుదయ

నుఁడు నిద్రలో 'హా! వాసవదత్తా!' అని పలవరించుటచే వాసవదత్త యులికిపడి లేచి, ఆపరున్నది యుదయనుఁడని తెలిసికొని 'ఎంత ప్రమాదము! భర్తగారిపుడు నన్ను చూచినచో యౌగంధరాయణుని యత్నములన్నియు నిష్ఫలములయి యుండెడివికదా!' అని విచారించి అతఁడింకను గలవరించుచునే యుండుటచే గాఢనిద్రలో నున్నాఁడని ధైర్యము తెచ్చుకొని కొంచెముసేపచ్చటనేయుండి, అతనిని గన్నారఁగాంచి పడకపయినుండి క్రిందికి వ్రేలాడుచున్న యాతనిహస్తమును పడకపై సమముగా నుంచి అటనుండి వేగముగాఁ బోయెను.

అంత రాజు దిగ్గున లేచి 'వాసవదత్తా! ఉండుముండు' మని వేగముగా రాఁగా, తొందరలో ద్వారముతగిలి బొప్పికట్టఁగాఁ దెలివితెచ్చుకొని వెనుకకుఁబోయి శయ్యపైఁ గూర్చుండి 'ఇది స్వప్నమా? లేక నిజమేనా?' అని యాలోచించుచుండఁగా వసంతకుఁడు శాలువ తెచ్చుకొనివచ్చి 'నిద్ర లేచితివా?' అని యడుగఁగా, రాజు 'నీకొకమంచిమాట చెప్పెదను; వాసవదత్త బ్రతికియున్న' దనెను. 'ఇది భ్రాంతి' అని విదూషకుఁ డనఁగా 'కాదు; నిజముగా బ్రతికియున్నది; మంచమునుండి క్రిందికివ్రేలాడు నాహస్తము నామెపట్టుకొని తిరిగి మంచముపై నుంచినది; ఆసుఖస్పర్శవలన నాకు రోమాంచము కల్గినది. ఆమె మరణించినదని చెప్పి రుమణ్వంతుఁడు నన్ను మోసగించెను.' అని పలుకఁగా; విదూషకుఁడు అతని నూరడించి ప్రాసాదములోనికిఁ దీసికొనిపోవనుండెను.

అప్పు డొకకంచుకివచ్చి, యుదయనునితో 'మహారాజా! మాదర్శకమహారాజుగారు మీతో నిట్లు మనవిచేయమన్నారు.

ఏమన. 'మీ యమాత్యుఁడగు రుమణ్వంతుఁడు ససైన్యముగ నిటకువచ్చిరి; మీసైన్యములు సిద్ధముగ నున్నవి. శత్రువులలో మిత్రభేదము కల్పింపఁబడినది. శత్రువగు ఆరుణిని ఓడింప సేనలు గంగానదిని దాఁటివెళ్లినవి. మీరును యుద్ధసన్నద్ధులు కండు.' అని విన్నవింపఁగా నుదయనుఁడు నుత్సాహముతో బయలుదేరెను.

దర్శకమహారాజు సేనలసాయమునను, రుమణ్వంతుని ధైర్యసాహసములవలనను, స్వయముగఁ బ్రతాపమునఁ జూపియు నుదయనుఁడు శత్రువగు నారుణి నోడించి పోయినరాజ్యమును సంపాదించి కౌశాంబీనగరమున పద్మావతితో సుఖముగా నుండు నపు డొకనాఁడు ఉజ్జయినీనగరమునుండి అంగారవతీ ప్రద్యోతులచేఁ బంపఁబడిన వసుంధర యను దాదియు, రైభ్యుఁడను కంచుకియు నుదయనునిఁ జూడవచ్చిరి. వారు వచ్చిన సంగతిని మహారాజునకుఁ దెలుపవలె నని కంచుకి యొకప్రతీహారిని గోరఁగా, ఆమె 'ఇది సమయము కాదు' అనుచు నిట్లు చెప్పెను. 'రాజుగారు దేవితో నంతఃపురమున మీఁదియంతస్తునందుండఁగా క్రింద నెవఁడో వీణను వాయించెను; ఆధ్వని ఘోషవతీ నాదమువలె నున్న దని క్రిందికి వచ్చి చూచి యది ఘోషవతి యగుటఁ దెలిసికొని 'ఇది నీకెక్కడి? దని దానిని మీటినవాని నడుగ నతఁడు 'దేవా! ఇది నిర్మదానదీతీరమున నాకు దొరికినది; కావలసిచోఁ బ్రభువులు తీసికొనవచ్చును' అని యీయఁగా మహారాజుగారు దానిని చక్కఁజేయ శిల్పులకడ కంపి, ఘోషవతి లభించినదిగాని; ప్రియురాలు కానరాలేదని దుఃఖమున నున్నారు. ఇది సమయము కాదు.' అని. అప్పుడు కంచుకి

'వీరి రాకయు, బాహ్యక మంఖించినదే.' అనిచెప్పఁగా ప్రతీహారి వారి రాకను, రాజు బయటికి రావేగమే తెలిపెను. ఉదయనుఁడు పద్మావతితోఁగూడ వారికి వచ్చువమరాయఁదలఁచెను. పద్మావతీదేవి యట్టిసమయమున భర్తచెంతనుండుటకు సంకోచించియు భర్త గారికోరిక ననుసరించి యంగీకరించెను.

రాజానుమతిని వసుంధరారైభ్యులు లోనికి వచ్చిరి. ఉదయనుఁడు, నష్టమయినరాజ్యమును తిరిగి సంపాదించినందులకు సంతసమును, తమ రాజకుమారికవాసవదత్త మరణించినందులకు దుఃఖమును రైభ్యునకొక్కసారియే కలిగినవి. ఇట్టిసమయమున నామె జీవించియే యున్నచో నెంతబాగుగ నుండెడిది!' అని యనుకొనుచునే ఆతఁడు 'జయము, జయము, మహారాజా!' అని పలుకఁగా, ఉదయనుఁడు 'రాజాధిరాజగు మహాసేనునకు క్షేమమా?' అని యడిగి, అందు కతఁడు 'క్షేమమే!' యని చెప్పఁగా 'ఆమహారాజు నాజ్ఞయేమి?' అని యుదయనుఁడు ప్రశ్నించెను. కంచుకి 'శత్రువులపహరించిన రాజ్యము నదృష్టవశమునఁ బొందినందులకుఁ మిగుల సంతసించుచున్నాము; రాజ్యలక్ష్మి యుత్సాహయుతులసొమ్ము; మీధైర్యోత్సాహములు ప్రశంసనీయములు' అని సందేశ మంపె' నని చెప్పఁగా, ఉదయనుఁడు వినయముతో 'ఇది యంతయుఁ బ్రద్యోతుని ప్రభావము; నన్నాతఁడు కన్నబిడ్డవలెఁ జూచికొనెను. ఆతని పుత్రిక నపహరించి తెచ్చి, రక్షింపలేకపోయినను, నాపై నాయనకుఁ గినుకలేదు.'అని ప్రద్యోతునిఁ బ్రశంసించెను. అంత వసుంధర ఉదయనునికుశల మడిగి, పిదప 'మా దేవిగారి సందేశమిది. 'కుమారా! మాకు గోపాలపాలకు లెట్లో నీవు నట్లే.

అల్లునిగాఁ గోరియే నిన్ను ఉజ్జయినికిఁ దెచ్చితిమి. నీవు బాల్య చాపలమునఁ బరిణయోత్సవమునకు ముందే మాపుత్రికను దీసి కొనిపోతివి. పిదప మీచిత్రములకుఁ బెండ్లి గావించితిమి; మా దురదృష్టవశమున మాసుత మరణించినది; ఆమె చిత్ర పటమును బంపితిని; దానిం జూచియైన నానందింపుము' అని చెప్పినది,' అని విన్నవించి వాసవదత్తాచిత్రము నొసఁగెను. ఉద యనుఁడు దానింజూచి మిగుల విచారింపఁగా రైభ్యుఁడు 'కాల మాసన్నమైన వారిని రక్షింప నెరితరము? విచారమును దిగ మ్రింగు' మని బోధింపఁగా రాజు దుఃఖము దిగమ్రింగెను. పద్మావతి వాసవదత్తచిత్రముం గాంచి 'యీయామె యవంతికంబోలి యున్న' దని యనుకొని 'ఆర్యపుత్రా! ఈచిత్రము సరిగా వాస వదత్తాదేవిని బోలియున్నదా?' అని యని యడుగ నుదయ నుఁడు 'అవు' ననెను. అప్పు డామె సంతోషముతో 'ఈప్రతి కృతిని బోలినరూపముగల స్త్రీ యిచ్చట నున్నది. నేను కన్యనై యుండినపు డొకబ్రాహ్మణుఁడు ప్రోషితభర్తృకయగు తనసోద రిని నాయొద్ద న్యాసముగా నుంచెను.' అని పలుకఁగా రాజు సంశయావస్థలోఁ బడెను. అంతలో బ్రతీహారివచ్చి 'దేవా! ఉజ్జయినీనివాసియగు బ్రాహ్మణుఁ డొకఁడు తా నిది వఱకు దేవిగారియొద్ద నుంచిన తనసోదరుని దీసి కొనివెళ్లుటకు వచ్చియున్నాఁడు' అని విన్నవింపఁగా 'ఆ బ్రాహ్మణుఁడేవచ్చెను కాఁబోలు' నని దేవి పలుకఁగా అతనిం దీసికొనిరమ్మని రాజు ప్రతీహారి కాజ్ఞయిచ్చెను. అవంతికను దీసి కొనివచ్చుటకుఁ బద్మావతియు వెడలెను. అప్పుడు యౌగంధ రాయణుఁడు తనలో 'ప్రభువు మేలుకొఱకుఁ బట్టమహిషిని దాఁచి

తలఁచుకొన్న పనుల నెఱవేర్చితిని. కాని నా చేతల కాయన యేమనునో యని చిత్తము తత్తఱిల్లుచున్న' దని యనుకొనుచు, జంకుచువచ్చి రాజుం గాంచి 'జయము, జయము, మహారాజా!' అని పలికెను. అతని కంఠస్వరము తనకుఁ బరిచితమైనదే యని రాజు తలఁచెను. పద్మావతి 'నీయన్నగారు వచ్చినా' రని చెప్పి యవంతికను దీసికొనివచ్చి ఆసంగతిని రాజునకు విన్నవింపఁగా నుదయనుఁడు 'సరే! వసుంధరారైభ్యులు సాక్షులుగా ఆతనికి నర్పింపుము' అని పలికెను. వసుంధర యవంతికం జూచి 'ఈమె మా రాజపుత్రి' అని యఱచెను. ఉదయనుఁ డామాట కాశ్చర్యపడి 'ఏమీ! వాసవదత్తయే! అట్లయిన, దేవీ! పద్మావతితోఁ గూడ. నంతఃపురమున కేఁగు' మనఁగా యౌగంధరాయణుఁడు 'ఈమె నాసోదరిగదా! వినీతుఁడవు, జ్ఞానివి, శుచివి, ఉత్తము భరతవంశీయుఁడవునగు నీవు నా సోదరి నపహరించఁదగ' దని పల్కఁగా రాజు తెర తొలఁగించినచో పరీక్షించెద' ననఁగా పద్మావతి తెరతొలఁగించెను. అప్పుడు యౌగంధరాయణ వాసవదత్త లిరువురు నొక్కసారిగా జయజయధ్వను లొనర్చిరి. రాజేమియుఁ దోఁచక యాశ్చర్యమున మునిఁగియుండఁగా యౌగంధరాయణుఁడు వాసవదత్తను దాఁచిన వృత్తాంతమును దెల్పి రాజుకాళ్లపైఁబడి తన్ను క్షమింపఁ బ్రార్థించెను. ఉదయనుఁడు సంతోషముతో నతని ప్రభుభక్తిని మిగులఁ బ్రశంసించెను. పద్మావతి వాసవదత్తకు మ్రొక్కి 'అమ్మా! నిన్ను చెలికత్తెగాఁ జూచి అపచారమొనర్చినందులకు మన్నింపు' మని వేఁడుకొనెను. 'అది నాతప్పు గాని, నీదికా' దని వాసవదత్త యామెను బుజ్జగించెను.

వత్సరాజు 'దేవిని దాఁచుటలో నీయభిప్రాయ మేమి?' అని యడుగఁగా, యౌగంధరాయణుఁడు 'పుష్పకభద్రాదులగు దైవజ్ఞులు పద్మావతీదేవి తమకు దేవి కాఁగలదనియు, దర్శకుని బంధుత్వమువలన శత్రువిజయము కల్గఁగలదనియుఁ జెప్పిరి. ఈయంశము స్వామిహితమును గోరువారందఱు నెఱుఁగుదురు' అని తెల్పెను. దానికి రా జాశ్చర్యపడెను. పిదప 'ఈశుభవార్తను దెల్ప వసుంధరారైభ్యుల నుజ్జయినికిఁ బంపవలె' నని మంత్రి కోరఁగా ఉదయనుఁడు 'అట్లుకాదు; దేవిని, పద్మావతిని దీసికొని మనమే యచటికిఁ బోవుదము' అని చెప్పెను. పిదప వారందఱు నుజ్జయిని కేఁగి అంగారవతీ, ప్రద్యోతులకు మిగుల నానందము కల్గించి, కొన్నిదినము లటనుండి కౌశాంబికి మఱల వచ్చిరి. ఉదయనుఁడు ప్రజలను లెస్సఁగాఁ బాలించుచు, తన యిర్వురు భార్యలతోను సుఖముగ నుండెను.



# మృచ్ఛకటికము

## పీఠిక

'మృచ్ఛకటికము' అనునీనాటకమును సంస్కృతమున శూద్రకుఁ డనుమహాకవి రచియించెను. ఇయ్యది కాళిదాసమహాకవికిఁ బూర్వము వ్రాయఁబడినట్లు చెప్పుదురు. ఆ కాలపు జనుల జీవితమును, ప్రజాపరిపాలనపద్ధతిని దెలిసికొనుట కియ్యది మిక్కిలి యుపయోగించును. ఈనాటకమునందలి యాఱవయంకమున కథానాయకుఁడగు చారుదత్తుని పుత్త్రుఁడగు రోహసేనుని మట్టిబండి (మృచ్ఛకటిక) ప్రవేశపెట్టఁబడినది. అయ్యది ముందుకథను, వెనుకకథను గలుపుచున్నది; మఱియుఁ జారుదత్తుఁడు వసంతసేనను జంపెనని నిరూపించి కథనడుపుట కదియే యాధారమగుటచే దానిననుసరించి యీనాటకమునకు 'మృచ్ఛకటిక' యనుపేరు వచ్చినది.

ఉత్తములు నడుమ నెన్నికష్టముల నొందినను గట్టెక్కుదురనియు వారు తమశత్త్రువులకును ఉపకారమే యొనర్తురుగాని యపకారము తలపెట్టరనియు, ప్రజల కిష్టుఁడు కాని రాజు రాజ్యభ్రష్టుఁడగుననియు నిట్టి నీతు లనేకము లిదృశ్యమువలన గ్రాహ్యము లగుచున్నవి. ఆయాకళలకౌశల మిందుఁ జక్కగఁ జూపఁబడినది.

# పాత్రములు

## పురుషులు

చారుదత్తుఁడు—సార్థవాహుఁడు ; కథానాయకుఁడు
రోహసేనుఁడు—చారుదత్తుని పుత్త్రుఁడు
మైత్రేయుఁడు—చారుదత్తుని మిత్త్రుఁడు.
వర్ధమానుఁడు—చారుదత్తుని సేవకుఁడు
శకారుఁడు (సంస్థానకుఁడు)—రాజుగారి బావమఱఁది
పాలకుఁడు—ఉజ్జయిని రాజు
విటుఁడు—శకారుని సహచరుఁడు
స్థావరకుఁడు—శకారుని సేవకుఁడు
ఆర్యకుఁడు—గొల్లపిల్లవాఁడు; ప్రజలచే ఉజ్జయినికి నిర్ణయింపఁబడిన రాజు
శర్విలకుఁడు—మదనికను మోహించిన బ్రాహ్మణవిటుఁడు
సంవాహకుఁడు—తొలుత చారుదత్తుని పాదసంవాహకుఁడు; బౌద్ధభిక్షువుగా మాఱినవాఁడు.
మాథురుఁడు—జూదగాండ్ర పెద్ద.
దర్దురకుఁడు—
ద్యూతకారుఁడు— } జూదగాండ్రు
కర్ణపూరకుఁడు—వసంతసేన సేవకుఁడు
అధికరణికుఁడు—న్యాయాధిపతి
శ్రేష్ఠి—న్యాయవాది.

ధనదత్తుఁడు—కాయస్థుఁడు; లేఖకుఁడు.
చందనకుఁడు—రక్షకభటాధికారి
వీరకుఁడు—నగరము కావలిపెద్ద
విటుఁడు—వసంతసేన సహచరుఁడు
కుంభీలకుఁడు—వసంతసేనసేవకుఁడు
శోధనకుఁడు—న్యాయస్థానమునందలి భృత్యుఁడు.
రేభిలుఁడు—ఒకగాయకుఁడు

మఱియు కొందఱుసేవకులు, ప్రయాణికులు, న్యాయస్థానమందలి యుద్యోగులు మున్నగువారు వత్తురు.

స్త్రీలు.

వసంతసేన—వేశ్య; కథానాయిక
ధూతాంబ—చారుదత్తుని భార్య
వృద్ధ—వేశ్యమాత; వసంతసేనతల్లి
మదనిక—వసంతసేన చెలికత్తె; శర్విలకుని ప్రేయసి.
రదనిక—చారుదత్తునింట పరిచారిక.

---

# మృచ్ఛకటికము

తొల్లి యుజ్జయినీనగరమున సాగరదత్తుఁడను బ్రాహ్మణ వర్తకుఁడు నివసించి లెక్కలేనిధనము నార్జించెను; అతనిపుత్త్రుఁడగు చారుదత్తుఁడు త్యాగశీలుఁడగుటచే ఆధనమునంతటిని దానముచేసి తుదకు రిక్తుఁడయ్యెను. అతఁడు దరిద్రుఁడయ్యెను, అతనియుత్తమగుణములనుబట్టి ప్రజ లాతనిని మిగుల గౌరవించుచుండిరి. లేనియెడ నితరులు తన్ను వీడినను భార్యాపుత్త్రులును, మిత్త్రుఁడగు మైత్రేయుఁడును, సేవకుఁడు వర్ధమానుఁడును, పనికత్తె రదనికయు విడువకయుండిరి. ధనికురాలును, ఆయూరివేశ్యలలో నందకత్తెయు, నుత్తమశీలయు నగు వసంతసేన చారుదత్తునియందు బద్ధానురాగయై యుండెను.

ఒకనాఁటిసాయంకాలము చారుదత్తుఁడు పూజావిధిని నిర్వర్తించి బల్యన్నము వేయబోవుసమయమున నతనిమిత్త్రుఁడు మైత్రేయుఁడువచ్చి 'మీరు దేవపూజజరిపినయనంతరము మీకీయవలెనని మిత్త్రుఁడగు జూర్ణవృద్ధుఁడు జాజిపూవులవాసనగల యీయుత్తరీయము నీయవలెనని కోరినాఁ' డని యందీయఁగా చారుదత్తుఁడు తన దారిద్ర్యమునకు మిగుల వగచెను. అట్లు వగచియు ధైర్యముతో 'మిత్త్రమా! ఈబల్యన్నమును వీథిలో మాతృదేవతలకుఁ జల్లి రమ్ము' అనిచెప్పగా మైత్రేయుఁడు, రదనిక దీపముపట్టుకొని దారిఁజూపుచుండఁగా వీథిలోనికి వచ్చుచుండెను.

ఆసమయమునఁ జీకటిలో నలంకారభూషితయగు వసంతసేన తనయింటికిఁ బోవుచుండఁగా, రాజస్యాలుఁడగు శకారుఁడు విటచేటులతోఁ గూడ నామె వెంటఁబడెను. మూర్ఖుఁడగు శకారుఁడు, తన్ను నందకత్తెయగు వసంతసేన ప్రేమింపక, చారుదత్తునే ప్రేమించుచున్నదని కినిసి బలాత్కారముగనైన నామెను లోఁగదీసికొనఁ బలుప్రయత్నములు చేయుచుండెను; తాను రాజస్యాలుఁడననియు, తనయాజ్ఞ కడ్డులేదనియు నతని తలంపు; అసమర్థుఁడగురాజు పాలకుఁడును శకారుని చేష్టలకు అతనిని మందలింపకుండెను. ఈసమయమున వసంతసేన యొంటరిగ దొరకినందున శకారుఁ డామెను వెంబడించి, బ్రతిమాలుచుండెను. మఱియు నామూర్ఖుఁ డప్పుడు విటునితో 'ఈదాని రాజుగారిబావమఱదినగు నన్నుఁ గాదని దరిద్రచారుదత్తుని మోహించినది; వానిల్లీ యొడమ చేతివైపునఁ గలదు; అక్కడికి ఇది పోకుండ జాగ్రత్తగా చూడుము' అని పలుకఁగా ఆమాటలువిని వసంతసేన సంతసించి ఆవైపు వెళ్లుచుండఁగా, దీపము తెచ్చుచున్నరదనిక ఆవెంట మైత్రేయుఁడు కనఁబడిరి. వసంతసేన తనచీరచెఱఁగుతో దీపము నార్పివేసి వేగముగా చారుదత్తునింటిలోనికిఁ బోయెను. దానిని గమనించక మైత్రేయుఁడు గాలిచే దీపమారిపోయినదని తలఁచి, రదనికతోఁ 'నడువు' మని చెప్పి తాను దీపమును వెలిగించితెచ్చుట కింటిలోనికిఁ బోయెను. వీథిలోనికివచ్చిన రదనిక, వసంతసేనయే యని తలఁచి శకారుఁ డామె కొప్పుపట్టుకొని 'వసంతసేన చేజిక్కినా' దని యఱచెను. ఇంతలో దీపముపట్టుకొనివచ్చిన మైత్రేయుఁ డిదిచూచి మిగులఁ గోపించి 'చారుదత్తుఁ డిప్పుడు దరిద్రుఁడై

నంతమాత్రమున అతనిపరిజనము నిట్లవమానింపఁజెల్లునా?' యని యఱచెను; విటుఁడు తాము తెలియకయొనర్చినతప్పును మన్నింపవలెనని మైత్రేయునిఁ బ్రార్థించెను. శకారుఁడు రదనికను విడిచి 'ఓయీ! నామాటగా నీమిత్రునితో నిట్లు చెప్పుము—'మేము కోరినవసంతసేన నీయింట దూరినది; దానిని నీవు స్వయముగా మామేడకుఁ దీసికొనివచ్చి మాకప్పగింపవలెను. లేనిచో మనకు వైరమేర్పడును; ఆమీఁద నాశక్తి చూడఁగలవు' అని మైత్రేయునితోఁ బలికెను.

పూజనుండి లేచిన చారుదత్తుఁడు చీకటిలో వసంతసేనం జూచి రదనికయనుకొని 'రదనికా! రోహసేనుఁడు చలిగాలిలో నున్నాఁడు; వానికి ఈయుత్తరీయమునుగప్పి, లోనికిఁ దీసికొని రమ్ము' అని యుత్తరీయము నందించెను. ఆమె యేమిచేయుటకును తోఁచక యట్లే నిలిచియుండఁగా, 'దారిద్ర్యముకతమునఁ బరిచారకులును మాట విన'రని యనుకొనుచుండెను. అపుడు మైత్రేయుఁడు రదనికతో నామెభంగపాటును చారుదత్తున కెఱిఁగించి యతనిమనస్సును మఱియుఁ గలఁతపెట్టవలదనిచెప్పి, ఆమెతోఁగూడ లోనికివచ్చి చారుదత్తునితో శకారుఁడు చెప్పఁగోరినమాటలను చెప్పెను. చారుదత్తుఁడు తానింతకుమున్ను చూచినయామె వసంతసేన యని తెలిసికొని తానామెను పరిజనమనుభ్రాంతితో నవమానించినందుకు క్షమింపఁగోరెను. వసంతసేన 'నన్ను పరిజనముగాఁ జూచుట నాభాగ్య'మని చెప్పుచు, శకారాదులు తన్ను వెంబడించుటకుఁ దాను ధరించిన నగలే కారణమనిచెప్పి వానిని దాఁచవలెనని చారుదత్తునిగోరెను. అతఁడందుల కంగీకరించి వసంతసేనను భద్ర

ముగా నామెయింట దిగవిడిచివచ్చి వసంతసేన యాభరణములఁ గాపాడుటకయి పగటిపూట వర్ధమానుని రాత్రిపూట మైత్రేయుని నియమించెను.

చారుదత్తుఁడు సంపన్నుఁడై యుండినపు డతని పాద సంవాహనముచేసి జీవించు సంవాహకుఁ డనువాఁడు జీవికకొఱకు పెక్కుగతులఁ దిరుగుచు, తుదకు జూదగాఁడై జూదగాండ్ర పెద్దయగు మాథురునకుఁ బదిసువర్ణములు ఋణపడెను. ఆసొమ్మీయవలయునని మాథురుఁడు సంవాహకుని నిర్బంధించుచుండఁగా సంవాహకుఁడు పాఱిపోయి, కొంతదూర మరిగిన పిదప, వెనుక కడుగులిడుచు నొక పాడుదేవాలయములోఁ బ్రవేశించి, విగ్రహముండవలసిన పీఠముపై కదలక మెదలక తానొక విగ్రహమువలెఁ గూర్చుండెను. అడుగులజాడను బట్టి మాథురుఁడును, ద్యూతకారుఁడును గొంతదూరమువచ్చి పిదప వెనుకకునడచినట్లును తెలిసికొని యాదేవాలయమును బ్రవేశించిరి. కాని చీకటిలో పీఠముపైనున్నది విగ్రహమో లేక మనుష్యుఁడో తెలిసికొనఁజాలకపోయిరి. అందుపయి అచ్చటనే పాచికలుపఱచి వారిరువురును జూదమాడుటకు మొదలిడిరి. సంవాహకుని దెలిసికొనుట కిదియే మేలైన యుపాయమని వారితలంపు. వారు కొంతసేపు జూదమాడి 'పందెము నాది; పందెము నాది' అని వాదులాడుచుండఁగా సంవాహకుఁ డుండఁబట్టఁజాలక 'మీయిరువురిదియుఁ గాదు; పందెము నాది' అని లేచివచ్చెను. అప్పుడు వా రతనిఁబట్టుకొని సొమ్మీయవలయునని నిర్బంధించి బాధించుచుండఁగా దర్దురకుఁ డనుజూదగాఁ డొకండువచ్చి ఉపాయమున సంవాహకునిఁ

దప్పించెను. సంవాహకుఁడు పాఱిపోయి, తలుపులు తెఱచి యున్న వసంతసేనయింటిలోఁ బ్రవేశించి యామెను శరణు జొచ్చెను. ఆమె అతనిని పూర్వము చారుదత్తుని సేవకుఁడని తెలిసికొని, మిగుల గౌరవించెను. ఇంతలో మాథురద్యూతకారు లచటికి రాఁగా ఆమె సంవాహకుఁ డీయవలసినధనమునిచ్చి, అతనిని ఋణవిముక్తునిజేసెను. సంవాహకుఁడు వసంతసేనకుఁ దనకృతజ్ఞతను దెలిపి, ద్యూతమువలని కష్టములను దెలిసికొని పశ్చాత్తాపపడి బౌద్ధసన్యాసిగా మాఱి, వెళ్లుచుండఁగా ఖుంటమోదకమను వసంతసేన యేనుఁగొకటి కట్లుత్రెంచుకొని పాఱిపోవుచు నతనిని తొండముతోఁ బట్టుకొని నోటవేసికొనుటకు సిద్ధముగా నుండెను. అదిచూచి జనులందఱును 'సన్యాసి చచ్చె చచ్చె' నని యఱచిరి. అప్పుడు కర్ణపూరకుఁడను వసంతసేనసేవకుఁడు సాహసించి దుడ్డుకఱ్ఱతో నాయేనుఁగును బాది, యాసన్యాసిని విడిపించెను. అప్పు డాదారిం బోవుచున్న చారుదత్తుఁడు అదిచూచి వేఱేవియును దనయొద్ద లేనందునఁ దనపైమీఁదివస్త్రమునే కర్ణపూరకునకు బహుమానముగా నిచ్చివేసెను. కర్ణపూరకుఁడు తాను బౌద్ధసన్యాసిని కాపాడిన విషయమును వసంతసేన కెఱిఁగించి ఆసమయమున నొకపురుషుఁడు నాధైర్యసాహసములకు మెచ్చి, యీ యుత్తరీయమును బహుమానముగా నిచ్చెను; ఇయ్యది మీకెంతయుఁ దగియున్నది' అనిచెప్పి యాయుత్తరీయము నొసఁగెను. వసంతసేన దానిని గౌరవముతో గ్రహించి కర్ణపూరకునకుఁ బారితోషికము నిచ్చి పంపెను.

ఒకనాఁడు చారుదత్తుఁడు మైత్రేయునితోఁగూడ రేభిలుఁడను గాయకుని సంగీతమును వినుటకుఁబోయి చాలప్రొద్దుపోయినపిదప యింటికి వచ్చెను. అప్పటికి రాత్రి రెండుజాములయ్యెను. చారుదత్తమైత్రేయులు కాళ్లుకడిగికొని, నిద్రింపనుండఁగా వర్ధమానుఁడు మైత్రేయునికడకువచ్చి 'మైత్రేయా! సువర్ణభాండమును రాత్రి రక్షించవలసినవాఁడవు నీవు; కావున ఇదిగో! దీనిం దీసికొమ్ము' అని వసంతసేన చారుదత్తునికి దాఁచ నిచ్చిన బంగారునగ నీయఁగా మైత్రేయుఁడు దానిందీసికొని లోపలిబవంతిలోఁ బరుండెను.

అప్పుడు చంద్రుఁడ స్తమింపఁగా శర్విలకుఁడనుచోరుఁడు కన్నపుదొంగతనమునకు బయలుదేరెను; అతఁడు దీపము నార్పుపురుగులను, శరీరమునకుఁ బూసికొనుపసరుమందుగల బరిణెను సంగ్రహించి, యొకకత్తిని ధరించి, దొంగతనమునకయి చారుదత్తునిగృహమునకు వచ్చెను. వాస్తవముగ శర్విలకుఁడు చోరవృత్తిని జీవించువాఁడుకాఁడు; జన్మచే విప్రుఁడు; అతఁడు వసంతసేనదగ్గఱనున్న మదనికయనువేశ్యను ప్రేమించెను. మదనికను బోషించుటకుఁ దగినశక్తి యతనికున్నదో లేదో కనుఁగొనుటకయి వసంతసేన యతనితో 'కొంతసొమ్మిచ్చి యీమెను విడిపించుకొని తీసికొనిపొమ్ము' అని చెప్పుటచే, ధనసంపాదనమునకయి మార్గాంతరముతోఁచక తనకుఁదెలిసిన చౌర్యకళ నుపయోగించి ధనము సంపాదింప నెంచి ధనికులగు వర్తకులుండు శ్రేష్ఠిచత్వరమునకువచ్చి అన్నివిధముల అనుకూలముగ నున్నదని తనకుఁ దోఁచుటచేఁ జారుదత్తునింటికే కన్నము వేయఁ గడంగెను. శర్విలకుఁ డాయింటికిఁ గన్నము త్రవ్వి ఆరంధ్రము

నుండి కానవచ్చుదీపపువెలుఁగులో, లోన నిరువురుపురుషులుఁ మాత్రము పరుండినట్లు గమనించి లోపలికివచ్చి వారిం బరీక్షించి చూచి, గాఢనిద్రలో నున్నట్లు గమనించి ధైర్యము తెచ్చుకొని నలువైపులను వెదకెను; కాని యది దరిద్రుని గృహమగుటచే నేమియును లభింపకపోయెను. శర్విలకుఁడు తానుపడిన శ్రమయంతయును వ్యర్థమైనదని విచారించుచు పోవనుండఁగా, అచట నిద్రించుచున్న మైత్రేయుఁడు కన్నము పెట్టి దొంగలు గృహమునఁ బ్రవేశించినట్లు కలగని ఆస్వప్నము లోనే 'మిత్రమా! చారుదత్తా! దొంగ లింటిలోఁబడినట్లున్నారు; ఈసువర్ణభాండమును నీవే తీసికొని భద్రముచేయుము' అని పలుకుచు, తాను రాత్రి కాపాడువసంతసేననగను శర్విలకీయఁబోయెను. శర్విలకుఁడు తొలుత ఆనిద్రించువాఁడు తన్ను గనిపెట్టెనేమోయని భయపడినను, పిదప నిద్రలో నట్లను చున్నాఁడని గ్రహించి, జంకుచు నట్లే నిలిచెను. మైత్రేయుఁడు 'ఏమి యూరకయున్నావు? నీవు దీనిందీసికొననిచో నాపై నొట్టు' అని పలుకుచుఁ జేతికందింపఁగా శర్విలకుఁడు దానిం గ్రహించి, చూచి తనప్రయత్నము సఫలమేయైనదని మిగుల సంతసముతోఁబోయెను. అప్పుడు రదనిక లేచి, కన్నమును జూచి మైత్రేయునిలేపి, కన్నమునుజూపి; యింట దొంగలుపడిరని చెప్పెను. ఆతఁ డదరిపడుచు లేచి చారుదత్తుని లేపెను. చారుదత్తుఁడు లేచి, కన్నమును బరిశీలించుచు, చోరుని నేర్పున కాశ్చర్యపడి, అట్టివాఁడు తనయింటికివచ్చి యుత్తచేతులతోఁ బోయినందులకు ఖేదపడెను. అప్పుడు మైత్రేయుఁడు 'నేను నీకు సువర్ణభాండమునిచ్చి మంచిపనిచేసితిని. లేనిచో బది పోయి

యుండెడిది' అనిపలుకగా చారుదత్తుఁ డాశ్చర్యపడి, పిదప మైత్రేయునివలన వృత్తాంతమునంతటిని తెలిసికొని, సువర్ణ భాండమపహృతమయినదని యెఱింగి, చోరుఁడు తృప్తుఁడయి వెళ్లినందుకు సంతసించెను. కాని యది న్యాసమగుచున్నవగు టచే, తాను యథార్థముచెప్పినను తనలేమికతన లోకులు విశ్వ సింపరని మిగుల విచారించుచుండఁగా సతనిభార్యయగు ధూతాంబ తనరత్నావళిని, ఆయాభరణమునకు బదులుగా వసంతసేన కీయఁగోరెను. దానికిఁ జారుదత్తుఁడు సంతసించి దానిని మైత్రేయునకిచ్చి 'మిత్రమా! నీ వీరత్నావళిని వసంత సేన కొసఁగుచు, 'స్వామిత్రుఁడు జూదములోనొడ్డి నీనగను గోల్పోయెను. దానికిబదులుగా దీనిం గ్రహింపఁ బ్రార్థించు చున్నాఁడు' అనిపలుకు మని చెప్పెను. అల్పమూల్యమగు నానగ కధికమూల్యమగు రత్నావళినిచ్చుటకు మైత్రేయున కిష్టములేకున్నను చారుదత్తుని నిర్బంధమువలన అంగీకరింపక తప్పినది కాదు.

మఱునాఁడు శర్విలకుఁడు తాను దొంగిలించి తెచ్చిన నగతో వసంతసేనయింటికిఁబోయి ఏకాంతమున మదనికనుగలిసి కొని 'మదనికా! నీమీఁదియనురాగమున నేనొకసాహసమును జేయవలసివచ్చినది; సాహసమునఁగాని సంపద లభింపదుగదా! నేను కడచినరాత్రి యొకచో చౌర్యమొనర్చి యీనగను సంపాదించితిని' అని యానగను ఆమెకిచ్చెను. వీరివురు నేమిమాటలాడుదురో తెలిసికొనుటకు వసంతసేనయు నటకు మెల్లగావచ్చి పొంచియుండి వినుచుండెను. అనగనుజూచి మదనిక 'దీని నిదివఱకుఁ జూచినట్లున్నది. నీ కెక్కడలభించి

నది ?' అని యడుగఁగా నతఁడు 'సార్థవాహుఁడగు చారుదత్తు నింట' అని పలుకఁగానే 'అమ్మయ్యో! ఎంతపనిచేసితివి ? ఇది వసంతసేననగ; ఆమె దీని నతనికి దాచ నిచ్చినది; నీవు నాకొఱ కెంతపనిచేసితివి !' అని పలుకఁగా శర్విలకుఁడు మిగుల భయపడి, ఏమిచేయుటకును దోఁచక నిలిచియుండఁగా 'నీవు భయపడ నక్కఱలేదు; నామాటవిని యీనగను దీసికొనిపోయి మరలఁ జారుదత్తున కిచ్చివేయుము; అతఁడు నిన్ను కోపగింపఁడు; చాల యుత్తముఁడు' అని మదనిక పలికెను. చాటుననుండి యిది యంతయును వినుచున్న వసంతసేనయు నదియే మంచియుపాయమని తలఁచెను; శర్విలకుఁడు తానుచేసినపనికి సిగ్గుపడి చారుదత్తునియొద్దకుఁబోవుటకు మొగముచెల్లక యుపాయాంతరము నాలోచించుచుండఁగా మదనిక 'పోనిమ్ము; వేఱొకయుపాయము చెప్పెదను. నీవు మావసంతసేనమ్మగారియొద్దకువచ్చి చారుదత్తుఁడు ఈనగ నామె కిమ్మని యిచ్చినాఁడని చెప్పి యిమ్ము; అట్లుచేసినయెడల నీదొంగతనము బయలుపడదు; ఆమె నగయు నామెకుఁజేరు' నని చెప్పఁగా, దానికి శర్విలకుఁ డంగీకరించి సవినయముగ వసంతసేనయొద్దకేఁగి యానగ నిచ్చెను; ఆమె కీసమాచారమంతయు ముందే తెలిసియున్నందున సంతసముతో దానినిగ్రహించి నవ్వుచు 'అయ్యా! శర్విలకా! ఈ నగను నీకెవ్వరిచ్చెదరో వారికి మదనిక నర్పింపు మని చారుదత్తుఁడుగారు నాతోఁ జెప్పియున్నారు. కావున నీ వీమెను గ్రహింపు' మని మదనికకు బుద్ధులుచెప్పి వస్త్రాభరణములనిచ్చి యతనితోఁ బంపెను. వారిరువురును బండిలోఁ గూర్చుండి వచ్చుచుండఁగా 'సిద్ధునిమాటలను బట్టి గొల్లపిల్లవాఁడగు

నార్యకుఁ డీదేశమునకు రాజగునని తలంచి, పాలకమహారా జతనిని చెఱలోఁబెట్టించె' నని జనులాడుకొనుమాటలు వినఁ బడెను. అప్పుడు ఆర్యకునిమిత్రుఁడగు నీశర్విలకుఁడు 'నీ వీమెను రేభిలునింట విడిచిపొమ్ము; నే నార్యకుని జెఱవిడిపించుటకయి పోవలె' నని బండివానితోఁజెప్పి తాను బండిదిగి యొచటికో పోయెను. బండివాఁడును మదనికను రేభిలునియింట దిగ విడిచెను.

అంత నక్కడ మైత్రేయుండు చారుదత్తునాజ్ఞ ననుస రించి రత్నావళిని వసంతసేన కిచ్చుటకు రాగా ఆమెమిక్కిలి గౌరవముతో నతనిని దేబనిచెను. అతఁడు 'మామిత్రుఁడు మీ నగను జూదమున నోడిపోయినందున దానికి బదులుగ నీ రత్నహారమును గ్రహింపవలెనని ప్రార్థించుచున్నాఁడు' అని తెలుపుచు నాహారము నీయఁగా నామె నవ్వుచు గ్రహించి, 'నేఁటిసాయంకాలము ఆయనను జూచుటకు వచ్చుచున్నా' నని తెలుపఁగోరి యతనిం బంపెను. చారుదత్తుఁడు తనపూల తోఁటలోఁ గూరుచుండి, కురియుచున్న వర్షమును వర్ణించు చుండఁగా మైత్రేయుం డచటికివచ్చి వసంతసేన రత్నావళిని దీసికొన్నదనియు, ఆసాయంకాల మతనిని జూచుటకు వచ్చు చున్నదనియు దెల్పి యతనికి సంతోషము గలిగించెను. ఇంతలో కుంభీలకుఁడను వాఁడు వసంతసేన వచ్చుచున్నదని తెలుపఁగా చారుదత్తుఁడు తన కాశుభవార్తను దెల్పినందుల కతనికిఁ దన యుత్తరీయమును బహుమతిగా నిచ్చెను.

అంత వసంతసేనయు వచ్చి వృక్షవాటికలోఁ జారు దత్తునిఁ గలిసికొని యతనికిఁ దన నగనుజూపి 'ఇది యొక్కడిదో

తెలియునా?' అని యడిగెను. దానింజూచి చారుదత్తుఁడును, మైత్రేయుఁడును ఏమి చెప్పుటకును పాలుపోక సందిగ్ధమనస్కు లయి యుండఁగా, సమీపమునందుండిన రదనిక 'మనయింట దొంగ లపహరించిన నగ యిదియే' అని చెప్పెను. అంతఁ జారుదత్తుఁడు 'దొంగలెత్తుకొనిపోయిరని చెప్పినచో లోకము నమ్మదనునభిప్రాయమున ద్యూతమున నోడిపోయితి' నని చెప్ప వలసివచ్చె' ననిపలుకుచు పోయిననగ దొరకిన వర్తమానమును దెలిపిన రదనికకుఁ దనవ్రేలియుంగరమును బహుమానముగా నిచ్చెను. అతని యుత్తమగుణములను వసంతసేన ఎక్కువగా మెచ్చుకొనెను. ఆరాత్రి వర్షముపడుచుండుటచే వసంతసేన చారుదత్తునిగృహముననే యుండిపోయెను.

మఱునాఁడు చారుదత్తుఁడు తెపకడనే లేచి యూరి వెలుపలనున్న తనయుద్యానవనమునకు మైత్రేయునితోఁగూడఁ బోవుచు, వసంతసేనను పెట్టెబండిలోఁ గూర్చుండఁబెట్టి యచ్చటికి దీసికొని రావలెనని వర్ధమానుఁడను తనసేవకున కాజ్ఞ యిచ్చెను. వసంతసేన కొంచెము లేచి చేటికవలన చారుదత్తుని భార్యయగు ధూతాంబకుఁ దనయెడఁగల సోదరీప్రేమను దెలిసికొని సంతసించి, ఆ మెరత్నావళి నాచేటికమూలముననే ధూతాంబకుఁ బంపెను. ధూతాంబ దానిని గ్రహింపక 'నాభర్త నీకిచ్చినదానిని తిరిగి నేను గ్రహింపను; నాకు వేఱునగ యక్కఱలేదు; నాభర్తయే నాకమూల్యాలంకారము' అని బోధించి యాపగను వసంతసేనకుఁ బంపివేసెను. ఆమెశీలమునకు వసంతసేన యచ్చెరువందెను.

ఆసమయమున చారుదత్తుని పుత్త్రుఁడగు రోహసేనుఁడు తన కాడుకొనుటకయి రదనిక తెచ్చియిచ్చిన మట్టిబండిని విసిరి కొట్టుచు, పొరుగింటిపిల్లవాఁడు ఆడుకొనుచున్న బంగారుబండి వంటిదే కావలెనని యేడ్చుచు, పోరుపెట్టుచుండఁగా వాని నూరడించుటకు రదనిక వసంతసేనయొద్దకుఁ దీసికొనివచ్చెను. ఆబాలకుఁడు చారుదత్తునిపుత్త్రుఁడని తెలిసికొని వసంతసేన మిగుల సంతసించి యతనిరోదనమునకుఁ గలకారణమును రదనిక వలన వివరముగా నెఱిఁగెను. అప్పుడు రోహసేనుఁడు 'ఈమె యెవ్వరు?' అని రదనిక నడిగి, ఆమె 'ఈమె నీకుఁ దల్లి యగును' అని చెప్పఁగా, రోహసేనుఁడు 'మా అమ్మయేయైయుండిన నిన్నినగ లెక్కడనుండును?' అనిపలుకగా వసంతసేన జాలిపడి యొకనగను దీసియిచ్చుచు 'దీనితో నీవు బంగారుబండిని చేయించుకొను' మని చెప్పెను. రోహసేనుఁడు తొలుత నంగీకరింపకున్నను, నిర్బంధించి, వాని కానగ నామెయిచ్చెను. పిదప రదనిక రోహసేను నూరడించుచు నచ్చటనుండి లోనికిఁ బోయెను.

ఇంతలో వర్ధమానకుఁడు బండిని తెచ్చి దొడ్డిగుమ్మముకడ నిలిపి, 'బండివచ్చిన' దని వసంతసేనకు చేటిమూలమునఁ గబురంపఁగా, 'ఆమె యలంకరించుకొనుచున్నందున కొంచెము తాళవలె' నని యాచేటి చెప్పెను; అతఁడును బండిలో పఱుపు వేయుట మఱచినందున, అది వేసితెచ్చుటకై బండిని తీసికొని పోయెను. కొంచెమునేపటిలోనే వసంతసేన ముస్తాబుపూర్తి చేసికొని, దొడ్డిగుమ్మమువద్దకు వచ్చెను. ఆసమయమునందే శకారునిసేవకుఁడగు స్థావరకుఁడు శకారునికోఱకయి అతని

తోఁటకు బండిని తోలుకొని పోవుచుండఁగా, పల్లెటూరిబండ్లు దారికడ్డముగా నుండుటచే, అతఁడు తనబండిని చారుదత్తుని దొడ్డిగుమ్మమువద్ద నిలిపి, చక్రమూడినబండిని సరిచేయుచున్న వానికి సాహాయ్యమొనర్చుటకుఁ బోయెను; ఆసమయమునందే వసంతసేన దొడ్డిగుమ్మమువద్దకు వచ్చుట తటస్థించినందున, అదియే తానెక్కవలసినబండి యనుకొని, యందుఁ బ్రవేశించి యామె తలుపులు మూసికొనెను. కొంచెముసేపటికి స్థావరకుఁడువచ్చి యాబండిని శకారుఁడున్న తోఁటకుఁ దీసికొని పోయెను.

పాలకరాజు ఆర్యకునిఁ జెఱలోఁబెట్టినవార్తను వినిన శర్విలకుఁ డెట్లో కారాగృహమును బ్రవేశించి, అచటి యధికారిని జంపి యార్యకునిఁ జెఱనుండి విడిపించెను. ఈసంగతి తెలిసి రక్షకభటు లతనికొఱకు నగరము నాలుగుమూలలు వెదక సాగిరి. ఆర్యకుఁడు పాఱిపోవుచు, చారుదత్తు నింటిదొడ్డితలుపు తెఱచి యున్నందున, ఆదారిని లోనికిఁబోయి, ప్రక్కగా దాఁగుకొనెను. అప్పుడు వర్ధమానకుఁడు బండిలోఁ బఱుపు వేసి, దొడ్డిగుమ్మముకడ దానిని నిలిపి, 'రదనికా! బండి సిద్ధముగ నున్నదని వసంతసేనతోఁ జెప్పు' మని యఱచెను. ఆమాటవిని యార్యకుఁడు ఆబండిలో దూరి, తలుపులు బిగించెను. తా నాబండి నెక్కినచో, నగరమునుండి సులభముగాఁ దప్పించుకొనవచ్చునని యార్యకుని యాశయము. వసంతసేన బండి నెక్కినదని తలఁచి వర్ధమానకుఁడు బండిని పుష్పకరండోద్యానమునకుఁ దోలుకొని పోవుచుండెను. ఆర్యకుని జాడలనరయు వీరకుఁడును రక్షకభటుఁడును నగరమునుండి బయటికిఁబోవు

బండ్లను పరిశోధించుచు, వర్ధమానకునిచే నడుపబడు నీబండి నడ్డగించిరి. వర్ధమానకుఁ డాబండి చారుదత్తుని దనియు; నందుఁ గూర్చున్నది వసంతసేనయనియు, నామె యుద్యానమునకుఁ బోవుచున్నదనియుఁ జెప్పెను. అంతఁ జందనకుఁడు చారు దత్తుని యెడఁగల గౌరవముకొలఁది, నమ్మి, యాబండిని దోలు కొనిపొమ్మని వర్ధమానకునితోఁ జెప్పెను. కాని వీరకుఁడు దాని కంగీకరింపక, పరీక్షింపకుండ బండిని పోనీయఁగూడదని యాఁపెను. వీరకుని యంగీకారమునుపొంది చందనకుఁడు బండిని పరీక్షించి యందున్న వాఁ డార్యకుఁడని తెలిసికొనియు, అతఁడు తన్ను శరణుజొచ్చుటచే నతనిని రక్షింపఁదలఁచెను; మఱియు నార్యకుఁడు చందనకుని ప్రాతమిత్రుఁడు; చందన కుఁడు బండిదిగి 'మిత్రమా! బండిలో నున్నవారిని జూచితిని; ఆర్య—'అని చెప్పఁబోయి, సర్దుకొని 'ఆర్యవసంతసేన యున్నది' అనియెను. ఆమాటనుబట్టి వీరకుఁ డనుమానించి 'నేనును చూచెద' నని యనఁగాఁ జందనకుఁడు 'వీఁడు చూచినచో తప్పక నార్యకుఁడు పట్టుపడును. కావున కర్ణాటకలహమును కల్పించి వీనితో జగడమాడి యార్యకుని రక్షించెదగాక!' అని మన స్సులో ననుకొని 'వీరకా! నేను చూచినపిదప మఱలఁ జూచు టకు నీవెవ్వఁడవు?' అని యతనిజాతిని నిందింపఁగా, వీరకుఁడను చందనకునిఁ దిట్టెను. చందనకుఁడు కోపముతో 'అయినఁ జూడుము' అని వీరకుఁడు బండి నెక్కఁబోవుచుండఁగా అతని జుట్టుపట్టి క్రిందికీడ్చి తన్నెను. అందుల కతఁడు కోపించి 'అధి కారులతోఁ జెప్పి నిన్ను శిక్షింతు' నని బెదరించుచుఁబోయెను. చందనకుఁడును బండిలోనున్న యార్యకునకుఁ దనచేతనున్న

క_త్తినిచ్చి, బండితోలువానితో 'నిన్నెవ్వరైన నడిగినయెడల "చందనకుఁడును, వీరకుఁడును బరీక్షించి' రని చెప్పిపొమ్మని పలికెను. పిదపఁ జందనకుఁడు శర్విలకుఁడును దనవెంట వచ్చుచుండుట గమనించి తనలో 'ముఖ్యుఁడగువీరకునితోఁ గలహము తెచ్చుకొంటిని; ఇఁక రాజు కోపించి నన్ను శిక్షింపఁ గలఁడు; కావున బంధుమిత్రులతోఁగూడ శర్విలకునితోఁగలిసి, యార్యకునే అనుసరింతునుగాక!' అని నిశ్చయించుకొనెను.

అక్కడ పూలతోఁటలోఁ జారుదత్తుఁడు మైత్రేయునితోఁ గూడ మాటలాడుచు 'ఇంకను వసంతసేన రాకుండుటకుఁ గారణమేమిరో' అని యాలోచించుచుండఁగా వర్ధమానకుఁడు బండితోలుకొనివచ్చి బండిలోవేయు పఱపును మఱచినందున వచ్చుట యాలస్యమైనదని తెలియఁజేసెను. బండిలోనున్న యార్యకుఁడు పురమువెలుపలికి వచ్చినందున నిఁక భయములేదనియు, ఎందేని పోవచ్చుననియుఁ దలంచియు, శరణాగతవత్సలుఁడగు చారుదత్తుని జూచుటకే నిశ్చయించి బండిలోనే యుండిపోయెను. చారుదత్తుఁడు వసంతసేనను బండి నుండి దింపుటకువచ్చి తలుపుతెఱచిచూడఁగా వసంతసేనకుబదులుగా ఆర్యకుఁడు కనఁబడి 'రక్షింపవలె' నని ప్రార్థించెను. 'భయములే' దని చారుదత్తుఁ డతని కభయమిచ్చి యతనికాలి సంకెలల నూడలాగెను. ఆర్యకుఁడు కృతజ్ఞతతో 'మీయాజ్ఞ లేకుండఁగనే ప్రాణములఁ గాపాడుకొనుటకయి, మీబండి నెక్కివచ్చినందులకు మన్నింపవలయును.' అని వేఁడుకొనఁగా చారుదత్తుఁడు 'మీ రిట్లొనర్చుట ఆనందకరము; పాలకుఁడు మిమ్ముఁగూర్చి పెద్దకట్టడ నొనరించియున్నాఁడు; మీసంకెల

లిప్పుడే తోలఁగినందున, తొట్రుపడు కాళ్లతో నడచుట కష్టము; కాన మీరు, ఒరులకంటఁబడకుండ నీబండిలోనే ప్రయాణము చేసి పోవుట మేలని చెప్పి యతని సంకెలలను ఒక పాడునూతిలో పాఱవేయించెను. ఆర్యకుఁడు చారుదత్తుఁడు కోరిన ట్లాబండి లోనే ప్రయాణముచేసి అపాయమును తప్పించుకొనెను. పిదప చారుదత్తుఁడును మైత్రేయుఁడును వసంతసేనం జూచుటకయి వెడలిపోయిరి.

వెనుక వసంతసేనచేత జూదగాండ్ర వలన విడిపింపఁబడి బౌద్ధసన్యాసిగా మాఱిన సంవాహకుఁడు శకారుని తోఁటలోని పుష్కరిణిలోఁ దనకావిగుడ్డల నుదుకుకొని వచ్చుచుండఁగా, విటునితోఁగూడ వచ్చుచున్న శకారుఁ డతనిం జూచి, కొట్టి తిట్టి యెట్టకేలకు వానిని విడిచిపెట్టెను. మఱియు బండి తేవలె నని చాలసేపటిక్రిందటనే స్థావరకునితోఁ జెప్పినను, ఇంతదనుక నేలబండిని తీసుకొనిరాఁడయ్యెనని యాలోచించుచుండఁగా పొరపాటున వసంతసేన యెక్కినబండిని స్థావరకుఁడు తోలుకొని వచ్చెను. వసంతసేన బండినుండియే శకారునిమాటలు విని 'అయ్యో! దైవమా! ప్రమాదవశమున నే నీ బండినెక్కి యిచటికి వచ్చితిని; వీఁడు నన్నేమి చేయునోగదా!' అని దిగులు పడుచుండఁగా విటుఁడు బండిలోనికి తొంగి చూచి వసంతసేన యుండుటను దెలిసికొని 'ఎంతకష్టము! ఆఁడుజింక పులిని వెదకు కొనివచ్చిన ట్లీమె యీక్రూరుని పాలఁబడినది.' అని విచారించు చుండఁగా, వసంతసేన యాతనింజూచి 'తన్ను రక్షింపవలెనని ప్రార్థించెను. విటుఁడు బండి దిగుచు 'అమ్మయ్యో! భూతము! బండిలో భూతమున్నది' అని యఱచెను. అట్లఱచి, శకారునికి

వెఱపుగలిగించి, అతనిని బండి నెక్కకుండఁగఁ జేసి, వసంతసేనను రక్షింపవలెనని విటుని యభిమతము. అతఁడు మఱియు, శకారునితో 'మిత్రమా! మన మింటికి నడచియే పోవుదము. అట్లు చేసినచో రాక్షసివలన భయముండదు; కాళ్లకు వ్యాయామమును కలుగును.' అని పలికెను. అందుకు శకారుఁడు 'రాజుగారి బావమఱఁదినగు నేను హాయిగా బండిమీఁదనే పోవలెను; నేను కాలినడకను పో' నని పలుకఁగా విటుఁడు తనలో 'అయ్యో! విషము నౌషధముగా నొనర్చుట కష్టముకదా!' అని యనుకొని, యిఁక దాఁచిపెట్టినఁ బ్రయోజనముండదని గ్రహించి 'నీకొఱకు వసంతసేన యీబండిపయి వచ్చినదయ్యా!' అని పలికెను. అదివిని శకారుఁడు సంతోషముతో 'అట్లయినచో 'నీదాసుఁడనని యామెకాళ్లుపట్టుకొని బతిమాలెద' నని బండి యెక్కి యట్లొనర్పఁగా వసంతసేన కోపముతో నాతనిని తన్నెను. శకారుఁడు క్రిందపడి మిగులఁ గోపించి 'ఓసీ! నీవు బీదబ్రాహ్మణుని ప్రేమించి మమ్ము తిరస్కరించితివి; మాబండియెక్కి వచ్చియు మమ్ము ప్రేమింపకున్నావు. దిగుము; మాబండి దిగుము. నీవు దిగనిచో నీజుట్టుపట్టి క్రిందికీడ్చెదను' అని పలుకఁగా విటుఁడతనిని వారించి వసంతసేనను క్రిందికి దిగుమనఁగా, ఆమె దిగి దూరముగా నిలువఁబడెను. ఆమె నప్పుడు చూడఁగా శకారునకు పట్టరానికోపముకల్గి 'ఈమెను చంపినచో నీకుఁ గావలసిన వన్నింటి నిత్తు' నని విటునితోఁ జెప్పఁగా, నతఁడు 'అయ్యో! ఈమె నిరపరాధిని; పట్టణమునకెల్ల భూషణము; ఈమెను జంపి పరలోకమనునది నెట్లు దాఁటఁగలను?' అని యట్లొనర్చుట కంగీకరింపఁడయ్యెను; పిదప సేవకుఁడగు స్థావరకుని వసంతసేనను జంప

వలెననియు, అట్లొనర్చిన బంగారుకడియములు బంగారుపీట మున్నగువాని నిచ్చి సేవకులలో ముఖ్యునిగా నొనర్తుననియు చెప్పగా వాఁడు 'నేనెన్నిరో పాపములు చేయుటఁబట్టి నీకు సేవకుఁడనైతి! ఇఁక నే నెట్టి చెడ్డపనిని చేయఁజాలను; నీవు నాశరీరమున కధికారివిగాని, మనస్సునకుఁగావు; కావున నన్ను నిర్బంధపెట్టిన లాభములే' దని పలికెను. మఱియు నిట్టిపాపము నొనర్చినఁ బరలోకమునఁ బడుబాధ యిట్టి దట్టిదని చెప్ప నసాధ్య మనియుఁ దెల్పెను. అప్పుడు శకారుఁడు తనలో 'స్థావరకుఁడు పరలోకమునకు భయపడుచున్నాఁడు ముసలివిటుఁడు నాచేను చంపుట యధర్మమనుచున్నాఁడు కాని నాకెందును ఎవరివలనను భయము లేదు; నేనే చంపెదను' అని యనుకొని స్థావరకునితో 'నీవు దూరముగా పొమ్ము' అని వానింగొట్టి పంపెను. పిదప విటునితో 'నే నూరక యంటినిగాని ఉత్తమవంశమునఁ బుట్టిన నే నిట్టి యకార్యము నొనరింతునా? వసంతసేనకు నాపై నిష్ట మున్నను నీయెదుట అంగీకరించుటకు సిగ్గుపడుచున్నది; మఱియు నాచేత దెబ్బలఁ దిన్న స్థావరకుఁడు చాలదూరము పరి గెత్తిపోయియున్నాఁడు; నీవు వానిని తీసికొని రమ్ము' అని పలికి, ఆతనినిగూడఁ బంపివేసెను. విటుఁడు తనదగ్గఱనున్నచో వసంతసేనను జంపనీయఁడని శకారుఁ డీయుపాయమును పన్నెను. విటుఁడు కొంచెము దూరముపోయి 'వీఁడు నన్ను పంపివేసి, వసంతసేనను జంపినను, జంపవచ్చు' నని యనుమానించి యొక చోట పొంచియుండి, శకారుఁ డేమిచేయునదియుఁ జూచు చుండెను. విటుఁ డెక్కడైనను దాగియుండి చూచుచుండునను అనుమానము శకారునకుఁగూడనుండుటచే వెంటనే వసంతసేనను

జంపఁ దలపెట్టక పుష్పములుకోసి, తన్నలంకరించుకొని వసంతసేనను ప్రేమతోఁ సంబోధించుచుఁ బ్రార్థింపసాగెను. విటుఁ డిదిచూచి 'మతి భయములే' దనుకొని యచ్చటినుండి పోయెను.

వసంతసేన శకారునిమాటలు విని తలవంచి 'దుర్మదాంధుఁడా! తొలుత తియ్యమామిడి నాశ్రయించి, యిపుడు మోదుగుచెట్టు నేల యాశ్రయింతును?' అని నిరసింపఁగా శకారుఁడు మిగుల కోపించి 'ఏమేమీ! దరిద్రచారుదత్తుఁడు తియ్యమామిడిచెట్టా? నేను మోదుగుచెట్టునా? ఇంకను వానినే తలఁచుచున్నావా? చూడుము; నిన్నును, నీచారుదత్తునికూడ నిప్పుడే సీతను చాణక్యుఁడు చంపినట్లు చంపెద' నని కొట్టుటకు సిద్ధపడఁగా వసంతసేన 'చారుదత్తా! నీకు వేయినమస్కారములు' అని యనుచుండఁగా, శకారుఁడు మిగుల కోపముతో 'ఆచారుదత్తు నిపుడు నిన్ను రక్షింపుము'మని పలుకుచు నామె గొంతుకను గట్టిగా నొక్కెను. వెంటనే యామె నేలపైఁబడి మూర్ఛపోయెను. ఆమె మరణించినదని తలఁచి శకారుఁ డామీఁద ఏమి చేయవలయునని కొంతయాలోచించి, కొంచెము దూరముగా పోయెను.

అప్పుడు స్థావరకునితోఁగూడ విటుఁడువచ్చి 'వసంతసేన యెక్కడ?' అని యడుగఁగా శకారుఁడు తొలుత 'నీవెనుకనే వచ్చిన' దని చెప్పి, పిదప నొక్కియడుగఁగా తాను జంపివేసితినని జవాబిచ్చెను. దానికి విటుఁడు 'అయ్యో! పాపాత్ముఁడా! ఎంతపాపమున కొడిగట్టికొంటివి?' అని శకారుని నిందించి, యీహత్యావిషయమునఁ దన కేదైనమాటవచ్చునని పోవుచుండఁగా, శకారుఁడు 'ఓయీ! వసంతసేనను జంపి నాయుద్యా

నమునఁ బడవైచి యెచ్చటికిఁబోయెదవు?' అని యడిగెను. విటుఁ డామాటల కేవగించుకొని కత్తియెత్తి శకారుని బెద రించి, శర్విలకుఁడును, చందనకుఁడు వెళ్లినచోటికే తానును బోయెను. పిదప శకారుఁడు తాను చేసినపని యెట్టిదని స్థావ రకు నడుగఁగా నతఁడును 'మీరు చేసినది పెద్దఅకార్యము' అని పలికెను. 'ఈపనిని నేనుచేసిన ట్లెవ్వరితోను చెప్పవద్దు' అని శకారుఁ డతనిని బతిమాలి, అందులకయి తనయాభరణము నీయఁబోఁగా స్థావరకుఁ డది తనకక్కఱలేదని చెప్పెను. శకారుఁ డతనితో 'నీ వీబండితో మాయింటికిఁ బొమ్ము; నేను తర్వాత వచ్చెద! నని పల్కి వానిని జంపివేసి యిట్లాలోచించెను. 'వసంతసేనను నేను జంపినట్లు వృద్ధవిటునకు, స్థావరునకుఁదప్ప ఇతరులకుఁ దెలియదు. విటుఁడు నన్ను విడిచి దూరముగా వెళ్లి పోయినాఁడు, స్థావరకుని నాయింట నిర్బంధించి సంకెలను తగి లించి యుంచెదను. అప్పు డీరహస్యము బయటపడదు. మఱియు నేను న్యాయస్థానమునకుఁబోయి 'దరిద్రుఁడగు చారుదత్తుఁడు నగలకయి యాశపడి, వసంతసేనను చంపి నాయందుగలవిరో ధముచే ఆమెశవమును నాతోఁటలోఁ బాఱవైచిపోయె' నని అభియోగము తెచ్చెదను; ఇట్లొనర్చి చారుదత్తునిపై కసితీర్చు కొందును'

శకారుఁ డిట్లు తలంచి వసంతసేనదేహముపై ఎవ్వరికిని దెలియకుండునట్లు ఎండుటాకులనుగప్పి పోవ నుంకించుచు తన కెదురుగా బౌద్ధసన్న్యాసివచ్చుచుండుటనుజూచి వానికిఁ గన్పడ కుండ అడ్డుదారినిపోయి సగముపడియున్న ప్రాకారపుగోడపై నుండి గెంతి దాటిపోయెను. సన్న్యాసియు ఉతికిన తనకావి

గుడ్డలకు మట్టియంటకుండునట్లు ప్రోగుగానున్న ఎండుటాకులపై వాని నాఱవైచి, ఆకులు కొంచెము కదలినట్లుకాఁగా ఆయాకులు తొలఁగించి చూచి వసంతసేనయుండుట కాశ్చర్యపడి, శైత్యోపచారములనొనర్చి, సేదదీర్చి, ఆమె నాసమీపమునందున్న బౌద్ధవిహారమునకు విశ్రాంతికయి తీసికొనిపోయెను.

పిదప శకారుఁడు న్యాయస్థానమునకేఁగి యధికారులరాకకయి వేచియుండెను. న్యాయస్థానమును పరిశుభ్రముగానుంచు శోధనకుఁ డీతనిం జూచి 'ఈదురాత్ముఁ డెవ్వరిపైనో లేనిపోని నేరము నారోపించి వచ్చియుండు' నని తొలుతనే వానిమొగము కనబడినందుకు విచారించెను. పిదప నధికరణకుఁడు శ్రేష్ఠి, కాయస్థులతోవచ్చి న్యాయస్థానమును బ్రవేశించి 'ఎవ్వరయిన వ్యవహారార్థులు కలరా?' అని తెలిసికొనఁగోరఁగా 'నేనున్నా'నని శకారుఁడు తెలిపెను. వానికార్యమును వినుటకధికరణకుఁడు తొలుత నంగీకరింపకున్నను, రాజస్యాలుఁడగుటచే అంగీకరింపవలసివచ్చెను. 'నీకార్యమేమి?' అని యడుఁగగా నతఁడు 'ఎవరో దురాత్ములు వసంతసేననగలనుగోరి ఆమెను నాప్రాఁతపూలతోఁటలోనికిఁ దెచ్చి గొంతునొక్కి చంపిరి; నేను చంపలేదు' అని తెలుపఁగా న్యాయాధికారి 'నేను చంపలేదు' అనుమాటను మొదట వ్రాసికొనుఁడు అని లేకరులతో చెప్పెను. వారట్లుచేయఁగా శకారుఁడు 'నేను చూచితినని చెప్పుచున్నాను; దీనికేల గడబిడచేసెదరు?' అని తనకాలితో ఆవ్రాఁతను తుడిచివేసెను. పిదప న్యాయాధిపతి 'నగలకొఱకామె గొంతునులిమి చంపిరని నీకెట్లు తెలిసినది?' అని ప్రశ్నిం

పఁగా, శకారుఁడు 'మెడయుఁ జేతులును నగలు లేక యున్నవి' అని జబాబిచ్చెను. అప్పుడు న్యాయాధికారి 'వ్యవహారము రెండువిధములు; మొదటిది వాక్యానుసారము; రెండవది యర్థానుసారము; వాదిప్రతివాదులమాటలవలనఁ దెలియఁబడు నది వాక్యానుసారియగును; అధికారులు తమబుద్ధిబలమున గ్రహించునది యర్థానుసారి యగును; ఇపుడు వసంతసేన తల్లిని బిలిపించి కనుగొనవలసియున్నది' అని యామెను రప్పించి 'నీ కూఁతు రెచ్చట నున్నది?' అని యామెను ప్రశ్నించెను. ఆమె కొంచెముసంకోచించియు, వ్యవహారమగుటచే 'మిత్రుఁడగు చారుదత్తునింటికి వెళ్లెను' అని చెప్పినది. పిదపఁ జారుదత్తుని తీసికొనివచ్చుటకు శోధనకుఁడు వెళ్లి న్యాయాధిపతియాజ్ఞ నాతనికిఁ దెల్పెను. అదివిని చారుదత్తుఁడు 'నాబండిలో నార్యకు నెంధైనఁ బంపితినని తెలిసెనాయేమి? నన్ను పిలిపించినకారణ మేమైయుండునోగదా!' అని సందేహించుచు బయలుదేరి, దారిలోఁ గలిగిన దుశ్శకునములకుఁ దల్లడిల్లుచు న్యాయస్థానమున కేఁగెను. అచటియుద్యోగు లతనికిఁ గూర్చుండుట కొక పీఠము నిచ్చి గౌరవించిరి. శకారుఁడు 'స్త్రీహత్య నొనరించిన వాని కాసనమిచ్చి గౌరవించుట న్యాయము కాదు' అనియెను. అంత న్యాయాధిపతి 'అయ్యా! మీరు వసంతసేన మిత్రులా?' అని ప్రశ్నింపఁగా 'అవు' నని సమాధానమిచ్చి చారుదత్తుఁడు 'నాకిపు డెవ్వరితో వ్యవహారము?' అని ప్రశ్నించెను. అంత శకారుఁడు లేచి 'నాతో—రాష్ట్రియుఁడనగు నాతో వ్యవహారము! నీవు రత్నాలంకారభూషితయగు వసంతసేన నట్లు చంపి, యిప్పు డేమియు నెఱుఁగనివానివలె నటించు

చున్నావా?' అని యనెను. అంత అధికరణికుఁడు చారుదత్తుని 'ఆర్యా! ఆతనిమాటలకేమి? కాని వసంతసేనయెక్కడ?' అని ప్రశ్నింపఁగా నతఁడు 'ఆమె యింటికే వెళ్లినది' అని బదులుపలికెను. పిదప 'ఎప్పుడెట్లు, ఎవ్వరిసాయమున వెళ్లినది?' అని ప్రశ్నరాఁగా, 'ఆమె యింటికేపోయినది; ఆసమయమున నేనింట లేనందున వివరములు చెప్పఁజాలను' అని చారుదత్తుఁడనియెను. 'ఏమీ? నా పూఁతోఁటలోనికిఁ దీసికొనివచ్చి, నగలకొఱకయి గొంతునులిమి చంపి యింటికిపోయెనని చెప్పుచున్నావా?' అని శకారుఁడు చారుదత్తుని బ్రశ్నించెను. అంత నధికరణికుఁడు 'ఛీ మూర్ఖుఁడా! సకలధనధాన్యములను, రత్నాభరణాంబరాదులను యాచకులకిడ తెగయిచ్చు చారుదత్తుఁడు ధనాపేక్షచే నొకస్త్రీని చంపునా? అట్లెన్నటికిని జరిగియుండదు' అని చెప్పఁగా శకారుఁడు 'అధికారులు పక్షపాతము చూపి విచారింపవచ్చునా?' అనియెను. వసంతసేనతల్లి లేచి 'అయ్యా! దాఁచనుంచిన సువర్ణాభరణమును దొంగలెత్తుకొనిపోఁగా, అంతకంటె మిక్కిలి యెక్కువవిలువగల రత్నావళి నానగకై నిన్న మార్పుగాఁబంపిన యుదారుఁడు చలిదియన్నముపాటియుఁ జేయని నగలకై నాకూఁతును జంపెననుట పొసఁగ' దని చెప్పుచు తనపుత్రిక చంపఁబడెనని తెలిసినందులకు మిగుల దుఃఖమున వాపోయెను.

అప్పుడు చందనకునిచే దెబ్బలుతిసిన వీరకుఁ డధికారులతోఁ జెప్పికొనుటకిచటికివచ్చి, న్యాయాధిపతితో 'ఆర్యా! చెఱసాలనుండి తప్పించుకొనిపాఱిపోయిన యార్యకుని వెదకుచు, నగరమునుండి బయటికిఁ బోవుబండ్లను పరిశోధించుచు, ఒకబండి

డిని చందనకుఁడు పరిశోధించినమీఁదట నేను చూచెదనని కోరఁగా వాఁడు కోపించి నన్ను గొట్టెను' అని మనవిచేసెను. 'ఆబండి యెవ్వరిదో ఎక్కడికి పోవుచున్నదో తెలియునా?' అని న్యాయాధిపతి ప్రశ్నింపగా వీరకుఁడు 'ఈచారుదత్తుఁడుగారి బండియఁట! బండిలో వసంతసేన యూరివెలుపలిపూలతోఁటకుఁ బోవుచున్నదని బండివాఁడు చెప్పెను' అని తెలిపెను. శకారుఁడు 'ఈమాటలు వింటిరా?' అని హెచ్చరించెను. అధికారి 'వీరకా! నీవ్యవహారము తర్వాత విచారింపఁబడును; కాని నీవు ముందుగా, యీద్వారమువద్దనున్న గుఱ్ఱము నెక్కి యాపూలతోఁటవద్దకుఁబోయి 'ఎవరైన విపన్నురాలగుస్త్రీయచట పడియున్నదో, లేదో చూచిర' మ్మని వానిని పంపెను. వాఁడు పోయి, మరలివచ్చి ఒకస్త్రీని జంతువులు తిని వేసినట్లును, శేషించిన యవయవములనుబట్టి యది స్త్రీయేయని తెలియుచున్నదనియుఁ జెప్పెను. అప్పుడధికారి నిజము పలుకవలెనని చారుదత్తుని నొక్కి యడిగెను. చారుదత్తుఁడు 'న్యాయాధిపతీ! దురాత్ముఁడు, పరాపకారబుద్ధి, అసూయాపరుఁడు గర్వాంధుఁడు నగువానిమాటలను గ్రహించి, నామాటలు విశ్వసింపకుండుట న్యాయముకాదు; పూవు వికసింపఁగనే దానిం దుమ్మెదలు చుట్టుకొనినట్లు లేమికలుగఁగనే యనర్థములు నన్ను జుట్టుకొనుచున్నవిగదా! తీగనువంచి, పూవుకోయువానింజూచి బెదరు స్వభావముకలనేను పూవుఁదీగవంటి దేహముగల స్త్రీని దాకి మెడనులిమిచంపితి ననఁగా మీరారు నమ్మెదరా?' యనెను. అపుడు శకారుఁడు 'అధికారులారా! అన్యాయము! తప్పుచేసినవాని

నింకను పీఠముపై నుంచిరేయున్నారు' అని పలుకఁగా, చారుదత్తుఁడే పీఠముదిగి నేలపయిఁ గూర్చుండెను.

ఇదివఱకు చారుదత్తుని పుత్త్రుఁడగు రోహసేనునకు బండిచేయించుకొనుటకుఁగా వసంతసేన తననగలనిచ్చిన సంగతి తెలిసికొని చారుదత్తుఁ డానగలను దీసికొనిపోయి యామెకిచ్చి రావలెననియు; మఱియు వసంతసేన యుద్యానవనమున కేల రాలేదో కనుగొనవలెననియుఁ జెప్పి మైత్త్రేయుని వసంతసేన యింటికిఁ బంపెను. మైత్త్రేయునికి దారిలో రేభిలుఁడగుపడి 'చారుదత్తు నేలకో భటుఁడు న్యాయస్థానమునకుఁ బిలుచుకొని వెళ్లె'నని చెప్పఁగా, ఆసంగతిని గనుగొనఁదలచిన మైత్త్రేయుఁడు సాసము యమునవే న్యాయస్థానమునకు వచ్చెను. మైత్త్రేయుఁడు చారుదత్తునివలన తనపైఁ దేఁబడినయభియోగమును విని 'మిత్త్రమా! వసంతసేన తనయింటికిఁబోయినదని చెప్పలేకపోతివా?' అని యడుగఁగా 'చెప్పితిని; కాని నాయవస్థనుబట్టియు, శకారుని మాటలనుబట్టియు నామాటలు నమ్మకున్నారు!' అని చారుదత్తుఁడు జబాబిచ్చెను. మైత్త్రేయుఁడు శకారుని నిందింపఁగా, శకారుఁడు 'నాకుఁ జారుదత్తునితోఁ వ్యవహారముగాని, వీనితోఁ గాదు. నడుమ వీఁడేల రావలెను?' అని తాను కలహమునకు సిద్ధపడెను. ఇరువురును పరస్పరము కొట్టుకొనునపుడు మైత్త్రేయుని చంకలోనున్న నగలమూట క్రిందఁబడెను. దానింజూచి శకారుఁడు 'ఆర్యులారా! చూడుఁడు; చూడుఁడు; ఈనగల కొరకే యావసంతసేన చంపబడినదని నేను చెప్పితిని' అని పలికెను. న్యాయాధిపతి యానగలను వసంతసేనతల్లికిఁ జూపి 'ఇవి నీకుమార్తె నగలగునో, కావో చెప్పు' మనఁగా ఆమె పరిశో

ధించి చూచి, 'ఇవి యీమె నగలవలెనే యున్నవి కాని; అవి కావు' అనెను. అధికారు లెంతనొక్కి ప్రశ్నించిన నామె యట్లే జవాబు చెప్పుచుండెను. చారుదత్తుఁడు మాత్రము 'ఇవి వసంతసేన నగలే' యని చెప్పెంగాని అవి యెట్లు తనస్వాధీనమయి నదియు తెలుపకపోయెను. పిదప నధికారి చేయునది లేక చారుదత్తుఁడే దోషి యని నిశ్చయించి 'మను వాక్యమునుబట్టి దోషి యగు బ్రాహ్మణుని చంపరాదు; శిక్షింపకుండరాదు; అతనిసంపద తోఁగూడ దేశమునుండి దూరముగా వెడలఁగొట్టవలెను; పిదప ప్రభువుల చిత్త' మని ప్రభువగుపాలకమహారాజునకు మనవిపంపెను. దాని కాతఁడు 'వసంతసేనను జంపినవాని యొక్క మెడపై ఆమెవస్తువుల గట్టి డిండిమ వాద్యములతోఁ గూడఁ దీసికొనిపోయి కొఱత వేయవలెనుగాని విడువరాదు' అని యాజ్ఞయిచ్చెను. వసంతసేనతల్లి 'నాకుమార్తె యెట్లును మరణించినది. ఆమె మఱల బ్రతికిరాదు; తద్విషయముగ నీతని నేల చంపవలెను?' అని విచారించెను. పాలకరాజు తలఁపునకు చారుదత్తుఁడు మిగుల విచారించెను. ఆతఁడు తనతోఁగూడఁ జావనున్న మైత్రేయుని వారించి, తల్లికిఁ దన నమస్కారములను దెలుపవలెననియు, రోహిసేనుని గాపాడవలయు ననియుఁ జెప్పి, తనమరణమునకు ముం దాతని నొకసారి చూపింపఁ గోరెను. మైత్రేయుఁడట్లు చేయ నంగీకరించెను.

అంత నిరువురుచండాలురు చారుదత్తుని వధ్యభూమికిఁ గొనిపోవుచు 'ఇతఁడు ధనాశాపరుఁడై యొకస్త్రీని జంపినందునఁ గొఱత వేయఁబడుచున్నాఁడు; ఇట్టితప్పు చేసినవారి కిదియే శిక్ష' యని రాజాజ్ఞ ననుసరించి చాటుచు, అతనిం జూచుటకు వచ్చిన

వారింగూర్చి 'తొలఁగిపొండు; తొలఁగిపొండు. నక్షత్రములు రాలుటయు, నావ లీనుటయు, సజ్జనులు వధింపఁబడుటయుఁ జూడఁగానివి' అని పలుకుచు నడుచుచుండిరి. వారొక్కొక్కచో నాగి 'ఇతఁడు సార్థవాహుఁడగు వినయదత్తుని మనుమఁడు; సాగరదత్తుని కుమారుఁడు; చారుదత్తుఁడని యితనిపేరు; ఇతఁడు ధనాపేక్షచేత వసంతసేన యనువనితను బలాత్కారముగఁ జంపి యున్నాఁడు; కావున పాలకమహారాజుగారితనిని కొఱతవేసి నచో నిఁక నెవ్వరు నిట్టిపనులు చేయరని యానతిచ్చిరి; అందులకై దక్షిణదిక్కుననున్న శ్మశానమున కితనిని గొనిపోవుచున్నాము' అని చాటిరి. చారుదత్తుఁడు వసంతసేన మరణమునకును, దనకుఁ గల్గినయీకష్టమునకును మిగుల విచారించి 'తనమృతికి ముందొక్కసారి పుత్త్రునిముఖమును చూడనీయవలె' నని చండాలురఁ బ్రార్థించెను. వారు దాని కంగీకరించి, మైత్త్రేయునితో వచ్చినరోహసేనుని జూచుటకుగా జనులనొత్తిగిలునట్లు చేసి అతనిని జూచుటకు చారుదత్తున కవకాశమును గలిగించిరి. చారుదత్తుఁడు కుమారునిఁజూచి 'నాయనా! నీకు సువర్ణాభరణములనుగాని, రత్నాభరణములనుగాని యీయలేనైతిని; కాని బ్రాహ్మణులకు ఆనగలకంటె ఎక్కుడగునగ యజ్ఞోపవీతము! పితృదేవతలకుఁ దృప్తికరమైన దీనగయే. దీనిని గ్రహించి పరలోకమునకుఁబోయిన నాకు దప్పికలుగకుండఁ దర్పణములను విడువుము' అని దుఃఖించుచు రోహసేనునకు యజ్ఞోపవీతము నిచ్చెను. అపుడు చండాలురలో నొకఁడు చారుదత్తుని 'రార'మ్మని తొందరపెట్టుచుండఁగా రెండవవాఁడు 'ఓరీ! ఈయనను గౌరవముతోఁ జూడుము. రాహువుచేఁ బట్టుకొనఁ

బడినను, చంద్రుఁ డెల్లరకుఁ బూజనీయుఁడేగదా!' అని పలుకుచు వానిని మందలించెను. అప్పుడు రోహసేనుఁ డేడ్చుచు 'మానాయన నెక్కడికిఁ దీసికొనిపోవుచున్నారు?' అని తలారులను ప్రశ్నింపఁగా, చారుదత్తుఁడు 'వధ్యస్థానమునకుఁ బోవుచున్నాను' అని తెలిపెను. అంత రోహసేనుఁడు 'తలారులారా! మాతండ్రి నేలచంపెదరు? అతనికి బదులు నన్ను చంపి మా నాయనగారిని విడువుఁడు' అని పలుకఁగా, ఆమాటలకు చండాలురు సంతసించిరి. మైత్రేయుఁడు తన్ను జంపి చారుదత్తుని విడువవలయునని వారిని బ్రార్థించెను. చండాలురు చారుదత్తుని గొనిపోవుచు ముఖ్యములగు మూఁడునాల్గుచోట్ల నిలిచి, వెనుకటిమాటలనే గట్టిగా పలుకుచుఁజాటిరి. వారు శకారుని యింటి సమీపమున నిల్చి చాటుచుండఁగా మేడమీఁద త్రాళ్లుకట్టి బంధింపఁబడియున్న స్థావరకుఁ డామాటలు విని శకారుఁ డొనర్చినపనికి నిష్కారణముగ నార్యచారుదత్తుని జంపుచున్నారే యని వగచి మేడమీఁదినుండియే గట్టిగా అయ్యలారా! వసంతసేనను చారుదత్తుఁడు చంపలేదు. బండ్లు తాఱుమాఱగుటవలన శకారునిబండిలోఁ గూరుచున్న వసంతసేనను నేనే శకారుని పూలతోఁటలోనికిఁ దీసికొనిపోయితిని. తన్నామె ప్రేమింప నంగీకరింపనికారణమున శకారుఁడే యామె గొంతునొక్కి చంపెను' యని అఱచెను. కాని యాకోలాహాలములో అతనిమాట లెవ్వరికిని వినబడలేదు. పిదప నతఁడు 'అయ్యో! నామాట లెవ్వరికిని వినఁబడలేదు కాఁబోలు! ఎవ్వరును నన్ను లెక్కింపకున్నారు. సద్బ్రాహ్మణుఁడును, కల్పవృక్షమువంటివాఁడునగు చారుదత్తుఁడు మరణింపనున్నాఁడే!

నేను చచ్చిపోయిన నాతనిని బ్రతికించి తీరవలె' నని నిశ్చయించి, యాకట్లతో నే మెల్లమెల్లగఁ బ్రాకుచు క్రింది కురికెను. క్రిందఁ బడునప్పు డతనికి దెబ్బలు తగులలేదు ; మఱియుఁ గట్లు తెగి విడిపోయినవి. అప్పు డతఁడు జనులను ద్రోసికొనుచుఁ ద్వరగా చండాలురవద్దకుఁబోయి జరిగినవృత్తాంతమును జెప్పెను. ఆమాటలువిని చారుదత్తుఁడు తాను కారణమునకు భయపడకున్నను, ఇంతవఱకును అపకీర్తి కలుగుచున్నదని మిగుల విచారించెను. ఇప్పు డీ అపరిచితుఁడు ఉపకరించి, తనవలనఁ దప్పులేదని తెలిపినందుకు మిగుల సంతసించెను. స్థావరకుఁడు తప్పించుకొని వచ్చినందున శకారుఁడు భయపడియు నుపాయ మాలోచించి చండాలురతో 'వీనిని నేను రత్నభాండార రక్షణార్థము నియోగించితిని; వీఁడొక సువర్ణాభరణమును దొంగిలించినందున వీనిని తన్ని, కొట్టి, కట్టి పడవైచితిని ; అందుచేతనే వీఁ డిట్లు నాకు వ్యతిరేకముగాఁ జెప్పుచున్నాఁడు ; కావలసినచో వీని వీపు పరీక్షింపుఁడు ; దెబ్బలగురుతులున్నవో, లేవో తెలియఁగలదు' అని పలుకగాఁ వారు పరీక్షించి శకారుని మాటయే సరియైనదని తలఁచిరి. స్థావరకుఁడు శకారునిచేఁ దఱుమఁబడి చేయునది లేక వెళ్లిపోయెను. అంత శకారుఁడు 'ఆలసింపక వేగముగా నీతనిని చంపుఁ' డని పలుకఁగా, రోహసేనుఁడు 'నన్ను జంపి, మాతండ్రిని విడువుఁ' డని పలికెను. శకారుఁడు 'పుత్త్రునితోఁగూడ చారుదత్తుని జంపుఁడు' అని చెప్పఁగా, చండాలురు 'పుత్త్రునితోఁగూడ నీతనిని చంపవలెనని మాకు రాజాజ్ఞ లేదు ; కాన మేమట్లు చేయఁజాల' మని రోహసేనుని దూరముగాఁ బొమ్మని, చారుదత్తుని దీసికొనిపోయి, 'చారు

దత్తుని చంపువంతు నీది; నీది' యని తమలోఁదాము వాదులాడి, నిశ్చయింపలేక తుదకు చీట్లువ్రాసి దానిమూలమున వీరకునిదే వంతని నిర్ణయించిరి. అప్పుడు వీరకుఁడు రెండవవానితో 'నా దే వంతైనయెడల గొంతకాలము నిరీక్షింపవలెను. ఏలయన—మా తండ్రి మరణించునపుడు నాతో 'నాయకా! వీరకా! రాజాజ్ఞఁ ననుసరించి నీవెవ్వరినైన వధింపవలసివచ్చినపుడు త్వరపడక కొంచెముసేపాలస్యము చేయుము. ఏలయన, ఎవరైన, సుదారులు ధనమిచ్చి వారిని విడిపింపవచ్చును; ప్రభువులకు పుత్త్రుఁడు కలిగెనా, ఆసంతోషమున, ప్రభువు లానందాతిశయమునఁ జెఱలోనివారలను విడిపించుటయు, వధింపఁబడువారిశిక్ష మానుపుటయు జరుగవచ్చును; ఏనుఁగుకట్టువీడి జనులపైఁ బడఁగా, సంభ్రమమున నందఱును చెల్లాచెదరగునపుడు వధ్యుఁడు తప్పించుకొనవచ్చును; ఒకప్పుడు రాజులే మాఱిన మాఱవచ్చును; అట్టియెడ వెనుకటిరాజు శిక్షించిన వధ్యునకు విడుదల కలుగవచ్చును' అని నొక్కి చెప్పియున్నాఁడు; కావున తండ్రిమాటప్రకారము నేను నిరీక్షింపవలెను' అని పలికెను. 'ఏమేమిరా! రాజులు మాఱిన మాఱవచ్చు నని యనుచున్నావా?' అని శకారుఁ డాశ్చర్యపడి, వారిని తొందరపెట్టసాగెను. కొంతసేపు తాళినవెనుక వీరకుఁడు 'చారుదత్తా! రాజానుమతి ననుసరించి నిన్ను వధించుచున్నాము; ఇందు మాతప్పేమియును లేదు; నీవు ధ్యానింపవలసినది ధ్యానించుకొను' మని చెప్పఁగా, చారుదత్తుఁడు 'తన భాగ్యహీనతను గూర్చియు, వసంతసేనంగూర్చియుఁ దలపోసి విచారించెను. అపుడు వారు "అయ్యా! ఆకసమందలి చంద్రసూర్యులును విపత్తిని పొందు

చున్నారు. ఇఁక మానవులమగు మనసంగతి చెప్పవలెనా? కొందఱు పడుచుండుటయుఁ గొందఱు లేచుచుండుటయు స్వభావసిద్ధములు. కావున ధైర్యము నవలంబింప వలెను” అని పలికి యతనిని వధ్యశిలవద్దకు దీసికొని పోయిరి.

వసంతసేనను రక్షించిన బౌద్ధసన్యాసి (సంవాహకుఁడు) ఆమెకోరిక ననుసరించి, యామెను మెల్లమెల్లఁగా చారుదత్తుని యింటికి నడిపించుకొనివచ్చుచు దారిలో జనులు గుమికూడుటం జూచి యదియేమని యడిగి, వారివలన సమాచారము నంతటిని దెలిసికొని ‘అమ్మా! వసంతసేనా! నిన్ను చారుదత్తుఁడు చంపి నాడను నేర మాతనిపై మోపి, చారుదత్తుని జంపుటకు వధ్య స్థానమునకుఁ దీసికొనిపోయినట్లు తెలియుచున్నది’ అని చెప్పెను. వసంతసేన యామాటలకు మిగుల భీతినొంది యాభిక్షుకునితోఁ గూడఁ బరుగుపరుగున వధ్యశిలవైపు పోయెను.

వీరకుఁడు చారుదత్తుని జంపుటకుఁ గత్తినెత్తఁగా నది నేల జాఱిపడెను. అంత వాఁడు ‘చారుదత్తునికిఁ జావు లే’దని నిశ్చయించుకొనియు, రాజాజ్ఞను నెఱవేర్పఁదలఁచి మఱల సంసిద్ధుఁడయియుండఁగా నాసమయమునకే బౌద్ధసన్యాసియు, వసంతసేనయు నచటికివచ్చిరి. వసంతసేన తొందరతో ‘అయ్యలారా! చంపకుఁడు, చంపకుఁడు. ఎవతెనిమిత్తమయి యాయన చంపఁబడుచున్నాఁడో, ఆవసంతసేనను నేను బ్రతికియే యున్నాను’ అని యఱచెను. నిరపరాధిని అంతవఱకును చంప నందులకుఁ జండాలురు సంతసించిరి. వా రీవృత్తాంతమును యజ్ఞవాటికలోనున్న రాజునకు మనవిచేయుటకుఁ బోయిరి. వసంతసేన బ్రతికివచ్చుటం గాంచి, శకారుఁడు మిగుల భయపడి,

పాఱిపోఁదలంచెను. కాని యింతలోఁ జండాలురువచ్చి 'ఎవ్వఁ డామెను చంపఁజూచిరో వానినే జంపవలెనని రాజాజ్ఞ' యని యఱచుచు, శకారునిఁ జంపఁదలఁచి వానిం బట్టుకొనఁ బోయిరి.

చండాలురు తన్నుఁ జంపనుండఁగా నెండిన చేనిపయిఁ బంటవానపడినట్లు, వధకాటంకముగా స్వర్గమునుండి దేవతయే దిగివచ్చినట్లుగా చారుదత్తుఁడు వసంతసేనం జూచి యచ్చెరు వందెను. లేనిచో మృతినొందినవసంతసేన యెప్పటివలెవచ్చునెట్లు సంభవించునని యతఁ డనుకొనెను. చకితుఁడగు నతనింజూచి వసంతసేన 'నే వసంతసేన' నని తెలుపుచు చేరఁగా నతఁడు తన్నుఁ గాపాడవచ్చినది నిశ్చయముగ వసంతసేనయే యని గ్రహించి యానందమున నాకసమందుకొని 'ప్రియురాలా! నీకు ఆపదకలుగుటకు గారణమే' మని యడుగఁగా ఆమె 'నేను దురాత్ముఁడగు రాజస్యాలునిచేఁ జంపఁబడి యీ యుత్తమునిచే బ్రతికింపఁబడితి' నని బౌద్ధసన్న్యాసిని జూపెను. 'ఈతఁ డెవ్వఁడు?' అని చారుదత్తుఁ డడుగఁగా బౌద్ధసన్న్యాసిగా మాఱిన యాసంవాహకుఁడు 'ప్రభూ! నన్ను గుర్తింపలేదా? నేను మీ కాళ్ళుపిసికి జీవించినసంవాహకుఁడను; నేనొకప్పుడు జూదగాండ్రకు ఋణపడి యీయుత్తమురాలిచే విడిపింపఁబడి, వైరాగ్యమువలన క్షపణకుఁడ నయితిని; శకటములు మాఱుట వలన, శకారుఁడు తనబండిలోఁ, దనపూలతోఁటకుఁ దెచ్చిన యీమెను చంపుట నేఁగన్నులారఁ గాంచితిని' అని యింక నేమేమో చెప్పుచుండఁగా శర్విలకుఁడు జనులను ద్రోసికొనుచు నచటికివచ్చి చారుదత్తునకు నమస్కరించి నిలిచెను. 'నీ వెవ్వఁ డవు?' అని చారుదత్తుఁడు ప్రశ్నింపఁగా నతఁ డిట్లు చెప్పెను.

'ఆర్యా! చారుదత్తా! మీయింటికిఁ గన్నముత్రవ్వి బంగారు నగను దొంగిలించిన చోరుఁడను నేనే! నాపేరు శర్విలకుఁడు నేఁడు నామిత్రుఁడగు నార్యకుఁడు దుర్మార్గుఁడగు పాలక రాజును యజ్ఞశాలయందే కంఠము తెగనఱికి చంపెను. ఆర్యకునకు మీరొనర్చినమహోపకారము సాటిలేనిది; అతఁడు చెఱ నుండి తప్పించుకొని మీబండిలోదూరి, మీతోఁటకు రాఁగా, అభయమిచ్చి మీరు రక్షించితిరి. ఈరాజ్యలాభము మీవలన గల్గినదనియు, కృతజ్ఞతఁ దెల్పుచున్నాననియు నార్యకుఁడు సందేశమంపియున్నాఁడు' అని పలికెను. ఆర్యకుఁడు రాజైనందులకుఁ జారుదత్తుఁడు మిగుల సంతసించెను. శర్విలకుఁడు 'మఱియు మీకు మిత్రుఁడైన యార్యకుఁడు మీకు వేణాతటమునందలి కుశావతీ రాజ్యమును సమర్పించినట్లు మనవిచేయఁగోరినందున, ఆసమాచారమును దెలుపుటకును నేను వచ్చితిని' అని పలికెను.

ఇంతలో శర్విలకునియాజ్ఞ ననుసరించి భటులు శకారు నచటికిఁ దీసికొనివచ్చిరి. వారతనిని చంపఁదలఁచి యుండఁగా, శకారుఁడు, తన్ను రక్షించు వారింక నెవ్వరును లేనందునఁ జారుదత్తునే శరణు జొచ్చెను. వధ్యుని మెడలో వేయుమాలను వసంతసేన చారుదత్తుని కంఠమునుండి తీసి శకారుని మెడలో వేసినది; శకారునిఁ జంపుటయే యుత్తమమని జనులందఱును పలికిరి. శకారుని జంపించవలెనని శర్విలకాదుల పట్టుదల. కాని చారుదత్తుఁడు 'శరణుఁజొచ్చిన శత్రువునైనను కాపాడుట ధర్మము కావున వీనిని విడువుఁడు' అని పలికి శకారుని విడిపించెను.

ఇది యిట్లుండఁగా నచట చారుదత్తునింట, నతని భార్య యగు ధూతాంబ తనభర్త వధింపఁబడెనని నిశ్చయించి, సహగమనము చేయుటకు సిద్ధపడి, చీరచెఱఁగు పట్టుకొని తన్ను వారించుచున్న కుమారునితో 'కుమారా! నన్ను బోనిమ్ము, మీనాయనగారు మరణించిరను నమంగళవాక్యమును వినుటకు ముందే నేను మరణింపవలె' నని పలుకుచుండెను. 'నీవు లేని యెడల నేను బ్రతుకఁజాల' నని రోహసేనుఁ డనుచుండెను, 'బ్రాహ్మణస్త్రీలు భర్తతోఁగూడియే చితినెక్క వచ్చు గాని, వేఱుగా చితినెక్కరా' దని మైత్రేయుఁడు బోధించుచుండెను. 'నీ కిట్టిపని తగ' దని రదనికచెప్పుచుండెను. కాని ధూతాంబ యెవ్వరి మాటలను సరకుగొనలేదు. ఇంతలోఁ జందనకుఁడు వచ్చి 'చారుదత్తుఁడు బ్రతికియేయున్నాఁడు' అని చెప్పినను ఆమాట యెవ్వరును చెవినిపెట్టనందున నతఁడు పరుగెత్తుకొని వచ్చి యీవృత్తాంతమును శర్విలకునికిఁ దెలిపెను. శర్విలకుఁడీ సంగతి చారుదత్తునికి వసంతసేనకును దెల్పి, వారితోఁగూడ ధూతాంబాదు లున్నయెడకుఁ బోయెను,

వీరందఱు నక్కడికి వెళ్లుసరికి ధూతాంబ తన్ను విడువకున్న రోహసేనుని విదలించుచు 'మైత్రేయా! మీరయిన నీచిన్నవానిని బట్టుకొనుఁడు' అని ప్రార్థించుచుండెను. చారుదత్తుఁడామాటలు విని 'నేనే యీపిల్లవానిని బట్టుకొందు' నని త్వరగావచ్చి రోహసేను నెత్తుకొనెను. అది చూచి ధూతాంబ యాశ్చర్యపడి, ప్రాణనాథుఁడు బ్రతికివచ్చె నను సంతోషముతో నతని సమీపమునకు వచ్చెను. మైత్రేయుఁ డానందమున నోలలాడెను. శర్విలకాదులు సంతసించిరి. ధూతాంబ

బ్రతికియుండుటవలన తన ప్రాణములు వచ్చినట్లు వసంతసేన సంతసించెను.

పిదప చారుదత్తుఁడు బౌద్ధసన్యాసిని సర్వవిహారములకును కులపతిగా నొనర్చెను; స్థావరకునికి దాస్యమును తొలఁగించెను. చందనకునికి దండపాలకత్వాధికారము నొసఁగెను. చండాలురను సర్వచండాలాధిపతుల నొనర్చెను; శకారుఁడు గొప్ప తప్పులను చేసినను, వాఁడు శరణుజొచ్చినందున చంపింపక విడిచిపుచ్చెను. తనకు లభించినరాజ్యసంపదతోఁ జారుదత్తుఁడు ధూతాంబా, వసంతసేనలతోఁగూడి సుఖముల ననుభవించుచుండెను.



# మాలతీమాధవము

## పీఠిక

సంస్కృతనాటకములలో ఉత్తమశ్రేణికిఁ జెందినవానిలో ఈ 'మాలతీమాధవము' ఒకటి. దీనిని మహాకవి భవభూతి రచించెను; మహావీరచరితము, ఉత్తరరామచరిత్రము అనునవి అతని యితరనాటకములు.

భవభూతినాటకములలో ఉత్తరరామచరిత్రమునకుఁ జెప్పఁదగినదృశ్యము ఈమాలతీమాధవము. మాలతికిని, మాధవునికిని గల ప్రేమ, వివాహము ముఖ్యవిషయములగుట వలన దీని కీపేరు పెట్టఁబడినది. ఇందాయాయెడలఁ గల వర్ణన లద్భుతములు! ఇందు మాలతీమాధవులతోఁబాటు మదయంతికా, మకరందుల ప్రణయమును బాగుగ వర్ణింపఁబడినది. దృశ్యప్రబంధములలో ఇది ప్రకరణమగుటవలన ఇందలి కథలు కల్పితములని పాఠకులు గ్రహింపవలెను; కల్పితవిషయములను యథార్థముగఁ దోఁపించు భవభూతిమహాకవిప్రతిభ యిందు ప్రశంసార్హము.

విధివిలాసమును తప్పింప నసాధ్యమనియు, సంసారదూరులైన యోగినులుకూడ దయతో లోకములోని యుత్తములకుపకారముచేయుదురనియు, పాపము లెప్పటికైన పండకపోవనియు—ఈమున్నగునీతు లిందుండి గ్రహింపఁదగినవి.

---

# పాత్రములు

## పురుషులు

మాధవుఁడు—విదర్భరాజమంత్రి దేవరాతుని కుమారుఁడు; కథానాయకుఁడు.

మకరందుఁడు—మాధవుని చెలికాఁడు; మదయంతిక వలపు కాఁడు.

కలహంసుఁడు—మాధవుని సేవకుఁడు.

నందనుఁడు—పద్మావతీరాజు వయస్యుఁడు; మదయంతికయన్న.

భూరివసువు—మాలతి తండ్రి, పద్మావతీరాజు మంత్రి.

దేవరాతుఁడు—మాధవుని తండ్రి.

అఘోరఘంటుఁడు—చాముండాదేవి ఉపాసకుఁడు - కాపాలికుఁడు.

## స్త్రీలు

మాలతి—భూరివసువు పుత్రిక, కథానాయిక.

మదయంతిక—మాలతి మిత్రురాలు, నందనుని చెల్లెలు.

కామందకి—బౌద్ధసన్న్యాసిని, మాలతి పర్యవేక్షకురాలు.

లవంగిక—మాలతి చెలికత్తె.

సౌదామిని— }
అవలోకిత— } కామందకి శిష్యురాండ్రు.
బుద్ధరక్షిత— }

మందారిక—కామందకి సేవకురాలు, కలహంసుని వలపుకత్తె.

కపాలకుండల—అఘోరఘంటుని శిష్యురాలు.

# మాలతీమాధవము

తొల్లి దేవరాతుఁడనునతఁడు విదర్భదేశాధిపతియొద్ద మంత్రిగా నుండెను. అతఁడును, పద్మావతీనగరాధిపతియొక్క మంత్రియగు భూరివసువును బాల్యమిత్రులు; వీరిరువురు నొక్క యెడనే విద్యాభ్యాస మొనర్చిరి; విద్యాభ్యాసకాలమున వారు తమమైత్రిని మునుముందును పెంపొందింపఁదలఁచి, సంతానవంతులయిన యనంతరము పరస్పరము వియ్యమందవలయునని యొడంబడికచేసికొనిరి. తన శిష్యురాలగు సౌదామిని యను నామెతోఁగూడ ఆసమయమున వీరి సహవాసపరిచయముకల కామందకి యనుయోగిని యెదుటనే వీరు ప్రతినపట్టుట జరిగినది.

విద్యాభ్యాసానంతరము వారిరువురు వివాహితులయి సంతానమును బడసిరి. దేవరాతునకు మాధవుఁడనుకుమారుఁడు కలిగెను; భూరివసునకు మాలతియను కుమార్తె కలిగెను. వారిరువురును గొప్పసౌందర్యముకలవారగుటచే వీరిని జూచినవా రందఱును వీరిరువురికిని దాంపత్యముకలిగిన విధాత యొనరించినసృష్టి చరితార్థముకాఁగలదని యనుకొనుచుండెడివారు. యోగినియగు కామందకి పద్మావతీప్రభుని ప్రార్థన మేరకు మాలతిని గాపాడుచు, ఆమెకు విద్యాబుద్ధులఁ గఱపుచు సర్వదా ఆమెశ్రేయమునే కోరుచుండెను.

పెక్కేండ్లు గడచిపోయినను బాల్యమిత్రులు తమవెనుకటియొడంబడికను మఱువలేదు; అయినను మాలతీమాధవులు

పరస్పరము అంగీకరించినఁగాని వారివివాహము జరుపుట భావ్యము కానందున బుద్ధిమంతుఁడగు దేవరాతుఁడు తర్క విద్యాభ్యాస మనుమిష పెట్టి మాధవుని పద్మావతీనగరమునకుఁ బంపెను. ఆయేర్పాటువలన మాలతీమాధవులకు పరస్పర సందర్శనము తన్మూలముగ అనురాగము కలుగవచ్చునని యతని తలంపు. మాధవునితో అతని ప్రియవయస్యుఁడగు మకరందుఁ డును, సేవకుఁడగు కలహంసకుఁడును పద్మావతీపురమునకు వచ్చిరి.

యోగినియగు కామందకికి సంసారసంబంధము లేకు న్నను, తాను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులుగఱపిన మాలతికి తగినవరుఁడు లభింపవలెనను అభిలాష యామెకు లేకపోలేదు. మఱియు నామెయెదుటనే మాలతీమాధవులతండ్రు లిరువురును చిన్ననాఁట బాసలుచేసియుండుటంబట్టి వానినెట్లయినను నెఱ వేర్పవలెనను కుతూహలము నామెకుఁ గలదు. కావుననే యామె తనశిష్యురాండ్రగు అవలోకితయొక్కయు, బుద్ధరక్షిత యొక్కయు సాహాయ్యము నీవిషయమునఁ బడయుచుండెను. మాధవుఁడు తఱచుగ మంత్రిభవనము నెదుటనుండియే రాక పోకలు జరుపునట్లుగా అవలోకిత ఉపాయములు పన్నెను. దీనివలన మాధవుఁడు మేడపై నున్నమాలతిని పలుసారులు చూచుటయు, ఆమెయు నీతని నవలోకించుటయు, వారిరువురి కిని పరస్పరమనురాగ ముదయించుటయు జరిగెను. మాధవుని మిత్రుఁడగు మకరందుఁడు మాలతిచెలికత్తెయు రాజుగారి నర్మసఖుఁడగు నందనుని సోదరియునగు మదయంతికను ప్రేమిం చెను; ఆమెకు నతనియెడ ప్రేమజనించెను. ఇంతియగాక

సమన్వితయగు వనితవలనఁ దెలియవచ్చినది. ఈకపాలకుండల శ్రీశైలప్రాంతవాసియగు నఘోరఘంటుఁడను కాపాలికుని శిష్యురాలు. అఘోరఘంటుఁ డిపుడు స్వాభీష్టకార్యసిద్ధికయి పద్మావతీనగరముచేరువనున్న శ్మశానముననున్న కరాళయను శక్తి నారాధించుచుండెను; మఱియు నాతఁడాశక్తికి బలి యిచ్చుటకయి అందకత్తెలను, అందగాండ్రను నెదకుచుండెను కపాలకుండల ప్రతిదినము సాయంకాలమున శ్రీశైలమునుండి వచ్చుచు మంతనములాడిపోవుచు నుండును. ఆకపాలకుండల వలననే సౌదామినీవృత్తాంత మెఱుకపడెను. ఈయంశము నవ లోకిత కామందకికిఁ దెలుపఁగా తనకార్యసాధనమునకు సౌదా మిని సాయపడఁగలదని భావించుచుండెను.

అవలోకిత మకరందోద్యానమున మన్మథోత్సవమును ప్రకటించినందున మాధవుఁడు వేడుకతో నా వృందోటలోఁ బ్రవేశించి యొకపొగడచెట్టునీడను గూరుచుండి ఆవృక్షము నుండి రాలిపడినపూవులను దండగా గ్రుచ్చుచుండెను. అపుడు లోకోత్తరసౌందర్యవతియగు మాలతి యాతోటలోనున్న కామదేవునియాలయపు గర్భగృహమునుండి చెలికత్తెలతోఁ గూడ బయలువెడలి మాధవుఁడున్న వకుళవృక్షముచేరువకే వచ్చెను. మాలతీమాధవులు పరస్పరము చూచికొనుట కప్పు డవకాశ మేర్పడెను. తా నామెను చూచుచున్న ట్లితరులు తెలిసికొనకుండుటకును, తనభావములను కప్పిపుచ్చుటకును చూచియుఁ జూడనట్లుగా మాధవుఁడు తా నుపక్రమించి యుండిన వకుళమాలికాగ్రథనమును ఎట్లో యొకరీతిని పూర్తి చేసి మెడలో వేసికొనెను. మాలతి తనకొఱకుఁ దేఁబడిన పిడి

డేనుఁగునెక్కి నగరమార్గమునఁ బోవుచు మెడను వెనుకకుఁ ద్రిప్పి మాధవునిఁ దేఱిపాఱి చూచెను. మాలతి చెలికత్తయగు లవంగికమాత్రము పూవులుకోయునెపమున వెనుకనేయుండి పోయి మాధవుని సమీపించి నమస్కరించి 'ఆర్యా! మీరు గ్రుచ్చిన యీపొగడదండ చాల చక్కగా నున్నది; కుసుమ కాండవిషయమున మా చెలికి ప్రీతియెక్కువ; ఇట్టిదండల నామె మిక్కిలి గౌరవించును. ఈదండ యామెకు ఎంతయుఁ దగి యున్నది' అని పలికి తనచెలికత్తె ఎవ్వతెయైనదియుఁ దెలియఁ జేసెను. మాధవుఁడు ప్రీతితోఁగూడ తన మెడలోనిపూల మాలను లవంగికచేతి కిచ్చెను. మాధవుఁడు మాలతిని జూచు చున్నపుడు గ్రుచ్చినభాగము ఎగుడుదిగుడుగానున్నను ఆ పూలమాల మిక్కిలి అందముగనున్నదని యనుచు లవంగిక దానినిగ్రహించి తనచెలికత్తె కిచ్చుటకుఁ బోయెను.

మాలతీవిరహదుఃఖమానమానసుఁడగు మాధవుఁడు వికలచిత్తుఁడై యొంటరిగ మకరందోద్యానమునఁ దిరుగుచుం డఁగా, అతనిని వెదకుచు మకరందుఁడు వచ్చి, మాధవుని వైమనస్యమునకుఁ గారణమును తెలిసికొని, అతని నూరడించు టకుఒక కాంచనారవృక్షముక్రిందఁ గూర్చుండఁజేసెను. ఇంతలో మాలతివ్రాసిన మాధవునిచిత్రమును పట్టుకొని కలహంసుఁ డటకువచ్చియు, తనప్రభువు కొంత విశ్రాంతిని తీసికొనినపిదపనే దానిని చూపఁదలఁచి యొకప్రక్కగా నిలిచియుండెను. అప్పుడు మాధవుఁడు మకరందోద్యానమున జరిగిన సంఘటనను మిత్రు నకు పూసగ్రుచ్చినట్లు తెలిపి, మాలతికి తనయెడ పూర్తిగా ప్రేమ యున్నదా? అని సందేహించుచుండఁగా మకరందుఁ

'డామె తప్పక నిన్నే వలచియున్న'దని యూరడించుచుండెను. ఇంతలో కలహంసుఁడు చిత్రపటమును దెచ్చి మాధవునికిచ్చి, దాని నెవ్వరు వ్రాసినదియు, తన కెట్లు లభించినదియుఁ దెలిపెను. మాధవుఁ డదిచూచి సంతోషాశ్చర్యములలోఁ జిక్కువడి, విరాలి యెక్కువకాఁగా బాధపడుచుండఁగా మకరందుఁడు 'మిత్రుఁడా! నీ యీవిరాలికిఁ గారణమైన కన్యకనుకూడ నీ వీ చిత్రమునఁ జిత్రించుట మేలు' అని చెప్పఁగా మాధవుఁ డట్లె మాలతి చిత్రమును చిత్రించి 'లోకములో మనస్సును మాటిమాటికిని రంజింపఁజేయు చంద్రకళ మొదలగున వెన్నియో కలవు; కాని నాకుమాత్ర మీజన్మములో సుఖకరమైనది మాలతీ ముఖదర్శన మొక్కటియే' అనునర్థము నిచ్చు పద్యమును వ్రాసెను.

ఇంతలో కలహంసుని యడుగుజాడ ననుసరించి మందారిక యక్కడకువచ్చి యచట మాధవమకరందులను జూచి చకిత యాయెను; మాధవుఁడు గౌరవముగా నామెను కూర్చుండ నియమించెను. మందారిక తన చిత్రపటము నిమ్మని కలహంసు నడుగఁగా, అత డిచ్చెను. అందు వ్రాయఁబడిన మాలతిచిత్రమును జూచి యచ్చెరుపొంది దానిని మాధవుఁడు వ్రాసెనని తెలిసికొని సంతోషముతోఁబోయి, యీవృత్తాంతమును లవంగికకుఁ దెల్పి చిత్రపటము నిచ్చివేసెను. పూజ్యురాలగు కామందకి యీవిషయమున గొప్పగా సాయపడునని మకరందుఁడు తలఁచి యీవృత్తాంతమంతయు నామె కెఱింగించెను.

మాధవుఁడు గ్రుచ్చిన పొగడపూదండను, మందారిక తెచ్చియిచ్చిన చిత్రపటమును లవంగిక పట్టుకొనివచ్చి మేడ

మీఁద నొంటరిగానున్న మాలతికిచ్చి యావృత్తాంతము నంతటిని వివరముగాఁ దెలిపెను. తన్ను జూచుచు మాధవుఁడు హెచ్చుతగ్గులుగా గ్రుచ్చిన యాపొగడపూవులదండను మాలతి మిగుల గౌరవముతో గ్రహించి మెడలో వేసికొనెను. చిత్ర పటమునసున్న మాలతిరూపమును తనరూపమును జూచి మిగుల సంతోషించి, తనచిత్రము క్రింద వ్రాయఁబడిన పద్యమును జదువుకొని యిట్లు విచారించెను. 'హా! మాధవా! నిన్ను చూడని మానవతులే గొప్ప యదృష్టముచేసికొన్న వారని యనుకొందును; ఏలయన నిన్ను చూచినంత అందఱును విరాళిఁ జెందక తప్పదు; నిన్ను చూచినప్పుడు సౌఖ్యము కలిగినది. కాని నీదర్శనమే యిపుడు దారుణసంతాపమునకుఁ గారణమైనది' అని విచారించుచుండెను. మాధవుఁడు తనమిత్రునితోఁగూడ వీథిం బడి పోవుచున్నపుడు మేడమీఁద కిటికీనుండి చూచి విరాళిఁ జెందిన మాలతి ఉద్యానవనమునఁ దనచేరువకు వచ్చి నిలిచినపు డెంత యాందోళనపడియుండునో గదా! విరహతాపమున మిక్కిలి పొగులుచున్న యామెకు మాధవసందర్శనమో లేక మరణమో శరణము కాని వేరొక మార్గము లేకుండెను. మాలతి యీవిష యమును దలఁచికొనియే విచారించుచుండఁగా లవంగిక యూర డించుచుండెను.

ఆసమయమునకే అవలోకితతోఁగూడ కామందికి యక్క రకు రాఁగా మాలతియు, లవంగికయు నామెకు నమస్కరించిరి. పిదప వారందరును కూర్చున్నతరువాత కామందికి విచారముతో నున్నట్లు గ్రహించి లవంగిక 'అమ్మా! ఏదో విచారముతో నున్నట్లున్నారు; మీకుఁ గుశలమే కదా!' అని ప్రశ్నించెను.

దాని కామె 'అమ్మాయీ! సంసారులతో ఎక్కువ పరిచయము చేసికొనిన సన్న్యాసినుల కుశలమడుగవలయునా? సంసారులతో స్నేహము లేనప్పుడు మాకు ఆ సంసారు లెట్టి సంబంధ బాంధవ్యములు చేసికొనినను విచారము లేక యుండెడిది.' అని నిట్టూర్పు విడిచి 'పసితనమునుండియు నేను పెంచి పెద్దచేసి ప్రేమించుచున్న మా చెలికత్తెయగు ఈమాలతిని రాజుగారి వేడుకచెలికాఁడగు నందనుఁడు వివాహమాడఁగోరి, రాజుగారిమూలమున ఈమె తండ్రిని ప్రార్థించెనఁట! నందనుఁడు వయసుమళ్ళినవాఁడు; రూపవిహీనుఁడు, తనపుత్రికకుఁ దగనివాఁడు నని కొంచెమైన నెంచక మంత్రిపుంగవుఁడు ప్రభువుతో 'ఏలినవారి కన్యకాజన విషయమున దేవరవారే స్వతంత్రులు' అని పలికి తన యంగీకారమును సూచించెను. ఇయ్యది నాకు మిక్కిలి పరితాపమును కలిగించుచున్నది' అని పలికెను. ఈ ప్రసంగమును విని మాలతి నిశ్చేష్టురాలై 'అయ్యో! దైవమా! మాతండ్రికి నాయందభిమానముకంటె రాజుమాటయందలి గౌరవమే యెక్కువాయెనే! నాకిష్టము లేకున్నను కురూపియు, వయసుమళ్ళినవాఁడునగు నందనుని వివాహమాడవలసియున్నదా యేమి?' అని దుఃఖించుచుండఁగా లవంగిక 'అమ్మా! మీకును మాలతి పుత్రికవంటిది గదా! కాన మీరెట్లయిన నీమె నీయపాయమునుండి తప్పింపవలెను' అని కామందకిని వేడుకొనెను. ఆమెయు 'అమ్మాయీ! ఇందు నేను చేయఁదగిన దేదియును లేదు; వివాహ మొనర్చుట తండ్రియధీనము; అదియు దైవాధీనము! ఇట్టి సందిగ్ధస్థితియందుఁ గన్యకలు గాంధర్వవిధినే తమ వరులను బడయుట మేలు. తొల్లి శకుంతలాదుష్యంతులకును, ఊర్వశీ పురూరవులకును గాంధర

విధినే వివాహములు జరిగినవికదా! తనతండ్రి తన్ను సంజయున కీయఁదలఁపఁగా, వాసవదత్త యావివాహమున కిష్టపడక వత్సరాజగు నుదయనుని పెండ్లాడలేదా? అయినను ఇట్లు తను కోరిన వరుని బెండ్లాడుటకు సాహసము కావలెను' అని పలికి మాలతికిశోకమార్గమును సూచించెను. అప్పుడవలోకిత కామందకితో 'అమ్మా! మన మిక్కడనే ఆలస్యముచేసితిమి. అక్కడ మాధవుఁడస్వస్థశరీరుఁడై యున్నాఁడు; మనము శీఘ్రముగా పోవలెను; రండు' అని పలికెను. లవంగిక ఆమాధవుఁ డెవ్వరయినదియు కామందకిని బ్రశ్నించి; యామెవలన మాధవుని పుట్టుపూర్వోత్తరములను, మాలతీమాధవుల తండ్రుల యొడంబడికలను తెలియఁజేసెను. తాను తగినవానినే ప్రేమించినందులకు మాలతితనలో మిగిలి సంతసించెను.

మాలతితల్లి యొకనాఁడు సౌభాగ్యవర్ధనమునకయి తన కుమార్తెను శంకరుని దేవాలయమునకుఁ బూజార్థము తీసికొని పోయెను. ఆసంగతి కామందకి ముందుగానే తెలిసికొని, తానక్కడికేఁగి పూవులుకోయునెపమున మాలతిని, లవంగికను ఆశివాలయపు టుద్యానవనములోనికిఁ దీసికొనివచ్చెను. కామందకి ముందుగానే మాధవు నాతోఁటలోనికిఁ బంపవలెనని మకరందునికి వార్తఁ బంపెను. మాలతీలవంగికలు వచ్చుటకుమును పే మాధవుఁడు నాకుసుమాకరోపవనములోనికివచ్చి కుబ్జనికుంజముల చేరువఁగలరక్తాశోకవృక్షముల గుంపులోనుండెను. పిదప నచటికి మాలతీ లవంగికలు కామందకితోఁగూడవచ్చి పూవులు కోయుచుండిరి. కొంచెముసేపైనపిదపఁ గామందకిఁ 'పుష్పాపచయమువలన అలసిపోయితివి; ఒకచోటఁ గూర్చుం

డుట మే' లని మాలతితో, బలికి రమ్మని చేరఁబిల్చి రక్తాశోక వృక్షములదాపుననే తన ప్రక్కనుగూర్చుండఁబెట్టుకొని, మాధవునకు వినఁబడునట్లుగాను, రహస్యమని తోఁచునట్లుగను మాధవునివిరహావస్థను, మాలతిని బెండ్లాడవలయుననెడి యాతని యుత్కంఠను తెలిపి, 'నీవు దక్కనిచో నతఁడు ప్రాణములను విడువఁగలఁడు' అని తెలియఁజేసెను. ఆమాటలకు మాలతి మిగుల దిగులొందెను. ప్రక్కనేయున్నలవంగిక 'నిజమునకు మాధవునికంటె మాసఖియే యెక్కువ వంతలపాలగుచున్న దనుచు మాలతి విరహావస్థను మిక్కిలిగా వివరించి చెప్పెను.

మాలతి మాధవునిచిత్రమును వ్రాయుటయు, ఆచిత్రమును జూచి మాధవుఁడా చిత్రముప్రక్కనే మాలతి చిత్రమును వ్రాయుటయు, మాధవుఁడు స్వయముగా గ్రుచ్చి యిచ్చిన పొగడదండను మాలతి కంఠమున ధరించుటయుఁ గూడచూపెను. చెట్లచాటుననుండి వారిసంభాషణను వినుచున్న మాధవుఁడానందసాగరమున నోలలాడుచుండెను.

ఇంతలో బుద్ధరక్షిత యచటికిఁ బరుగెత్తివచ్చి 'రక్షింపుఁడు రక్షింపుఁడు! రాజామాత్యుఁడగు నందనునిసోదరియు మిత్త్రురాలునగు మదయంతి చెలికత్తెలతోఁగూడి వచ్చుచుండఁగా బోనునుండి వెలువడినపులి వారిపై వచ్చుచుండెను. భయపడి పరిచారికలు పారిపోయిరి; 'పులి మదయంతికపైఁ బడుచున్నది.' అని యఱచుచు వచ్చెను. మాలతీలవంగికలు మిక్కిలి కలఁతపడిరి. ఇంతలో చెట్లచాటుననుండి మాధవుఁడువచ్చి 'పులి యెక్కడ? పులియెక్కడ?' అని ప్రశ్నించెను. మాధవుఁ డక్కడే యున్నాఁడని మాలతికి సంతోషముతోఁబాటు బెదరును

కలిగెను. 'ఇదిగో! ఈతోఁట కావలవీథి మొదనున్నది' అని చెప్పఁగా, 'ఈతఁ డావైపుపోవునా? యేమి? అని మాలతి దిగులు పడెను. 'నాయనా! జాగ్రత్తగాపొమ్ము, నీపరాక్రమును జూపుము' అని కామందకి పలికెను. మాధవుఁడు పులియున్న యెడకుఁ బోయెను. కామందకియు మాధవునియొద్ద నుండెను. మాధవుఁడింకను పులినిసమీపించుటకుముందే పులి మదయంతికను సమీపించుటచే ఏమిచేయవలెనో యని మాధవుఁ డలజడిపడు చుండఁగా, ఎదురుగా మిక్కిలి త్వరితగమనమున మకరందుఁడు వచ్చుచుండెను. అతఁడు 'మాలతిని నందనునకిచ్చి వివాహము చేయుటకు నిశ్చయింపఁబడిన' దను ఘోర వార్తను తనమిత్రుఁడగు మాధవునికిఁ దెలుపుటకు మిక్కిలి వేగముగా శివాలయము వైపు వచ్చుచుండెను; అతఁడు తనప్రేయసియగు మదయంతిక పయి పులిపడుచుండుట చూచి, ఆ వారినివచ్చుచున్న యొకని చేతికత్తినిలాగి, దానితో పులిని గొట్టెను. పులియు నతనిపయిని బడెను; కాని ధైర్యముగల మకరందుఁడు దానిని మరల కొట్టి నేలపైఁ బడవేసెను. కాని పులిచే దెబ్బతినినమకరందుఁడు శరీరముర క్తసిక్తము కాఁగా మూర్ఛపోయెను, మాధవుఁడు మిక్కిలి దిగులొంది మూర్ఛపోయెను. వారిరువురిని రక్షింపవలెనని మాలతీమదయంతికలు కామందకిని ప్రార్థింపఁగా ఆమె తన కమండలువులోని జలమును వారి ముఖములపైఁజల్లి, వారిరువురికిని విసరవలెనని మాలతీమదయంతికలకుఁ జెప్పఁగా వారట్లే చేయసాగిరి. కొంచెము సేపటిలోనే మాధవమకరందులు స్వాస్థ్యముఁ బొందిరి. మాధవమకరందు లొకరినొకరు కౌఁగిలించుకొని యానందించిరి. ఇదివరకును బుద్ధరక్షిత తనతో నపుడపుడు

వర్ణించిచెప్పుచు వచ్చినమకరందుఁడే తన్ను రక్షించి ప్రాణము లపై తెగించి సాహసముచూపినందులకును, వ్యాఘ్రిముచే గట్టిదెబ్బలుతినియు నపాయస్థితిని తప్పించుకొన్నందులకును మద యంతికమనసులో దైవమును వేనోళ్లఁగొనియాడెను. మఱియు నినుమడించిన యనురాగముతో మకరందునిఁ గన్నులారఁ గాంచుచు నానందించుచుండెను.

మాలతి మాధవునిలలాటము స్పృశించుటవలననే ఆత నికిఁ దెలివివచ్చెను; ఇట్లతఁడు బ్రతుకుట కామెయే కారణ మయ్యెను; ఈసమయమున కామందికి 'వత్సా! మాధవా! మాల తియెడ ఎక్కువప్రేమగల్గియుండుము' అని కోరఁగా మాధవుఁడు 'అమ్మా! మిత్రునిసాహసమును ఆపదను గనులారఁగాంచి కలఁ తచే మూర్ఛపోయిన నాకుఁ దెలివితెప్పించిన ఈమెకు నాహృద యమునే కాదు; జీవితమునుకూడ ధారపోయుచున్నాను' అని పలికి యందరికిని సంతసమునుగూర్చెను.

మకరందుఁ డాసమయమున నంత తొందరగా వచ్చు చుండుటకుఁ గారణమేమని కామందకి యడుగఁగా ఉద్వేగకార ణమైన యొకవార్తను మాధవునికి సంబంధించినదాని నాతనికిఁ దెలియఁ జేయుటకుఁ దొందరగా రావలసివచ్చిన' దని మకరం దుఁడు పలికెను. ఆకారణమును తెలియఁజేయనుండఁగా ఒక పురుషుఁడు తొందరగా నచటికివచ్చి మదయంతికతో నిట్లు పలికెను. 'అమ్మా! మీయన్నగారు నీతో నిట్లు చెప్ప నాజ్ఞా పించియున్నారు. 'సోదరీ! అమాత్యభూరివసువుపుత్రిక యగు మాలతిని నాకిచ్చి వివాహమొనర్చునట్లు రాజుగా రేర్పాటు చేసియున్నారు. ఆవేడుకలో పాల్గొనుటకు నీవు వెంటనే రావ

లేను అని.' 'నేను నీకుఁ జెప్పదలంచినవా ర్తయు నిదియే' అని మకరందుఁడు మాధవునితో చెప్పెను. మాలతీమాధవు లీవా ర్తను విని వెలవెలపోయిరి.

మదయంతిక యొక్క వసంతోత్సవముతో మాలతింజూచి 'చెలీ! మాలతీ! మన మిరువురము నొక్కనగరముననే పుట్టితిమి; పసితనమునుండియు నొక్కయెడనే కలిసిమెలిసి యాడు కొనుచుంటిమి; మనమైత్రి యద్వితీయమైనది; నా చెలివగు నీ వ్పుడు నాకు వదినెవయి; మాయింటి కలంకారమగుట ముదావహము' అని పలికెను. కామందకి తనమనసులోని భావము వ్యక్తముకానీయక 'అమ్మాయీ! మదయంతికా! మాలతి మీవదినెగారగుటచే మీయదృష్టము ఫలించినది' అని పలికెను. 'ఇది మీయాశీర్వచనప్రభావము!' అని మదయంతిక జవాబిచ్చి బుద్ధరక్షితతో 'చెలీ! ఉత్సవమునఁ బాల్గొనుటకుఁ బోవుదము. రమ్ము' అని, యామెయు తనతోఁబాటు లేచి నిలిచి కదలుటకు సిద్ధముగా నుండఁగా కనులార నొకసారి మకరందుని జూచెను. మకరందుఁడును ఆమెను తనివితీరఁగాంచెను. కామందకియు, లవంగికయు దీనిని కనిపెట్టిరి. మదయంతికా బుద్ధరక్షితలు ఆవచ్చినమనుష్యునితోఁగూడ పోయిరి.

అంత మాధవుఁడు ఈసంఘటనకుఁ గలఁతపడి 'మృణాళ తంతువువలెనున్న నాయాశాలత నేటితోఁ దెగిపోయినది; మాలతి యిష్టపడకపోయినను ఈవివాహము జరుగుట తప్పదు; ఇఁకవిచారించిన నేమిఫలము?'అనియనుకొనుచుండఁగా కామందకి యతనికి ధైర్యముచెప్పఁదలఁచి 'వత్సా! ఇట్లు జరుగదు. రాజు గారికి తనకన్యలపయి అధికారముండును; కాని ఇతరులకన్యల

పయి అధికారము లేదు. వచ్చినయనుష్యుఁడును ఆపంగతినే తెలిపియున్నాఁడు. మంత్రి భూరివసుఁ డిదివఱకు పలికెనని వినిన 'నిజకన్యకాజనముపైఁ బ్రభువులకు స్వాతంత్ర్యముకల' దని పలికినమాటల యంతరార్థము నిదియే;నందనునకు మాలతి నిచ్చువిషయమున రాజుగారి కెట్టియధికామును లేదు. కన్యకలవివాహమున రాజులదే యధికారమనియే ధర్మశాస్త్రము నందును చెప్పఁబడలేదు. నీవు నామాట నమ్ముము; ధైర్యము నవలంబింపుము. నేను జాగ్రత్తలోనే యున్నాను; నాప్రాణము లను ధారపోసియైన మిమ్మిరువురిని గూర్పక మానను' అని పలికెను. మకరందుఁ డామెతో 'అమ్మా! సంసారముతో సంబంధము లేనియాశ్రమమును స్వీకరించినను శిశువులమైన మాయెడ మీమనస్సు దయకలదగుట ఎంతయు సంతోషకరము; మమ్ము రక్షించుభారము మీదే; మాయెడఁ బ్రసన్నురాలవుకమ్ము' అని పలికెను. ఇంతలో రాణిగారిసెలవైనదని యొకవార్తాహరుఁడు వచ్చి చెప్పఁగా కామందకి మాలతితోఁగూడ నేఁగెను; పోవు నపుడు మాలతి మాధవుని తిరిగితిరిగి చూచుచునే పోయెను.

మాధవుఁడు తనలో 'అయ్యో! మాలతితోడి నాప్రణయ మేవిధముగా పరిణమించెనే! ఏమిచేయుదును? కామందకి పలికినమాటలు కేవల మూరడింపునకే యుపయోగించును; మాలతి యెట్లును నాకు దక్కఁజాలదు. నాబ్రతుకిఁక వ్యర్థమైనది! నరమాంసము నమ్ముచు శ్మశానములఁ దిరుగుచు విరాగిగానుండుటయే యిఁక మీఁదఁ గర్తవ్యము' అని యనుకొనుచు, ప్రకాశముగా మకరందునితో 'మిత్రమా! నీవు ధైర్యముతో నుండుము. మదయంతిక నీకు లభింపఁగలదు;

ప్రాణదాతవగు నిన్ను విడిచి యామె యితరుల నెంతమాత్రము వివాహమాడదు; గుఱియు నామెకు నీయెడఁగల్గిన యను రాగము వృద్ధిచేయుటకు బుద్ధరక్షిత యుండ నేయున్న దికదా!' అని ధైర్యము చెప్పి 'లెమ్ము' మనము పారాసింధునదుల సంగమమున స్నానము నొనరించి యూరిలోనికిఁ బోవుదము రమ్ము' అని పలుకుచు నతనితోఁ బోయెను.

తా నిదివఱకు నిశ్చయించుకొనినరీతి నే మాధవుఁడు మాలతి తనకు దక్కదనునిరాశతో విరక్తుఁడై శ్మశానములో భూతప్రేతపిశాచములకు నరమాంసమును విక్రయించుచుండెను. ఆశ్మశానము ప్రక్కనే కరాళశక్తియను చాముండికయొక్క యాలయము కలదు. ఆయాలయమునందే అఘోరఘంటుఁడు కాపాలికుఁడు మంత్రసాధన యొనర్చుచుండెను. అఘోర ఘంటుఁడు తనమంత్రసిద్ధికయి నరబలినీయ నిశ్చయించి 'ఈ యూరిలో నందకత్తెయగు నొకకన్యకారత్నమును తీసికొని రావలె' నని తనశిష్యురాలగు కపాలకుండల కాజ్ఞయిచ్చెను. మాయాశక్తిసంపన్నయగు నాకపాలకుండల సౌధమున నొంటరిగా నిద్రించుచున్న మాలతిని కరాళశక్తియాలయమునకుఁ దీసికొనివచ్చెను.

అఘోరఘంటుఁడు మాలతిని వధ్యచిహ్నములతో నలంకరించి దేవియెదుట నుంచి తనదేవతాపూజను నిర్వర్తించుచుండెను. మాలతి తనకు మృత్యువాసన్నమయినదని గ్రహించి 'హాతండ్రీ! హాతల్లీ! చిన్నప్పటినుండియు పెంచి వాత్సల్యము తోఁ జూడబడిననేను దిక్కులేక మరణించుచున్నాను. అమ్మా! కామందకీ! నన్ను ప్రాణముగాఁ జూచుకొనుచుఁ

నా క్షేమముకొఱకయి నీపనులన్నియు విడిచి లెక్కలేని శ్రమలఁ బడుచున్న నీశ్రమలన్నియు నేటితో వృథా యయ్యెను! చెలీ! లవంగికా! ఇఁక నీవు నన్ను చూడఁజాలవుకదా!' అని గొంతెత్తి విలపించుచుండెను. అట తిరుగాడుచున్న మాధవుఁడా మాలతికంఠస్వరము నానవాలుపట్టి 'ఏమి! మాలతి యిచటికి వచ్చియుండుట సంభవమా?'అని యనుకొనుచు దేవాలయము చేరువకువచ్చి లోనున్నయామెం గాంచి యామె మాలతి యగుట నెఱింగి యామెయవస్థకు మిగుల విచారించెను.

అప్పటికి శక్తిపూజ సమాప్తమైనందున కడసారిగా దైవమును ప్రార్థించుకొమ్మని కపాలకుండల మాలతితోఁ బలికెను. మాలతి 'ప్రాణనాథా! మాధవా! నేను మరణించినను, నన్ను మఱచిపోవలదని ప్రార్థించుచున్నాను. మరణించినవారిని వారిప్రియులు తలఁచుచుందురేని యాచచ్చినవారు జీవించినట్లే భావింపఁబడుదురు' అని పలికెను. అప్పుడు అఘోరఘంటుఁడామెను జంపుటకు కత్తినెత్తగా మాధవుఁడు త్వరితముగా మాలతియొద్దకువచ్చి యామెను తనచేతుల లోనికిఁ దీసికొని 'ఛీ దుర్మార్గుఁడా! చెడ్డకాపాలికుఁడా! నీయాట లిక్కడ సాగవు పొమ్ము' అని అఘోరఘంటుని గద్దించి యతనిచేతిలోనికత్తిని లాగుకొనెను. మాలతి 'నాథా! రక్షింపుము, రక్షింపుము' అని పలుకుచు మాధవుని కౌగిలించుకొనెను. 'నీ విక్కడి కెట్లువచ్చితివి?' అని మాధవుఁ డడుగఁగా మాలతి 'నాకేమియును దెలియదు; నేను మేడమీఁదిడాబామయి పరుండి నిద్రించితిని; మెలకువవచ్చునప్పటికిచ్చట ఈస్థితిలోనున్నాను' అని బదులుచెప్పెను.

ఇంతలో నక్కడ మేడమీఁద నిద్రించినమాలతి కానరాకపోఁగా మాలతి తలిదండ్రులు మిగుల కలఁతఁజెంది గోలపెట్టిరి. త్రికాలవేదినియగు కామందకి వారి నూరడించుచు 'మాలతిని కపాలకుండల శ్మశానసమీపమందలి కరాళదేవి గుడికిఁ దీసికొనిపోయెననియు, అఘోరఘంటుఁడు మాలతిని దేవికి బలిసీయ నున్నాఁడనియు, సత్వరముగా నచటికి మనుష్యులను బంపి గుడినిముట్టడింపవలెననియు తెలిపెను. మంత్రియాజ్ఞ ననుసరించి వెంటనే కొందఱుసైనికు లాగుడిని ముట్టడించిరి. మాధవుఁడు మాలతిని కొంచెము దూరముగా నుంచి, సాహసించి మీఁదికివచ్చు నఘోరఘంటునితోఁ బోరి యాతనిని సంహరించెను. మాలతి సుఖముగ తనయిల్లుచేరెను. కపాలకుండల యెట్లో తప్పించుకొని తనగురువును చంపి మహాపకారముచేసిన మాధవునికిఁ దగినశాస్తిచేసి కసితీర్చుకొనుటకు ప్రతినపట్టెను.

పిదప రాజుగారు నందనునిఁ బెండ్లికొడుకునుగావించి మాలతీవివాహార్థము భూరివసునియింటికిఁ దరలి రానుండిరి. మాలతిని బెండ్లికుమార్తెను జేయుటకుముందు నగరదేవత కామెచే మ్రొక్కింపవలెనని కామందకి మాలతితలిదండ్రులతోఁ జెప్పి వారియంగీకారముసుపొంది దానికి వలయుసన్నాహములఁ జేయించెను. ఆయోగిని యంతకుముందే 'మీరిదువురును నగరదేవతగర్భగృహములోనికి ముందుగాఁబోయి రహస్యముగా నుండవలె' నని మాధవమకరందులకు వర్తమానముంపఁగా వారు నామెచెప్పినట్లే చేసిరి. కొంతసేపటికి మహావైభవముతో మాలతి యేనుఁగునెక్కి లవంగికతోను, కామం

దకితోను గుడివద్దకు వచ్చి, ఏనుఁగునుండి దిగెను. ఆసమయమున ప్రతీహారి యొక్కతె వస్త్రాభరణాదులుంచుకొను పెట్టెతోఁగూడ నచటికివచ్చి కామందకితో 'అమ్మా! పెండ్లికుమార్తెయగు మాలతి నలంకరించుటకయి ప్రభువులే వస్త్రాభరణములను మహామంత్రులవారియింటికి పంపిరి. మంత్రిగారు నగరదేవతయెదుటనే మాలతిని వీనితో నలంకరింపవలసినదని యిచటికి పంపియున్నారు' అని పెట్టెతెఱచి 'ఇదిగో పట్టుచీర; ఇదిగో పట్టురవిక; ఇవిగో నగలు! ఇదిగో ముత్యాలహారము; ఇవిగో అగరు చందన పుష్పములు' అని వేర్వేఱుగా చూపి యిచ్చెను. 'అట్లే యలంకరింతుమని అమాత్యులతోఁ జెప్పుము' అని కామందకి ప్రతీహారిని పంపివేసెను. అట్లు పంపివేసి యామె లవంగికతో 'లవంగికా! నీ వీమాలతిని దీసికొని గర్భగృహములోనికిఁ బొమ్ము. నేనును ఈ యాభరణములలోని రత్నముల మంచిచెడుగులను కొంచెము పరిశోధించి వత్తు' నని పలికి మాలతీలవంగికలను గుడిలోనికిఁ బంపివేసెను. గర్భాలయములోని కేఁగినపిదప లవంగిక పసుపు, కుంకుమ, పూవులు మాలతి చేతికిచ్చి దేవిని పూజింపఁగోరెను. కాని మాలతి దాని కిష్టపడక 'చెలీ! నాకనిష్టమగు వివాహము జరుగుచున్నపుడు, దానికయి నేను దేవి నెట్లు పూజింప నిచ్చగింతును? న న్నీవిషయమున నిర్బంధింపవలదని ప్రార్థించుచున్నాను. ఈపనివలన నాకాయాసమే కాని, శాంతికలుగఁజాలదు. చెలీ! మఱియొకసంగతి! నీవు నాకుఁ జిన్ననాటినుండియు హితురాలవు నా ప్రాణసఖివి. కావున నేను మరణింప నిశ్చయించినదాననై నిన్ను ప్రేమపూర్వకముగఁ గౌఁగిలించుకొని ప్రార్థించుచున్నాను; నాయెడ నీకభిమానమే

యున్నయెడల నన్ను మఱువకుందువనియు నానిమిత్తమై ప్రియ మాధవుఁడు ఎక్కువదుఃఖింపకుండునట్లు చూచుచుందువనియు నమ్ముచున్నాను. నాప్రాణదాతయగు మాధవుఁడు నామరణానంతరము నాకై విచారించుచుఁ కృశింపకుండునట్లును నన్ను మఱువకుండునట్లును చూచుటయే నీవు నాకొనర్పఁదగిన మహోపకారము' అని పలికెను. 'ఇట్టిమాటలు పలుకవలదు; నేను వినఁజాల' నని లవంగిక పలుకఁగా, మాలతి 'నిరాశాపూరితహృదయనైన నాకు ఇఁక సాంత్వనవచనములతోఁ బ్రయోజనములేదు; దయయుంచి నీవు నాప్రయత్నమున కడ్డము రాకుము' అని యామెపాదములపైఁ బడెను; మాలతి కన్నులు నీరుగ్రమ్మి జగమంతయు నామె కంధకారమయమయి యుండెను.

ఆగర్భాలయమున మకరందునితోఁగూడ రహస్యముగా నున్న మాధవుఁ డీ ప్రసంగమును విని, తనపయి మాలతికిఁగల యనురాగాతిశయమునకు పొంగిపోవుచుండఁగా లవంగిక తన యున్నస్థానమునకు రమ్మని మాధవునకు సైగచేసెను; అతఁడు వచ్చి లవంగికకు బదులుగా నిలిచెను; లవంగిక దూరముగా తొలఁగెను. అప్పుడు మాలతి తాను లవంగికపాదములపై నే పడియున్నట్లు భావించి 'సఖి! ఇదిగో నీకు నమస్కారము చేయుచున్నాను. నాకోరిక నెఱవేర్చి నన్ను కరుణింపుము' అనుచుండఁగా, మాధవుఁడు మెల్లగా 'చెలీ! నీవేల యాయాసపడెదవు? నీమాటయే కానిమ్ము; లేచి నన్నొకసారి కౌఁగిలించుకొనుము' అని పలుకఁగా మాలతి యట్లేచేసి మాధవాలింగనసౌఖ్యమునఁ బరవశురాలయ్యెను; మఱియు 'చెలీ! నన్నను

గ్రహించితివికదా! ఆశలన్నియు నశించినవని ప్రాణనాయకునితోఁ బలుకుము; అతనిచే గ్రువ్వఁబడి ప్రేమతో నీయఁబడిన యీవకుళమాలికను ప్రేమతో నాకుమాఱుగాఁ జూచుకొనుచు కంఠమున నెల్లపుడును ధరింపు' మనుచు తనమెడలో నున్న పొగడదండను దీసి మాధవుని మెడలో వేయుచు, ముఖమువైపుచూచి యాతఁడు తననాథుఁడే యగుటచే సిగ్గుపడి, దూరముగా జరిగి 'లవంగికా! ఇట్లు నన్ను మోసపుచ్చితివా?' అని పలికెను. మాధవుఁడు 'ప్రేయసీ! నీవు వేదననే చూచుకొంటివికాని నాబాధను కనిపెట్టవైతివిగదా!' అనెను. అపుడులవంగిక మాలతిపాణిని గ్రహింప మాధవునికి సూచింపఁగా 'కన్యకలయాచారమునకు విరుద్ధమగు నీకార్య మకార్య' మని మాలతి యనుకొనుచుండఁగా నటకు కామందకి వచ్చెను. ఆమె మాలతితో 'బిడ్డా! నీకొఱకీతఁడును, ఈతనికొఱకు నీవును పెక్కుయవస్థల పాలగుచుండియు నిప్పుడీ యాలస్యమేల?' అని బలికి మాధవునితో, 'నాయనా! సమస్తసామంతమస్తక కిరీటరత్నరంజితపాదుఁడగు అమాత్యభూరివసుని యేకైకపుత్రికారత్న మీమాలతి; ఈమె నీకొఱకే బ్రహ్మచే సృజింపఁబడినది; మన్మథుఁడు నీమెను నీకే సమర్పించెను; ఇపుడు నేను నీమెను నీకు దానముచేయుచున్నాను; గ్రహింపుము' అని మాలతిచేతి నాతనిచేతిలో నుంచి 'మీరిరువురు నన్యోన్యానురాగమున వర్ధిల్లుఁడు' అని దీవించెను. పిదప వారిరువురికిని సదుపదేశముచేసి 'మీరిరువురు నిక్కడినుండి, యీచెట్లచాటుననుండిపోయి మా విహారము వెనుకనున్న యుద్యానవనమునకుఁ బొండు; అచట మీవివాహమునకుఁ గావలసినవస్తుసామగ్రి కూర్పఁబడి

యున్నది; కావలసినయేర్పాటు లిదివఱకే చేయఁబడియున్నవి, అచటకు పొండు; మకరంద, మదయంతికలును అచటికే రాఁగలరు. వారు వచ్చువఱకును మీరచట వేచియుండుఁడు' అని పలికి వారినిపంపివేసెను. మాలతి నలంకరించుటకుఁగాను రాజుగారుపంపిన వివాహాలంకారముతో మకరందునికి మాలతి వేషము వేయించి, ఆమాయామాలతితోను, లవంగికతోను భూరివసువునింటికిఁ బోయెను.

పిదప మాలతీవేషముతోనున్న మకరందునికిని, నందనుని కిని వివాహముజరిగెను. కామందకి నేర్పువలన రహస్యము బయటపడలేదు. గృహప్రవేశార్థము మాయామాలతి నంద నునియింటికిఁ దీసికొనిరాఁబడెను. పిదపఁ గామందకి యచటఁ జేయవలసినకార్యవిధానమును బుద్ధరక్షితకును, లవంగికను ఉపదేశించి తనయాశ్రమమున కేఁగెను. నాఁటిరాత్రి శయ్యా గృహమున నందనుఁ డెంత వేఁడుకొనినను మాయామాలతి యతనికి స్వాధీనురాలుకాలేదు. నందనుఁడు బలవంతము చేయఁబోగా, మకరందుఁ డాతనిని గట్టిగా త్రోసివేసెను. అందుపై నాతఁడు మిగుల కోపించి 'ఈతుచ్ఛురాలు చిన్న తనమునుండియు చెడునడతగలది, ఇఁక దీనిసంగతియె త్తిన నొట్టు' అని ప్రతిజ్ఞచేసి శయనాగారమునువిడిచి వెడలిపోయెను. అప్పుడు కొంతరాత్రిగడచుటచే లవంగికయు, బుద్ధరక్షితయుఁ దప్ప తక్కినవారందఱును పగటిపూట జరిగినయుత్సవమున నలసి గాఢనిద్రాపరవశులయియుండిరి. నందనుఁడు పడకటిల్లువిడిచి పెట్టుటను గనిపెట్టి, యీనెపముననే మదయంతికను మకరందుని యొద్దకుఁ దీసికొని రాఁదలఁచి యామెయొద్దకుఁబోయి నంద

నుఁడు బలాత్కారముచేయఁబోఁగా మాలతి కోపించినదనియు, నందువలన నందనుఁ డలిగి శపథముపట్టి పడుకటిల్లు విడిచి యెటకోపోయెననియుఁ దెలియఁజేసెను. మదయంతిక అదివిని యచ్చెరువంది 'కొంటెపిల్ల యగుమాలతికి బుద్ధిచెప్పి దారికిఁ దెత్తము; రమ్ము' అని బుద్ధరక్షితనుగూడ తనతోఁ దీసికొని పడుకటింటిలోనికి వచ్చెను. వారిరాక కనిపెట్టి గుమ్మమువద్ద కాచుకొనియున్న లవంగిక ముసుగుతన్ని మాటలాడకుండఁ బరుండుమని మకరందునకు బోధించెను. మకరందుఁడు ముసుగు తన్ని పరుండఁగా చూచి మదయంతిక లవంగికతో 'చెలీ! మీసఖి నిదురించుచున్నట్లున్నదే!' అని పలుకఁగా నామె చెలీ! ఆమె నిప్పుడే లేపకుము. మీయన్నగా రొనర్చిన యవమానమునకుఁ గలఁతపడి కోపించిన యీమె యిప్పు డిప్పుడే కొంచెము శాంతపడి నిద్రించినది; కాని నీవు వెళ్ళఁగా, మంచముపై నొకప్రక్క కూర్చుండుము' అని పల్కెను. దానికి మదయంతిక 'ఏమీ! యీపెంకెపిల్లమనస్సు కలఁతపడినదా? పాపము!' అనఁగా లవంగికకుఁ గోపమువచ్చెను. బుద్ధరక్షితయు మదయంతికతో 'అమ్మాయీ! ఇది యాలోచింపుము. భర్త ప్రార్థించినను క్రొత్తపెండ్లికూతురు లొంగకుండుటకు సిగ్గు కారణమగును; అది గ్రహింపక భర్త నిర్బంధముగా బలాత్కారింపఁగా కోపించుటయు నవవధువులకు సహజము. నీభర్త మాలతిని దుర్భాషలాడుట న్యాయముకాదు. కుసుమకోమల స్వభావలగు వనితలను కోమలస్వభావముననే వశపఱచుకొనవలెనుగదా! 'చిన్నతనమునుండియు కుంటయగు నీమెతో నాకేమిపని ?' అని నీసోదరుఁడు పలుకుటవలన కన్యాబంధువుల

కను చాలకష్టముగా నుండునుగదా!' అని పలికెను. దానికి మదయంతిక 'మాయన్న సులభక్రోధుఁడు; తొందరస్వభావముఁ గలవాఁడు. కాని మీరును భర్తవిషయమయి అనుకూలముగా నుండునట్లు మాలతికి బోధించుట న్యాయముకదా! చూడుఁడు! మాలతికి మాధవునియెడ ననురాగ మున్న దని ప్రతీతి. వారి హావభావములనుబట్టియు, నప్పుడు పులియల్లరిలో మూర్ఛ వోయినమాధవు నాశ్వాసించుటకయి యామె శుశ్రూష చేయుటఁ బట్టియు నామె కాతనియెడ గాఢానురాగ ముండుటను మన మును గనిపెట్టియున్నాము. ఇట్టి వేఱయిన మాయన్న విని యుండవచ్చును.' అని పలికెను. అంత లవంగిక 'మాచెలిపై నేరము లేదు. మూర్ఛపడినవానికి శుశ్రూషయొనర్చుట యొక తప్పుకాదు. ఆసమయమున నీవును మకరందునికి శుశ్రూష చేసితివిగదా! మీయిరువురిహావభావములును వ్యక్తమైనవిగదా!' అని ప్రసంగమును మార్పసాగెను. మదయంతికకు మకరందునిపై మనసువారి 'అహాహా! ఆతనిపేరు మకరందుఁడా! ఎంత చక్కనిపేరు! అతఁ డెంతమంచివాఁడు! తనజీవితమునుగూడ లెక్కచేయక, యతఁడు నన్ను పులినోటినుండి రక్షించినాఁడే! ఎంతదయామయుఁడు!' అని పలికి నిట్టూర్పునిగిడించి వేదనపడ సాగెను. బుద్ధరక్షిత యామె శరీరము చెమటపట్టుటఁ గాంచి 'మకరందుని ప్రసంగమువలన నిట్లయితివి.' అనఁగా 'అట్లు కాదు; మాలతిప్రసంగమునుబట్టి' అని మదయంతిక పలికెను. అంత లవంగిక 'చెలీ! ఇఁక దాచకుము; మమ్ము కప్పిపుచ్చుట సాధ్యము కాదు; ఇచట నున్న మనమందఱము నొక్కటియే; భేదములేని వారము; కావున నీకు మకరందునియెడ నెట్టియభిప్రాయము

కల్గినదియు వివరించి చెప్పుము.' అని బుజ్జగింపగా మదయంతిక వారికిఁ బొంగిపోయి తన కాతనియెడ గాఢానురాగము కలిగినదియు, అతఁడు లభింపనిచో తనజీవితమే వ్యర్థమనియు వివరించెను. మకరందుఁడు ముసుగులోనుండి యదియంతయు వినుచు మిగుల సంతసించెను. అంత బుద్ధరక్షిత 'ఒకవేళ మకరందుఁడు నీయెడ కంటఁబడినయెడల నేమి చేసెదవో, తెల్పుము.' అని ప్రశ్నింపఁగా 'ఆ మహానుభావునిఁ గన్నులారఁ గాంచి యానందించి స్వాధీనమయ్యెదను' అని మదయంతిక జవాబిచ్చెను. 'ఈ సంగతిని మఱచిపోయెదవుసుమీ!' అని బుద్ధరక్షిత యామెను హెచ్చరించెను.

అప్పుడు రెండవజామయినదని తెలుపు నగారా వినఁబడినంతనె మదయంతిక 'చాలరాత్రియైపోయినది; మాయన్నను బెదరించిగాని బతిమాలిగాని యచటికిఁ దీసికొనివత్తును.' అని లేవఁబోవుచుండఁగా మకరందుఁడు ముసుగుతొలగించి యామె హస్తమును బట్టుకొనెను. మదయంతిక 'సఖి! మాలతీ! లేచితివా?' అని యనుచు నామెవైపు చూచి మకరందుఁడగుట తెలిసికొని సంతోషమునను, భయమునను రిచ్చవడి యుండఁగా మకరందుఁడు 'నేను నీదాసుఁడ నగు మకరందుఁడను; భయపడకుము.' అని యోదార్చెను. బుద్ధరక్షిత 'మదయంతిక నీనిమిత్తమై విరాళిఁజెందుచున్నది; ఈమెను పరిగ్రహింపుము.' అనుచు నతనిచేతిలో మదయంతికచేతి నుంచి యప్పగించెను. మఱియు 'మనము శీఘ్రముగా నిటనుండి మాలతి యున్న చోటికి రహస్యముగాఁ బోవలె' నని పలుకఁగా 'ఏమి! మాలతి తనపంతమును నెగ్గించుకొన్నదా?' అని మదయంతిక

యెడుగ 'ఔ' నని బుద్ధరక్షిత జబాబిచ్చెను. పిదప వారందరును దొడ్డిదారిని వీధిఁబడి మాలతీమాధవులున్నయెడకుఁ బోసాగిరి.

అచ్చట బౌద్ధవిహారము వెనుక నున్న యుపవనములోని చెఱువుగట్టుపయినున్న రాతిపలకపయి మాలతీమాధవులును అవలోకితయును గూర్చుండియుండిరి. మాలతి ప్రణయకలహముచే మాధవుఁడు మాటలాడించినను జబాబీయక మౌనముపలంబించియుండెను. ఆమెను మాటలాడించుటకు మాధవుఁడును, అవలోకితయును బహుప్రకారముగాఁ బ్రసంగించుచు యత్నించుచుండఁగా మాటలధోరణిలో లవంగిక మాటవచ్చెను. మాలతి యప్పుడు శత్రువునింటఁ జిక్కియున్న తన ప్రియసఖి తలఁపునకు రాఁగా, ఆమె యేమికడగండ్లుపడుచున్నదో యని దిగులొంది దుఃఖము పొంగిపొరలఁగా వలవలయేడ్చెను. 'ఏల యేడ్చుచున్నావు?' అని యవలోకితయు, మాధవుఁడు నడుగఁగా మాలతి తనదుఃఖకారణమును తెలిపెను. మాధవుఁడు 'ఇందుకే యింతవిచారమా! ఆమెయు తక్కినమనవారందఱు నీసరికి వచ్చుచునేయుందురు. నందునింట జరుగుచున్న విశేషములను దెలిసికొనివచ్చుటకై యిదివఱకే కలహంసుని బంపియున్నాము కదా!' అని యామెతోఁ బలికి, 'మకరందునికి మదయంతిక లభించియుండునా?' అని యవలోకితను ప్రశ్నించెను. దానికామె 'సందేహమేల? తప్పక లభించియే యుండును. ఆవిషయమున బుద్ధరక్షిత తగుప్రయత్నములొనర్చుచునే యుండును.' అని జబాబిచ్చెను. మాధవుఁ డుత్సాహముతో 'మదయంతిక మకరందునకు లభించె ననువార్త చెప్పినవారికి నాప్రాణప్రదమగు

నీవకుళమాలికను — మాయిరువురియనురాగమునకును మూల కారణమైనదానిని బహుమానముగా నిచ్చుచున్నా' నని పలికెను. అప్పు డవలోకిత 'ఎవ్వరో వచ్చుచున్నట్లు కాలిచప్పుడు వినవచ్చుచున్నది.' అని పలుకఁగా, మాధవుఁడు చూచి 'కలహంసుఁ డదిగో వచ్చుచున్నాఁడు.' అని మాధవుఁడు పలికెను. మాలతియు నావైపు తేఱిపాఱఁజూచి కలహంసునివెనుకవచ్చుచున్న మదయంతిక నానవాలుపట్టి 'అదిగో! మదయంతిక! నాథా! మకరందునకు మదయంతిక దక్కినది' అని సంతోషముతో నడిచెను. అందులకు మాధవుఁడు సంతసించి, తన కా శుభవార్త తెచ్చినవారికి వకుళమాలికను బహూకరించెద నని యిదివఱకే చెప్పియున్నందున ఆపూలమాలను సంతోషముతో మాలతిమెడలో వైచెను. అవలోకిత బుద్ధరక్షితవచ్చుచుండుటం గాంచి బుద్ధరక్షిత తనకార్యమును నిర్విఘ్నముగా నెఱవేర్చిన దని సంతసించెను. మాలతి తనప్రియసఖియగు లవంగికవచ్చుటను గాంచి సంతసించెను.

అంత కలహంసుఁడు, మదయంతిక, బుద్ధరక్షిత, లవంగికయు నచటికి వచ్చిరి. స్త్రీజనము మాధవుం జూచి 'రక్షింపుము, రక్షింపుము. మమ్మందఱిని మకరందుఁడు దీసికొనివచ్చుచుండఁగా నగరరక్షకభటు లనుమానించి, యాతనిని ముట్టడించిరి; కలహంసుఁడు దారిలోఁ గలియుటచే వానితోఁగూడ వచ్చితిమి.' అని పలుకఁగా కలహంసుఁ డందుకొని 'మేము వచ్చుచు పెద్దకలకలమును వింటిమి. మఱికొందఱు రక్షకభటులు వెనుకటివారితోఁ జేరియుండవలెను.' అనెను. మాధవుఁడు మదయంతికను జూచి 'అమ్మా! నీకు క్షేమమా!

మా యింటికి నీవలంకారమువైనందులకు సంతోషము. ఇదిగో స్వాగతము! నీవేమియు దిగులుపడకుము. నేనిదే, పోయి మకరందుని విడిపించుకొనివచ్చెదను.' అని తక్కినవారితో 'మీరు భయపడవలదు. శార్దూలమును సంహరించినమహాశూరుఁడు మకరందుఁడు. ఆతని నెందఱు ముట్టడించినను భయము లేదు. నేను నచటికే పోవుచున్నాను.' అని కలహంసునితోఁ గూడ పోయెను.

ఈవృత్తాంతమును కామందకికిఁ దెలుపుటకు మాలతి యవలోకితను, బుద్ధరక్షితను బంపివేసెను. 'విరోధులతోఁ బోరు నపుడు జాగ్రత్తగా నుండవలె నని ప్రార్థన.' అని మాధవునికి దెల్పుటకయి లవంగికను బంపి, యామె యెప్పటికిని దిరిగి రాక పోఁగా 'కొంచెము ముందున కేఁగి చూచివచ్చెదనుగాక!' అని మదయంతికను విడిచి కొంచెము వృక్షమార్గమున ముందునకుఁ బోయెను. మాధవుని కపకార మొనర్చి పగసాధింపఁ దలఁచి, పొంచి యుండి సమయమును నిరీక్షించుచున్న కపాలకుండల-అఘోరఘంటుని శిష్యురాలు-తనకు మాధవుని ప్రియురాలు మాలతి యొంటరిగా లభించినందున ఆమెను శ్రీశైలమునకుఁ దీసికొనిపోయి, ముక్కలు ముక్కలుగాచేసి చంపి, తన్మూలమున మాధవున కపకారము చేయఁ దలఁచి యామెనుపట్టుకొని శ్రీశైల మార్గమునఁ బోయెను.

తన్ను విడిచి, కొంచెము ముందు కేఁగినమాలతి వెనుకకు రానందున మదయంతిక మాలతిని వెదకుచు ముందుపోఁగా, ఆమెకు లవంగిక యెదురుపడెను. వీరిరువురును కొంతసేపు వెదకిరి; కాని వారికి మాలతి యెక్కడను గన్పడ లేదు.

ఇది యిట్లుండఁగా, మకరందుఁడు నందనునివివాహమున కడ్డుపడె ననియు, మదయంతికను గొంపోయె ననియుఁ దెలిసి, పద్మావతీపురాధిపతి మిగుల కోపించి, యాతనిం బట్టుకొనుటకు కాల్బలమును బంపి, యతఁడు పోరిలోఁ జూపుశౌర్య పరాక్రమములను తనసౌధమునుండియే వెన్నెలలోఁ జూచుచుండెను. కొంచెముసేపటిలో మాధవుఁడును మకరందున కండగా నిలిచి పోరఁగా, వారిధాటి కోర్వఁజాలక సేన చెల్లాచెదరగుచుండెను. మాధవమకరందుల సౌందర్యమునకును, శౌర్యధైర్యములకును అచ్చెరువుపొంది రాజు యుద్ధమునాపి వారిరువురిని తనవద్దకు రప్పించి వారిపుట్టుపూర్వోత్తరములు, సమాచారమును విని సంతసించి మిగుల గౌరవించెను, పెక్కుబహుమానముల నిచ్చి మర్యాదతో పంపెను.

మాధవ మకరందు లిరువురును తమవిజయమున్న, గౌరవమును తమప్రియురాండ్రకుఁ దెలుపఁదలఁచి ఎక్కువ యానందముతో పూలతోఁటలోనికి రాఁగా మదయంతికమాత్రము కానవచ్చెను; కాని మాలతి కానరాలేదు; ఆమె యెందో పోయె నని మదయంతికాలవంగికలు తెచ్చిరి. ఒకవేళ ఆమె కామందకియొద్దకుఁ బోయి యుండవచ్చు నని యూహించి యట కేఁగి తనయూహ నిష్ఫలమైనందునఁ బిచ్చివానివలెఁ దిరుగుచుఁ అడవులంబడి పోవుచుండెను. విచారాతిశయమున నతఁడు మతిలేక జింకలు, నెమిళ్లు మొదలగుజంతు పక్షులను, మేఘములను—వీనిని, వానిని అన నేల? కనఁబడినవానినెల్ల మాలతి యెందున్నది?' అని యడుగుచు వాపోవుచుండెను. మకరందుఁడును, మాధవుని నీడవలెనుండి కాపాడుచుండెను, కాని యతఁ

డెంత ప్రబోధించినను మాధవుఁడు విచారమును విడువఁ డాయెను. మాధవుఁడు పర్వతనదీకాననములమధ్య తిరుగుచు, తిరుగుచు దుఃఖాతిశయమున మూర్ఛిల్లి యెంతకును తెప్పరిల కుండెను. మకరందుఁడు దుఃఖము నాపుకొనఁజాలక 'నేను మాధవునికంటె ముందుగనే మరణించెదను. ఈతని యవస్థఁ జూడఁజాలను; ఈపర్వతము మీఁదినుండి క్రిందఁ బ్రవహించు పాటలావతీనదిలోఁబడి ప్రాణములువిడుతును' అని యట్లు చేయ సిద్ధపడెను.

ఇది యిట్లుండఁగా నచట కపాలకుండల మాలతినెత్తుకొని యాకాశమార్గమున శ్రీశైలమునకుఁ బోఁగా; తొల్లి కామందకిశిష్యురాలును, మహాశక్తిసంపన్నయు నగు సౌదామిని కపాలకుండల నెదిర్చి యోడించి మాలతిని శ్రీశైలమునందే భద్రముగా నుంచి, మాలతి యిచ్చిన పొగడదండ నానవాలుగాఁ బట్టుకొని మాధవుని వెదకఁ బోయెను. సౌదామిని దివ్యజ్ఞాన సంపన్నయగుటచే మాధవమకరందు లున్న స్థలమును గనిపెట్టి యాకాశమార్గమున నక్కడికి వచ్చి చావసిద్ధముగా నున్న మకరందుని ప్రయత్నమును మాన్పి మాలతిక్షేమవార్త నాతనికిఁ దెలియఁజేసెను. 'మాధవుఁ డెక్కడ?' అని సౌదామిని యడుగఁగా మకరందుఁ డామెను మాధవుఁడు మూర్ఛపోయిపడి యున్న తావునకుఁ దీసికొనివచ్చెను. చల్లనిపిల్లవాయువులు సోఁకుటవలన మాధవుఁడు వీరు వచ్చుటకుఁ బూర్వమే తెలివొందెను. సౌదామిని మాధవు నూరడింపఁ దలఁచి తొలుత వకుళమాలిక నిచ్చి, మాలతివృత్తాంతమును దెలియఁజేసెను; అంతే

కాక యాతనినాకాశమార్గమున మాలతియున్న చోటికిఁ దీసి కొనిపోయెను.

ఇదియంతయుఁ జూచుచున్న మకరందుఁడు మిక్కిలి యాశ్చర్యపడి యీవృత్తాంతమును కామందకీ మదయంతి కాదులకుఁ దెలుపుటకుఁ బోయెను.

మాలతి యెందును కానరానందునఁ గామందకియు, లవంగికయు, మదయంతికయును విచారమున మునిఁగియుండిరి. కామందికి మాలతీమాధవులఁ దలఁచుకొని పరిపరివిధముల వాపోయి యామాలతిచిన్ననాటిచేష్టలఁ దలఁచి యేడ్చియేడ్చి భరింపఁజాలక మధుమతీనదిలోఁబడి మరణింప సిద్ధపడెను. లవంగి కయు, మదయంతికయుఁగూడ నామెమార్గమునే యనుసరింపఁ దలఁచిరి. ఆదేసమయమున మకరందుఁడచటికివచ్చి మాలతీ మాధవులు జీవించి సుఖముగ నున్నవార్తను యోగినీప్రభావ మును వారికిఁ దెలిపి వారిసాహసకృత్యమును వారించెను.

కాని యింతలో మఱియొక ఘోరము జరుగనుండెను. మాలతిమాయమైనదనియు, ఎచ్చటవెతకినను లాభములేకపోయె ననియుఁ దెలిసికొని మాలతితండ్రియగు భూరివసువు సువర్ణ బిందు పర్వతమున సువర్ణబిందుదేవాలయముచేరువ నగ్నిగుండ ములోఁబడ నుండెను. అపుడు, మాలతీమాధవుల నిర్వురను శ్రీశైలమునుండి యాకాశమార్గమునఁ దెచ్చుచున్న సౌదామిని యిది కని, వారల నొకయెడ దింపి భూరివసువును రక్షింపనేఁగెను. మాలతి యీసమాచారము విని, దిగులొంది 'అయ్యో! తండ్రీ! నానిమిత్తమై నీశరీరము నగ్నిపాలొనర్చుచున్నావా ? నీకు నాయెడ దయ లేదని యెంచినపాపాత్మురాలను; ఈఘోరవార్త

వినియు నేను జీవించియేయున్నాను.' అని పలుకుచు మూర్ఛి ల్లెను. మాధవుఁ డామెను మెల్లగాఁ జేతులలో నుంచుకొని నెమ్మదిగా కామందకి మున్నగువా రున్నయెడకుఁ దీసికొని వచ్చెను. కొంతవడికి ఆమె తెలివొందెను. అప్పటికి సౌదా మినియు భూరివసువు నాపదనుండి తప్పించి, తాను కామందికివద్దకు వచ్చియుండెను. సౌదామిని 'భగవతీ! మీచిరకాలశిష్యురా లిదె నమస్కరించుచున్నది.' అని కామందకికి నమస్కరించెను. కామందకి యామెనుపోల్చి 'ఏమి! సౌదామినియా!" అని యచ్చెరువుతోఁ జూచెను. తమప్రాణదాత యగు సౌదామిని పూజ్యురా లగు కామందకియొక్క శిష్యురాలే యగుటకు మాలతీమాధవమకరందులు సంతోషాశ్చర్యములఁ దేలిరి. కామం దకి సౌదామినిని కౌఁగిలించుకొని మిగులఁ గొనియాడి గౌర వించెను. అప్పుడు మాలతి, కపాలకుండల నోడించి నన్ను రక్షిం చిన దీమయే; నాపొగడదండ నభిజ్ఞానముగాఁ దెచ్చి మాధవ మకరందులను బ్రతికించిన దీమహాత్మురాలే; మాతండ్రి భూరివ సుని సాహసప్రయత్నమును మాన్పి కాపాడిన దీపుణ్యురాలే, అందఱి నొకచోటఁ జేర్చి పుణ్యముకట్టుకొన్న ఉదారురా లీసౌదామినియే.' అని వివరించి చెప్పెను.

ఈవృత్తాంత మామూలాగ్రముగ తెలిసికొని పద్మావతీ ప్రభువు మిగుల సంతసించి మంత్రి భూరివసువు నెదుటనే మాధ వున కొకజాబు వ్రాసిపంపెను. అం దిట్లున్నది—'కుమారా! ఉత్తమకులశీలసంపన్నుఁడవగు నీవు మాకల్లుఁడ వగుటకు మిగుల సంతసించుచున్నాము. కడగండ్లన్నియు తప్పించుకొన్నందులకు శ్లాఘించుచున్నాము. మానందనుని చెల్లెలగు మదయంతిక యింది

వఱకే నీమిత్రుఁడగు మకరందునియం దనురక్తయై యున్నది: నీప్రీతికొఱకు నామెను మకరందున కిచ్చి వివాహముచేయ నిశ్చయించినాము; దీనికి నందనుఁడు నామోదించియున్నాఁడు.' అని.

ఈయుత్తరముఁ జదివినతోడనే రాజుగారి కనుగ్రహము కలిగినందుల కందఱును ఎక్కువ యానందించిరి. అప్పు డవలోకితా బుద్ధరక్షితలును, కలహంసుఁడును సంతోషము పట్టఁజాలక నృత్యము చేసిరి. సౌదామినియే యీశుభములకుఁ గారణ మని యందఱు పలికిరి. దేవరాత భూరివసువులచిన్ననాఁటి ప్రతిజ్ఞ యిప్పుడే దీరె ననియు, మదయంతికనుబట్టి నందనుఁడును మిత్రుఁడగుట ముదావహ మనియు కామందకి పలికి ఆ ప్రతిజ్ఞా వృత్తాంతమును వివరించి చెప్పెను. సౌదామినివంటి యుత్తమ శిష్యురాలు లభించినందులకు కామందకిని అందఱుఁ గొనియాడిరి. పిదప మదయంతికామకరందులకు వివాహమయ్యెను. మాలతీమాధవులును, మదయంతికామకరందులు నన్యోన్యానురాగమువృద్ధినొంద సుఖంబున నుండిరి.



# నాగానందము

## పీఠిక

మహారాజాధిరాజ శ్రీహర్షదేవుఁడు కాశ్మీరదేశమును పాలించిన భారతచక్రవర్తి; ఇతఁడు చక్రవర్తియే గాక, కవి చక్రవర్తియు నని పేరుపడెను. శ్రీహర్షదేవుఁడు 'రత్నావళి, ప్రియదర్శిక' అను రెండు నాటికలను, నాగానందమును ఈనాటకమును రచించెను. ధీరశాంతుఁడగు జీమూతవాహనుఁ డను విద్యాధరచక్రవర్తిపుత్త్రుఁడు శంఖచూడుఁ డను నాగుని రక్షించుటకయి తాను గరుడుని కాహారమయి తన్మూలమున నాగుల నందఱిని రక్షించి, వారి కానందమును గూర్చుటచే ఈనాటకమున కీ పేరు కలిగినది. సంస్కృతనాటకప్రపంచమున నాగానందము పేరుప్రతిష్ఠలు సంపాదించినది.

పరోపకారమే పరమధర్మ మనియు, తనప్రాణముల నొసఁగియైన ఇతరుల నాపదలనుండి తప్పింపవలెననియు, జీవహింసను విడువవలె ననియు నిట్టి యుత్తమధర్మముల నెన్నియేని యీ నాటకమునుండి గ్రహింపవచ్చును.



# పాత్రములు

## పురుషులు

జీమూతకేతువు—విద్యాధరచక్రవర్తి.

జీమూతవాహనుఁడు— జీమూతకేతువుపుత్త్రుఁడు, కథానాయకుఁడు.

మిత్త్రావసువు—సిద్ధరాజగు విశ్వావసుపుత్త్రుఁడు.

శాండిల్యుఁడు—తాపసుఁడు - సిద్ధరాజపురోహితుఁ డగు కౌశికుని శిష్యుఁడు.

గరుడుఁడు—నాగులకు శత్త్రువు - పక్షిరాజు.

శంఖచూడుఁడు—గరుడునికి ఆహారముగా నాగరాజగు వాసుకిచే ఏర్పఱుపఁబడిన నాగుఁడు.

ఆత్త్రేయుఁడు—జీమూతవాహనుని వేడుకచెలికాఁడు.

శేఖరకుఁడు—సిద్ధరాజుపరిజనములో నొకఁడు.

చేటుఁడు— శేఖరకుని సేవకుఁడు.

వసుభద్రుఁడు—మిత్త్రావసునికంచుకి.

సునందుఁడు—మిత్త్రావసుని ప్రతీహారి.

## స్త్రీలు

మలయవతి—కథానాయిక - సిద్ధరాజుకూఁతురు.

కనకవతి—జీమూతకేతువుభార్య.

చతురిక—
మనోహరిక— } మలయవతిచెలికత్తెలు.
నవమాలిక—

మఱియు పార్వతీదేవి, శంఖచూడుని తల్లి, నాగరాజుసేవకుఁడు మున్నగువారు వత్తురు.

# నాగానందము

విద్యాధరచక్రవర్తియగు జీమూతకేతువు కుమారుఁడగు జీమూతవాహనుని రాజ్యమున నభిషేకించి, భార్యయగు కనకవతితోఁగూడ తపోవనమునకుఁ బోయెను; కాని పితృభక్తిపరాయణుఁడగు జీమూతవాహనుఁడు తలిదండ్రులను వెడఁబాసి యుండఁజాలక రాజ్యాంగనిర్వహణమునకును, ప్రజాపరిపాలనమునకును తగిన కట్టుదిట్టములుచేసి, మంత్రుల భుజములపయిఁ రాజ్యభారము నుంచి, ప్రియవయస్యుఁ డగు నాత్రేయునితోఁగూడ పితరులను సేవించుటకొఱకు తపోవనమునకు వచ్చివేసెను. కాని ఆత్రేయుఁడు దాని కిష్టపడక రాజ్యపరిపాలనమే ముఖ్య మనియు, లేనిచో అరాచక మేర్పడు ననియు, ఉపేక్షించినచో విద్యాధరరాజశత్రువగు మతంగుఁడు దాడివెడలి రాజ్యము నాక్రమించు ననియు జీమూతవాహనునికి బోధించెను. కాని జీమూతవాహనుఁడు తనరాజ్యము శత్రుహస్తగత మయినను తనకు విచారము లేదనియు, ఇతరులను తృప్తిపొందించుటకు తనశరీరమునుగూడ ఇచ్చుటకు సిద్ధముగా నున్నా ననియుఁ దెలిపెను. ఇఁక ఏమనినను లాభము లేదని యాత్రేయుఁ డూరకుండెను.

తాము నివసించు తపోవనమున కందమూలములు, ఫలములు, పుష్పములును కొఱవడుటచే మలయపర్వతమునకుఁ బోయి యచట నెందేని నివాసయోగ్య మగు నాశ్రమమును నిర్మింపవలె నని జీమూతకేతువు కుమారునితోఁ జెప్పెను.

జీమూతవాహనుఁడును అచటికి కేఁగి సిద్ధరాజగు విశ్వావసువు సకుటుంబముగ నివసించు ఆశ్రమమునకుఁ జేరువ నొక యాశ్రమమును నిర్మించెను; జీమూతకేతు వచటకు సకుటుంబముగ వచ్చి, తమకు సిద్ధరాజునాశ్రమసమీపముననే నివాస మేర్పడుట కానందించెను. సిద్ధరాజ విద్యాధరచక్రవర్తులకును, వారి కుటుంబములకును దినదినము మైత్రి వర్ధిల్లుచుండెను. జీమూతవాహనుఁడు ప్రియవయస్యుఁడగు నాత్రేయునితోఁగూడ నా పరిసరప్రదేశములందు విహరించుచు వినోదించుచుండెను.

ఒకనాఁడు సిద్ధరాజుపుత్రికయగు మలయవతి తనచెలికత్తె చతురికతోఁగూడ తమ యాశ్రమమునకుఁ జేరువనున్న గౌరీదేవియాలయమునకుఁ బోయి వీణమీటుచు గాన మొనర్చుచు, తనయభీష్టమును నెఱవేర్పవలసిన దని ప్రార్థించుచుండెను. వేడుక చెలికానితోఁ గూడ నంతల నారయ విపినవీథులఁ దిరుగుచున్న జీమూతవాహనుఁ డా సమయముననే అచ్చటికి గౌరీదేవికిఁ బ్రణామము లర్పింప వచ్చెను, వీణానాదముతో మేళవించి యున్న గానామృతము నాస్వాదించి, స్త్రీలుండుటను గ్రహించి, దేవాలయములోనికిఁ బోవ శంకించియు, వారిసంభాషణమువలన నామె కన్యకయే యని తెలిసికొని తమాలవృక్షములచాటున దాఁగియుండి మలయవతీసౌందర్యమున కచ్చెరువందుచు, తనివితీరనిచూపుతో ఆమెను రెప్పవాల్పక చూచుచుండెను.

అప్పుడు చెలికత్తె మలయవతితో 'రాజకుమారీ! నీ వేల వ్యర్థముగా ఈ గౌరీదేవిని ప్రార్థించెదవు? నీ వెంతకాలమునుండియో, వీణను వాయించుచు, మధురమధురముగ గానముచేసి

స్తుతించి పూజించుచున్నను ఈమె కరుణమూలి నీకోరికను నెఱవేర్పకున్నది. ఇకనైనను ఈదేవిని సేవింపక యూరకుండుట మేలు.' అని పలుకఁగా, మలయవతి 'సఖీ! నీవు నిష్కారణముగా గౌరీదేవిని నిందింపకుము; నేఁ డీమె ప్రసన్నురాలయి నా కొక వరము ననుగ్రహించినది. నే నీదినమున వీణను వాయించుచుండఁగా దేవి ప్రసన్నురాలయి, 'అమ్మాయీ! నీ వీణావాదనపాండిత్యమునకును, గానమునకును మిగుల సంతుష్టిఁ జెందితిని; స్త్రీజనమునకు దుష్కరమగు నీ భక్తికి మిగుల సంతసించితిని. నీమనోఽభీష్టము నిదే నెఱవేర్చుచున్నాను; కొలఁది కాలములోనే విద్యాధరచక్రవర్తి నీకు భర్త కాఁగలఁడు' అని యానతిచ్చినది.' అని పలికి చతురికకు సంతసమును గూర్చెను.

చెట్లచాటునుండి వారిమాటలను వినుచున్న మిత్రులిద్దఱిలో ఆత్రేయుఁడు జీమూతవాహనునితో 'మిత్రుఁడా! మనము దేవిని దర్శించుట కిదియే తగిన సమయము.' అని పలుకుచు జీమూతవాహనుఁ డిచ్ఛగింపకున్నను బలవంతముగ నతని చేయి పట్టుకొని దేవాలయములోనికి లాగికొని పోయెను. వీరిని జూచి మలయవతీచతురిక లచ్చెరువందుచుండఁగా ఆత్రేయుఁడు 'మీకు మేలగుఁగాక! చతురిక చెప్పినమాట యథార్థమే. దేవి యీామె కిట్టి వరమే యిచ్చినది.' అనిపలికెను. మలయవతి జీమూతవాహనుని పరికించుచు చతురికతో మెల్లగా 'చెలీ! ఈయన యెవ్వఁ డయి యుండును?' అని పలుకఁగా ఈమన లోకోత్తరసౌందర్యమును పరికింపఁగా గౌరీదేవి ప్రసాదించిన వరుఁ డీతఁడే యని తోఁచుచున్న' దని మెల్లగాఁ బలికెను. పిదప మలయవతి సిగ్గుతో తలవంచుకొని చెలికత్తెతోఁగూడ పోవుటకు సిద్ధ

పడఁగా వారిని కొంచెము సేపు నిలుపఁదలఁచి ఆత్రేయుఁడు 'అమ్మా! మీ తపోవనమునకు వచ్చిన యతిథులను మాటల చేతనైనను గౌరవింపకుండ పోవుచుండుట క్రొత్తయాచారమా యేమి?' అని యడుగఁగా చతురిక నాయకుఁడు మలయవతి వైపే నిదానించి చూచుచుండుటను గమనించి యామెతో 'సఖీ! ఈ బ్రాహ్మణుఁడు న్యాయముగనే పలుకుచున్నాఁడు. ఆశ్రమమునకు వచ్చిన యతిథిని గౌరవించుట నీకును ధర్మము. ఉపేక్షింపకుము' అని పలికి, మలయవతి యేమియు ననక యట్లే నిలువఁగా 'పోనిమ్ము నేనే గౌరవింతును.' అని పలికి వారికి ఆసనములనిచ్చి కూర్చుండఁబెట్టెను. కాని యట్టిసంఘటనను ఎవ్వరయిన తాపసులు చూచినచో ప్రమాదము కలుగు నని మలయవతి జంకుచుండెను.

అప్పు డొకతాపసుఁడు ప్రవేశించి తనలో నిట్లనుకొనుచుండెను. 'కులపతియగు కౌశికమునులు నాతో నిట్లనిరి. నాయనా! శాండిల్యా! సిద్ధరాజపుత్త్రుఁడగు మిత్త్రావసువు తన సోదరియగు మలయవతిని విద్యాధరచక్రవర్తిపుత్త్రుఁడగు జీమూతవాహనున కీయఁదలఁచి, ఆజీమూతవాహనుఁ డీమలయ పర్వతప్రాంతముననే నివసించుచుండుట నెఱింగి యతనిం జూచుట కేఁగియున్నాఁడు. అతఁడు తిరిగివచ్చుటకు కొంత యాలస్యమగును; అప్పటికి మధ్యాహ్నసవనవేళ దాఁటిపోవచ్చును; కావున నీవుపోయి మలయవతి యన్నకొఱ కెదురుచూచుచుండు నేమో! నీవు పోయి యామెను దీసికొని రమ్ము.' అని శాండిల్యుఁ డిట్లనుకొనుచు, దేవాలయమునకు వచ్చెను. అచటనున్న మలయవతీ జీమూతవాహనులను చూచి, వారిరువురికిని దాంపత్యము

కుదిరినయెడల బ్రహ్మచేసినసృష్టి చరితార్థము కాఁగల దని యను కొనుచు జీమూతవాహనుని సమీపించి 'శుభమగుఁగాక!' అని పలికెను. జీమూతవాహనుఁడును, మలయవతి యును ఆతనికి నమస్కరించిరి. శాండిల్యుఁడు 'అనురూపుఁ డగు భర్తను పొందుము.' అని మలయవతిని దీవించి మధ్యందినసవనసమయ మగుటను తెలిపి, యామెను తీసికొని పోయెను. జీమూతవాహ నుఁడు మలయవతిని జూపుచు, నిట్టూర్పు నిగిడించుచు ఆమె తన్ను బాసిపోవుటకు విచారించుచు మిత్రునితోఁగూడఁబోయెను.

జీమూతవాహనునియందు అనురాగముకల మలయవతి విరహతాపమున బాధపడుచుండఁగా చతురిక శీతలోపచార ములు చేయఁదలఁచి, చందనలతాగృహమునఁ జంద్రకాంతశిలా తలముపై యరఁటియాకులను పఱచియుంచెను. అంత మలయ వతివచ్చి యాశయ్యపై పరుండియు, తాపము చల్లారక మిగులఁ బొగులుచుండెను. తొలుత తనమనోవేదనకుఁ గలకారణమును చతురికతోఁ దెలుప సిగ్గుపడుచు ఆమె దానిని గ్రహించియే యుండుటను ఊహించి యథార్థమును జెప్పివైచెను. చతురిక మలయవతివిచారమును పోఁగొట్టి ధైర్యము చెప్పుచు గౌరీదేవి వరము తప్పక నెఱవేఱఁగల దనియు, జీమూతవాహనునికి మలయవతియెడ గాఢానురాగము ఉండుటను తాను గమనించియే యుంటిననియు ఊరడింపుమాటలు పలుకఁగా మలయవతి 'చెలీ! ఆశ్రమమునకు వచ్చినయతిథిని వాఙ్మాత్రముచేతనైనను గౌరవింపని నన్ను అతినిర్దయురాలినిగా ఆయన తలఁచి యుండు.' నని యేడ్వసాగెను. చతురిక యామె నూరడించుచు శైత్యోప చారము లొనర్చుచుండెను.

మలయవతి వలెనే మదనావస్థఁ గుందుచున్న జీమూతవాహనుఁడును మిత్రునితోఁగూడ విహారార్థ మయ్యెడకువచ్చి, మలయవతిం దలఁచుకొని వాపోవుచుండఁగా ఆత్రేయుఁ డాతనికి ధైర్యము చెప్పుచు, ప్రసంగమును మార్పఁదలఁచి 'మిత్రమా! నీ వీదినమున ఇంత శీఘ్రముగా గురుజనశుశ్రూష యొనర్చి వచ్చితి వేల ?' అని ప్రశ్నించెను. దానికి జీమూతవాహనుఁడు 'నీ వనినట్లు నేను నేఁడు చాల వేగముగనే గురువులను సేవించి వచ్చితిని ; రాత్రి స్వప్నమందు నా ప్రియురాలు చందనలతాగృహములోని చంద్రకాంతశిలాతలమునఁ గూరుచుండి ప్రణయకోపమున న న్నేమియో నిందించుచు నేడ్చుచుండెను; కావున నేను ప్రియురాలు కూరుచుండిన యాచందనలతాగృహముననే యీదిన శేషమును గడపఁదలఁచి, విహితకృత్యములను శీఘ్రముగనే నిర్వర్తించుకొని వచ్చితిని.' అని జబాబిచ్చెను. పిదప వా రిరువురును చందనలతాగృహమును ప్రవేశించిరి. వీరు వచ్చుచుండుటను ముందుగనే అడుగులచప్పుడు విని తెలిసికొని అశోకవృక్షముచాటునకుఁ బోయి మలయవతీచతురికలు దాఁగుకొనిరి. అట్లు దాఁగుకొనియు ఆ వచ్చినవారు జీమూతవాహనుఁడును, అతనిమిత్రుఁడు నగుట తెలిసికొని సంతసించిరి.

జీమూతవాహనుఁడు చంద్రకాంతశిలపైఁ గూరుచుండి తనప్రియురాలింగూర్చి తలఁచుకొనుచుండఁగా ఆయన తలఁచుకొనుచున్న ప్రియురా లెవ్వతెయై యుండునా? అని మలయవతి సందేహించుచుండెను. అతఁడు మలయవతినే తక్క వేఱొకతెను తలఁచుకొనుట లేదని చతురిక చెప్పుచున్నను మలయవతి కా మెమాటలపయి నమ్మిక లేకుండెను.

అప్పుడు జీమూతవాహనుఁడు తాను స్వప్నమునందుఁ జూచిన నాయికయొక్క చిత్రమును చంద్రకాంతిశిలపయిఁ లిఖించి కొంత తృప్తిఁజెందఁ దలంచి, కొండచరియనుండి మన శిలాశకలములను తేవలెనని ఆత్రేయుని నియోగించెను. ఆత్రేయుఁడు పోయి, అయిదురంగుల శిలాశకలములను తెచ్చి మిత్రుని కీయఁగా నతఁడు రంగులతోఁగూడ తనమనోనాయిక చిత్రము నా శిలాఫలకముపయిఁ చిత్రించి యాత్రేయునికూడ నాశ్చర్యమున ముంచెను. మలయవతిమాత్ర మా చిత్రమెవ్వతెదో యెఱుఁగక యది యితరనాయికదయి యుండు నని నిస్పృహతో అన్నయగు మిత్రావసువద్దకుఁ బోయెదనని చతురికతోఁ బలుకఁగా ఆమె 'రాజపుత్రీ! ఆయనయొద్దకు చెలికత్తె యగు మనోహారిక వెళ్లియే యున్నది; రాజాగా రిచ్చటికి బహుశః రావచ్చును'. అని పలికి యా మీ ప్రయత్నమును మాన్పెను.

ఆ సమయమున మిత్రావసు విట్లనుకొనుచు వీరున్న యెడకు వచ్చెను. పూజ్యపాదులగు తండ్రిగారు నన్ను పిలిచి 'అబ్బాయి! విద్యాధరచక్రవర్తి పుత్రుఁడు కుమారజీమూతవాహనుఁడు ఇచ్చటకు వచ్చుటచే బాగుగఁ జూచుటకు వీలు కలిగినది, అతఁ డన్నివిధములచేతను మలయవతికి అనుకూలుఁడగు వరుఁడు; కావున ఆతనికి కుమారి నీయవలసి యున్నది.' అని చెప్పెను. తండ్రిగారి యాశయమేమో బాగుగనే యున్నది; ప్రాజ్ఞుఁడును, విద్యాధరవంశతిలకుఁడును, సుందరుఁడును, వీరుఁడును, వినీతుఁడును, విద్వాంసుఁడును, యువకుఁడు నగు జీమూతవాహనునికంటె తగినవరుఁ డింకొకఁడు మలయవతికి

అనర్హుఁడు; కాని సహజదయాళువగు నీతఁడు పరోపకారార్థము ప్రాణములనైన నర్పింప వెనుదీయఁడు; ఈతని యీసాహసమునకు జంకు కలుగుచున్నది. ఈ సంబంధవిషయమున నా మనస్సు శతోపవిషాదములలో నూగులాడుచున్నది. ఎట్లయిన తండ్రిగారి యానతిని నెఱవేర్పవలయును గదా! కుమార జీమూతవాహనుఁడు గౌరీదేవి యాలయమునకుఁ జేరువనున్న చందనలతాగృహమున నున్నట్లు తెలిసినది. కావున నేను నచటికి పోయెదను,' అని. ఇట్లనుకొనుచు మిత్రావసువు లతాగృహమును ప్రవేశించుచుండఁగా ఆత్రేయుఁడు దూరమునుండియే చూచి, మిత్రునితో 'మిత్రమా! సిద్ధరాజుపుత్రుఁడగు మిత్రావసు వీ వంకకే వచ్చుచున్నాఁడు; ఒకవేళ అతఁడీచిత్రమును చూచునేమో! నీ వీ యరఁటియాకుతో చిత్రమును కప్పివేయుము.' అని చెప్పఁగా జీమూతవాహనుఁడట్లే చేసెను.

మిత్రావసువు జీమూతవాహనునియొద్దకు వచ్చి నమస్కరించి ప్రతినమస్కారమును గ్రహించి కూరుచుండెను. కుశలప్రశ్నానంతరము మిత్రావసువు జీమూతవాహనునితో 'తండ్రిగారు నీతో ఇట్లు మనవిచేయుమన్నారు. నాకు మలయవతి యను కుమార్తె యున్నది. ఆమె సమస్తసిద్ధరాజవంశమునకును జీవమువంటిది; ఆమెను నీకిచ్చి వివాహము చేయవలెనని మా సంకల్పము; కావున ఆమెను గ్రహింపవలెనని ప్రార్థించుచున్నాను.' అని ఈ మా ప్రార్థనమును నీ వంగీకరింతువని నా యాశయము.' అని పలికెను. అశోకవృక్షముచాటున నున్న మలయవతీచతురికలీ మాటలు విని మిగుల సంతసించిరి.

తనమన స్సిదివఱకే యన్యాక్రాంతమగుటవలన జీమూతవాహనుఁ డేమియును జెప్పలేకుండెను. ఆత్రేయుఁడా సంగతిని గ్రహించి మిత్రునితో మెల్లగా 'ఏదో యొకమాట చెప్పి యాతనిని పంపివేయుము.' అని పలికెను. జీమూతవాహనుఁడును 'మిత్రమా! మిత్రావసువూ! మీవంటివారితోఁ సంబంధము చేసికొనుట ఎంతయు సంతసింపఁదగినదే! కాని నా మనస్సిదివఱకే యన్యాయత్తమయి యున్నది; ఒకతెను ప్రేమించిన పిదప వేఱొకతెను ప్రేమించుటకు నామన స్సంగీకరింపకున్నది. కావున క్షమింపఁ బ్రార్థింతు.' నని పలికెను. ఈ మాటలను విని, చెట్లచాటున నున్న మలయవతి మూర్ఛపోయెను, చతురిక చేసిన యుపచారములవలన కొంతవడికి తెప్పరిల్లెను.

అప్పుడు మిత్రావసువు చిన్నబుచ్చుకొనునని యాత్రేయుఁడు 'ఆర్యా! ఈతఁడు పరాధీనుఁడు; గురుజనులు చెప్పుచేఁతలలో మెలఁగవలసినవాఁడు; కావున మీరు జీమూతకేతువును చూచుటయే మేలు.' అని పలికెను. 'అట్లే చేసెదను.' అని పలుకుచు మిత్రావసు వటనుండి పోయెను.

అప్పుడు మలయవతి తన్ను జీమూతవాహనుఁడు తిరస్కరించుటచే జీవితమున నిరాశ చెంది ఆ యశోకవృక్షమునకు తీఁగలతో ఉరి కల్పించి ఆత్మహత్య చేసికొనుటకు నిర్ణయించుకొని, తన ప్రయత్నము నిర్విఘ్నముగా జరుగుటకు చతురిక నటనుండి పంపివేయఁ దలఁచి 'చతురికా! అన్నగారు మిత్రావసు వెంత దూరము పోయెనో చూడుము; ఏమన నేను ఇక్కడినుండి పోవలసి యున్నది గదా!' అని పలికి యామెను పంపివేసెను. చతురిక నాలుగైదడుగులు నడిచియు, తన చెలికత్తె విను

నస్కురై యుండుట గ్రహించి యొకచోట దాగుకొని యుండి మలయవతి యేమి చేయునదియు గమనించుచుండెను. ఇంతలో మలయవతి గౌరిని ప్రార్థించి 'అమ్మా! గౌరిదేవీ! ఈ జన్మమున నీవు నాకోరికను నెఱవేర్పకున్నను మఱుజన్మమున నయినను ఇట్టి దుఃఖము కలుగకుండునట్లు వర మొసంగుము' అనుచు నురిలో కంఠమును దూర్చి, బిగింప సిద్ధముగా నుండెను. అది చూచి చతురిక తొందరగా వచ్చి 'అయ్యో! అయ్యో రాజకుమారి ఉరిపోసికొని ప్రాణత్యాగము చేయుచున్నది. రక్షింపుఁడు.' అని గట్టిగా అఱచెను. అది విని, జీమూతవాహనుఁడు తొందరగా వచ్చి, పాశమును సడలించి మలయవతిహస్తమును పట్టుకొని 'ఓసుందరాంగీ! పూవులు కోసినంతమాత్రముననే కందిపోవు నీ హస్తము ఉరిని పన్నుటకు ఎట్లోర్చినది?' అని ప్రశ్నించెను. మలయవతి అనిష్టముగా చేతిని లాగికొనుచు 'నాహస్తమును విడువుఁడు; నా ప్రయత్నమునుండి నన్ను తప్పించుటకు మీ రెవ్వరు?' అని కొంత కఠినముగానే పలికెను.

అప్పుడు విదూషకుఁడు చతురికను 'ఈమె ఆత్మహత్య చేసికొనుటకుఁ గారణ మేమి?' అని ప్రశ్నింపఁగా 'ఈయనయే కారణ' మని చతురిక జీమూతవాహనుని జూపెను. 'ఏమేమీ! ఈ దారుణకార్యమునకు నేనే కారణమైతినా? నా కేమియు బోధపడుటలే'దని జీమూతవాహనుఁడు రిచ్చవడి నిలుచుండెను. ఆత్రేయుఁడు వివరముగాఁ జెప్పవలె నని కోరఁగా చతురిక 'అయ్యా! మీమిత్రుఁడు వేఱొకతెను ప్రేమించి యామెనే ధ్యానించుచు, ఈమెప్రేమను తిరస్కరించెను; ఈమెసోదరుఁ

డగు మిత్రావసువు తన సోదరిని పెండ్లాడవలెనని ప్రార్థించినను అతనిమాటను గౌరవింపఁ డయ్యెను. ఆకారణమున మీ మిత్రునే ప్రేమించుచున్న రాజకుమారి మలయవతి నిరాశ చెంది గత్యంతరములేక యురిపోసికొని మరణింప సిద్ధపడినది.' అని తెలియఁజేసెను. జీమూతవాహనుఁ డది విని 'ఏమేమీ! ఈమె సిద్ధరాజపుత్త్రికయగు మలయవతియేనా? ఎంత మోసము జరిగినది! ఈసంగతి కొంచెమైనను ఎఱుకపడదయ్యెనే!' అని యనుచుండఁగా ఆత్రేయుఁడు చతురికతో 'మామిత్రుఁడు మనసార యీమెనే ప్రేమించెను; ఈ శిలాతలమున వ్రాయఁబడిన దీమె చిత్తరువే! నామాటపై నమ్మకము లేనిచో మీరు వచ్చి స్వయముగాఁ జూడవచ్చును' అని పలికెను. మలయవతి ఏమియుఁ బలుకక యట్లే నిలిచి యుండఁగా జీమూతవాహనుఁడు చిఱునవ్వు నవ్వుచు మలయవతితో 'నీ వాచిత్రమును చూడనిచో నీచేతిని విడువను' అని పలికి, యామె నావైపునకుఁ దీసికొని వెళ్లెను. మలయవతి యా చిత్రమును చూచి 'ఇది నన్ను పోలియే యున్నది' అని పలుకఁగా చతురిక 'చెలీ! అట్లనెదవేమి? ఈ చిత్రము నీ ప్రతిబింబము ట్లున్నది; నీవే యిచట వ్రాయఁబడితి వనుటలో సందేహము లేదు.' అని పలికెను. మలయవతి నవ్వి తనకృత్యమునకు సిగ్గుపడెను. విదూషకుఁ డప్పుడు జీమూతవాహనునితో 'మిత్రమా! ఇప్పుడు మీ యిరువురికిని గాంధర్వవివాహము జరిగినట్లే? ఇఁక నీమె చేయి విడువుము' అని పలుకఁగా నతఁ డట్లే చేసెను.

అప్పు డొకచెలికత్తె పరుగుపరుగున వచ్చి మలయవతితో 'అమ్మా! నిన్ను కోడలినిగా గ్రహించుటకు కుమారజీమూత

వాహనుని తలిదండ్రులు మనసార అంగీకరించిరి.' అని సంతోషముతో చెప్పెను. దాని కచ్చటివారందఱును మిగుల సంతసించిరి. భోజనప్రియుఁడగు నాత్రేయుఁడు తనకు పిండివంటలతోడి విందుభోజనములు లభించు నని ఎక్కువ యానందమును వెలిఁబుచ్చుచు నందఱిని నవ్వించెను. చెలికత్తె 'ఇప్పుడే వివాహముహూర్త మఁట! నిన్ను వెంటనే తీసికొని రావలెనని యువరాజు మిత్రావసు వాజ్ఞాపించెను; కావున శీఘ్రముగా రమ్ము' అని పలుకుచు మలయవతిని దీసికొని పోయెను. పిదప జీమూతవాహనుఁడు మిత్రునితోఁ గూడ తన నివాసమున కేఁగెను.

మలయవతీవివాహానంతరము సిద్ధులును విద్యాధరులును ఆనందముగ కాలము గడుపుటకు తమప్రియులతోఁ గూడ కుసుమాకర మను ఉద్యానవనమున కేఁగిరి. శేఖరకుఁడను సిద్ధరాజసేవకుఁడు మద్యపాన మొనర్చి తనప్రియురాలును, మలయవతిచేటియు నగు నవమాలికను వెదకుచు ఆ యుద్యానవనమునకే పోయెను. తనమిత్రుఁ డగు జీమూతవాహనుఁడును అచటికే రాఁగలఁ డని యెఱింగి విదూషకుఁ డగు నాత్రేయుఁడు నా యుద్యానవనమునే ప్రవేశించెను. ఆ యుపవనమున పూఁదేనెకయి గుంపులుగుంపులుగా చేరిన తుమ్మెదలు తన్ను బాధింపఁగా వానిబారినుండి తప్పించుకొనుటకయి ఆత్రేయుఁడు తనకు మలయవతి బహుమానముగా నిచ్చిన ఎఱ్ఱని వస్త్రములతో ఆఁడువేషము వేసికొని, తన యుత్తరీయమును మేలిముసుగు వేసికొనెను. అప్పుడు మద్యపానోన్మత్తుఁడగు శేఖరకుఁడు విదూషకుని జూచి నవమాలికయే యని తలంచి కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొనఁబోఁగా అతనినోటి కల్లుకంపును

భరింపలేక 'ఛీ! దూరముగా పొమ్ము.' అని ముక్కుమూసికొని మొగము త్రిప్పి మధుకరములబాధను తప్పించుకొని యిప్పుడీమధుకరునిబారిం బడితిని.' అని విచారించెను. తనపైఁగల కోపమున నవమాలిక మొగము త్రిప్పుకొన్నదని తలంచి యామె కోపమును పోఁగొట్టఁదలఁచి పాదములపై వ్రాలి బతిమాలుచుండెను.

ఆ సమయమునన నవమాలిక మలయవతితల్లి యాజ్ఞ ననుసరించి మలయవతీజీమూతవాహనుల వివాహార్థము కుసుమాకరోద్యానమునఁ దగినయేర్పాటులు కావింపవలెనని ఉద్యానపాలికయగు పల్లవికను నియోగించి, తనప్రియుఁడగు శేఖరుని వెదకుచు నటకే వచ్చుచు తనప్రియుఁడు వేఱొకవనితకాళ్లపైఁబడి యామెను ప్రార్థించుటను కనులారఁ గాంచి, కోపించి, దూరమున నుండియే గమనించుచుండెను. అప్పుడు తన్ను నవమాలిక యనిభావించి, బతిమాలు శేఖరునిపైఁ గోపించి యాత్రేయుఁడు 'ఓరి కల్లుముచ్చా! ఇక్కడ నవమాలిక యేదీ?' అని గద్దించెను. నవమాలిక దీనిం గనిపెట్టి నవ్వుకొనుచు 'సరియే, తెలిసినది; మదనపరవశుఁడగు శేఖరకుఁడు నే ననుభ్రాంతితో ఆప్తుఁడగు నాత్రేయుని వేఁడుకొనుచున్నాఁడు. నేను కోపమును నటించి, వీరిరువురిని పరిహాసించెదను.' అని నిశ్చయించెను. అప్పుడు శేఖరుని సేవకుఁడగు చేటుఁడు నవమాలికను దూరమునుండియే చూచి తన యజమానునితో 'అయ్యా! ఈమె నవమాలిక కాదు; ఈమెను విదూషకుఁడు; అదిగో! నవమాలిక కోపముతోఁ జూచుచు ఈ వైపు వచ్చుచున్నది.' అని పలికెను. నవమాలిక తొందరగా

వచ్చి, శేఖరకునిఁ గోపముతోఁ జూచుచు 'నీవు బతిమాలుచున్న యీవనిత యెవ్వరు?'అని గద్దించి ప్రశ్నించెను. ఆత్రేయుఁడు మేలిముసుగు తీసివైచి 'నేను ఆత్రేయుఁడను; ఆఁడుదానను కాను.'అని పలుకఁగా శేఖరకుఁడు తన్నాత్రేయుఁ డిట్లు పరాభవించినందుకు మండిపడి 'ఓరి! పందుకోఁతీ! నీవును నన్ను మోసము చేయఁజూతువా? చూడు, నీపని పట్టించెద.' నని యాత్రేయుని గద్దించి, అతనిని పట్టుకొనుటకు చేటుని నియమించి, నవమాలికను బతిమాలసాగెను. ఆత్రేయుఁడు పారిపోవఁదలంపఁగా చేటుఁ డాతని జందెము పట్టుకొనుటచే నది తెగిపోయెను; శేఖరుఁడు 'నిలు, నిలు' మని యఱచుచుండఁగా విదూషకుఁడు తన్ను విడిపింపవలెనని నవమాలికను ప్రార్థించెను. 'నాకు సాష్టాంగనమస్కారము చేసినచో నిన్ను విడిపింతు'నని యామె నవ్వుచుఁ బలుకఁగా ఆత్రేయుఁడు 'ఏమేమో! విద్యాధరచక్రవర్తి ప్రియమిత్రుఁడను, బ్రాహ్మణుఁడను అగు నే నొకదాసికి సాగిలఁబడి మ్రొక్కవలెనా?' అని పలుకఁగా నవమాలిక నవ్వుచు 'ఇదిగో! నమస్కరించునట్లు చేసెదను; చూడుము'అని పలికి శేఖరకునితో 'ఓయీ! శేఖరకా! లెమ్ము; నిన్నను గ్రహించితిని.'అని యాతనిని కౌఁగిలించుకొని 'ఈ యాత్రేయుఁడు అల్లుఁడుగారి ప్రియవయస్యుఁడు; బ్రాహ్మణుఁడు; అట్టి యుత్తముని నీ వవమానించితివి. ఈసంగతి యువరాజగు మిత్రావసువునకుఁ దెలిసినయెడల నిన్ను కోపించును; కావున ఈయనను గౌరవింపుము.' అని పలికెను. శేఖరకుఁడు ఆమె చెప్పినప్రకారము చేయఁదలఁచి యాత్రేయునితో 'నీవు సంబంధి వని యిట్లు పరిహాసము చేసితిని కాన కోపింపకుము; నీ

నీ యాసనముపయిఁ గూర్చుండుము.' అని కూర్చుండఁబెట్టి నవమాలికతో 'నీవు నీతని ప్రక్కనే కూరుచుండుము; వీరా యిరువురి నొక్కసారియే గౌరవింతు'నని యామెను గూర్చుండఁబెట్టి చేటునిద్వారా మద్యమును తెప్పించి యిరువురికి నీయఁదలఁచెను. ఆత్రేయుఁడు తాను బ్రాహ్మణుఁడనని మద్యము గ్రహింపలేదు; నవమాలిక మద్యమును సేవించెను. ఆ కంపును సహింపలేక యాత్రేయుఁ డెట్లయినను వారిబారినుండి తప్పించుకొనఁదలఁచి నవమాలికకు నమస్కరింపఁబోయెను. నవమాలిక యాతనిని వారించి, పరిహాసము చేసినందులకుఁ గోపింపవల దనిచెప్పి సగౌరవముగఁ బంపివేసెను; ఆత్రేయుఁడును తనమిత్రునిఁ గలిసికొనుటకుఁ బోయెను. విదూషకుఁడు జీమూతవాహనుని యొద్దకుఁ బోవుసరికి అతఁడు మలయవతితోను, ఆమెచెలికత్తెయగు చతురికతోను కూడ ఉద్యానవనమున విహరించుచు తమాలవృక్షవీథికి వచ్చెను. జీమూతవాహనుఁడు 'ఇంత యాలస్యమేలయ్యెఁ?' నని యాత్రేయు నడుగఁగా సిద్ధవిద్యాధరులు జరుపు విహారములను, వేడుకలను చూచుచు వచ్చుటచేత ఆలస్యమైన దని చెప్పెను. వనవిహారసమయమున నాయకుఁడు మలయవతిని గొప్పగా వర్ణింపఁగా చతురిక 'చూడుము; వీరామిత్రుఁడు మా రాజకుమారి నెట్లు వర్ణించుచున్నాఁడో?' అని పలుకఁగా ఆత్రేయుఁడు 'చతురికా! నీ విట్లు గర్వింపనక్కఱలేదు; మాలోఁగూడ సౌందర్యవంతులు లేకపోలేదు; కాన నసూయవలన ఎవ్వరును వర్ణింపకున్నారు.' అనెను. చతురిక 'నేను నిన్ను వర్ణించెదను; వివాహసమయమున జాగరము చేయుటచే కన్నులు మూసికొని నీవు కునుకుపాట్లు పడు.

చున్న వృక్షము అందముగా నుంటివి. ఆరీతినే నీవు కూరుచున్న యెడల నేను వర్ణింపఁగలను.' అని పలుకఁగా ఆత్రేయుఁ డామె కోరినట్లే కన్నులు మూసికొని కూరుచుండెను. చతురిక తమాల పల్లవముల నేరి పిండి రసముతీసి ఆరసము నాత్రేయుని మొగమునకు పూసెను. అది చూచి మలయవతీజీమూతవాహ నులు నవ్విరి. ఆత్రేయుఁడు చేతితో ముఖము తుడుచుకొని, నల్లనిరంగు చేతికి నంటుకొనఁగా మిగులఁ గోపించి, తన మిత్రునియెదుటనే తన కిట్టి యపగౌరవము కలిగినందుల కలిగి వెళ్లిపోయెను. ఆత్రేయుని నూరడించి తీసికొనివచ్చుటకు చతు రిక యాతని వెనువెంటనే పోయి, కొలఁదిసేపటిలో వెనుకకు వచ్చి ఏదో యొకయావశ్యకకార్యమును ఆలోచించుటకు యువ రాజగు మిత్రావసువు వచ్చియున్నాఁ డని జీమూతవాహనునికిఁ దెలిపెను. నాయకుఁడు మిత్రావసువుతో మాటలాడి, శీఘ్ర ముగనే వచ్చెద నని చెప్పి మలయవతిని గృహమునకుఁ బంపి వేసెను.

ఇంతలో మిత్రావసువు వచ్చి విద్యాధరశత్రువు మతంగుఁ డన్యాయముగ జీమూతవాహనుని రాజ్యము నాక్రమించు కొనె ననియు సిద్ధసేనలతోఁ బోయి వాని నోడించుటకు అనుజ్ఞ నీయవలసిన దనియు జీమూతవాహనునికిఁ దెలుపఁగా, అతఁడు జీవహింస కెంతమాత్రమును సుముఖుఁడు కానందున మిత్రావ సువు కోరికను చెల్లింప నంగీకరింపఁ డయ్యెను. మిత్రావసువు మతంగు నున్మూలించుటలో గట్టి పట్టుదల కలిగి యుండుటను జూచి జీమూతవాహనుఁడు శాంతముతో 'మిత్రమా! లోనికి రమ్ము. అచ్చట నీకు వివరముగా తెలిపి బోధించెదను. ఇప్పుడు

చాల ప్రొద్దు పోయినది' అని బుజ్జగించుచు నతనిని లోనికిఁ దీసికొనిపోయెను.

మహారాజగు మిత్రావసువు నంతఃపురమునఁ గంచుకి యగు వసుభద్రుఁడు రాజమాతయాజ్ఞ ననుసరించి, వివాహ మయిన పది రాత్రులవఱకును మలయవతీజీమూతవాహనులకు ఎఱ్ఱరంగు వస్త్రములు నీయవలసి యుండెను. మలయవతి యత్త వారింట నున్నదనియు, జీమూతవాహనుఁడు మిత్రావసువుతోఁ గూడ సముద్రతీరమును జూడ నేఁగెననియుఁ దెలిసికొని, తాను మలయవతియొద్దకుఁ బోవలెనో, లేక జీమూతవాహనుని యొద్దకుఁ బోవలెనో నిర్ణయింప లేకుండెను. అప్పుడు సునందుఁ డనుఁ బ్రతీహారి వచ్చి సంగతి తెలిసికొని, కంచుకి మలయవతి యొద్దకుఁ బోవుటయే మేలనియు, ఈపాటికి జీమూతవాహ నుఁడు ఇంటికి వచ్చి యుండవచ్చుననియు సలహా యిచ్చెను.

ఆ సమయముననే దీపప్రతిపదుత్సవమను ఉత్సవము జరుగ నుండుటచే ఆ సందర్భమున నూతనదంపతులకు తగిన కట్నము నీయవలయు ననియు, నందుకుఁ దగిన యేర్పాటు చేయవలె ననియు సిద్ధరాజగు విశ్వావసువు సునందునిమూల మున యువరాజగు మిత్రావసువునకు వార్త పంపెను. కాన ఈ సమాచారమును తెలుపుటకు సునందుఁడు మిత్రావసు వున్న సముద్రతీరమునకే పోయెను.

సునందుఁ డచటి కేఁగుసరికి జీమూతవాహనుఁడును, మిత్రావసువును సముద్రశోభను పరికించుచు ఇష్టాగోష్ఠిని కాలముగడుపుచుండిరి. అచ్చట నొకచో పెద్దపెద్ద తెల్లని గుట్ట

లను జూచి జీమూతవాహనుఁడు మిత్రావసువుతో 'మిత్రావసూ! చూడుము; ఈమలయపర్వతపు చరియలు శరత్కాల మేఘములచేఁ గప్పఁబడిన హిమాలయశిఖరములవలె నెంత మనోహరముగా నున్నవి?' అని పలుకఁగా, దానికి మిత్రావసువు 'ఇవి మలయాచల సానువులు కావు; నాగులయెముకల ప్రోగులు' అని జబా బిచ్చెను. అది విని జీమూతవాహనుఁడు మిగుల విచారించి 'పాము లొక్కుమ్మడి నన్నేల చచ్చె?' నని యడుగఁగా మిత్రావసువు 'అవి సంఘాతమరణము నొందలేదు. వివరముగాఁ దెలిపెదను, వినుము. నాగవిరోధి యగు గరుడుఁడు పాముల నన్నింటి నొక్కుమ్మడిని చంపుచుండఁగా నాగరాజగు వాసుకి దినమున కొక్కొక్క పాముచొప్పున ఆహారముగాఁ బంపుట కంగీకరించి గరుడఁడు పాములను చంపకుండున ట్లతనివలన వరమును పొందెను. వాసుకిమాటప్రకారము దినమున కొక నాగుని పంపుచున్నాఁడు; గరుడుఁడు నాగుల నిచట భక్షించుచున్నాఁడు; ఆ నాగుల యెముకలే యిట్లు గుట్టలవలె బడియున్నవి.' అని పలికెను. గరుడుని నిర్దయత్వమునకును, వాసుకి స్వార్థపరత్వమునకును మిగుల విచారించి, 'నా ప్రాణముల నర్పించి యొక్క నాగునైనను కాపాడఁ గలనా?' అని జీమూతవాహనుఁడు ఆలోచించుచుండెను. ఆసమయముననే సునందుఁడు వచ్చి మిత్రావసువుచెవిలో నేమేమో చెప్పఁగా నతఁడు తనతండ్రిగారు పిలుచుచున్నా రని జీమూతవాహనునికిఁ జెప్పి శీఘ్రముగ నే యింటికి రావలె నని కోరుచు సునందునితోఁగూడ తండ్రియొద్దకుఁ బోయెను.

ఆ సమయమునందే గరుడుని కా దినమున ఆహారముగా నిర్ణయింపఁబడిన శంఖచూడుఁడను నాగుఁడును, ఏకైకపుత్త్రుఁడగు నతనిని విడువలేక వెంటవెంటనే యేడ్చుచు వచ్చుచున్న వృద్ధురా లగు శంఖచూడునితల్లియును జీమూతవాహనుని కంటఁ బడిరి. శంఖచూడుఁడు విలపించుచున్న తల్లి నూరడించి వెనుకకుఁ బొమ్మనుచుండెను. నాగరాజకింకరుఁడు శంఖచూడునికి రాజకార్యమును దెల్పుచు, వధ్యస్థానమునకు రావలె నని అతనిని తొందరపెట్టుచుండెను. జీమూతవాహనుఁడు వీరినందరిని చూచెనే గాని, యథార్థస్థితి యిదమిత్థమని యాతనికిఁ దెలియలేదు. కావున ఒక చెట్టుచాటున నుండి వారి ప్రసంగమును విని, యథార్థమును తెలిసికొన నిశ్చయించి, వారికిఁ గానరాకుండ చెట్టుచాటున దాఁగెను.

నాగరాజకింకరుఁడు శంఖచూడుని వధ్యశిలయొద్దకుఁ గొనిపోయి వధ్యులు ధరింపవలసిన యెఱ్ఱని వస్త్రముల నాతని కిచ్చుచు నాగరాజాజ్ఞను తెలియఁజేసెను. ఆ సంఘటనకు శంఖచూడునితల్లి మూర్ఛిల్లెను. శంఖచూడుఁ డామె నూఱడించుచుండఁగా గరుడుఁడు వచ్చు సమయమైన దని తెలిసికొని కింకరుఁ డటనుండి వెళ్లిపోయెను. జీమూతవాహనుఁ డిది కాంచి 'స్వబంధువులచే విడువఁబడిన యార్తుని తల్లి కేకైకపుత్త్రుని రక్షింపనిచో ప్రాణము లున్నందులకు ఫల మేమి?' అని యనుకొనుచు 'నాగరాజు విడిచివేసిన నిన్ను రక్షించు దిక్కెవ్వరు తండ్రీ!' యని కొడుకును కౌఁగిలించుకొని యేడ్చుచున్న శంఖచూడునితల్లిం జేర నరిగి 'నేనున్నా'నని ధైర్యముతో పలికెను. ఆతురత కల శంఖచూడునితల్లి గరుడుఁ డను భ్రాంతితో శంఖ

చూడుని గట్టిగాఁ బట్టుకొని తనకుమారునికి బదులు తన్నుఁ భక్షింపవలెనని జీమూతవాహనునిఁ గోరెను. అతఁడు గరుడుఁడు కాఁడనియు, ఎవరో యొక ధర్మాత్ముఁడనియు శంఖచూడుఁడు తల్లిభ్రాంతిని పోఁగొట్టెను. జీమూతవాహనుఁడామెతో 'అమ్మా! నీపుత్రునికి భయము లేదు. అతనికి బదులుగ నేను నా ప్రాణముల నర్పింతును' అని పలుకఁగా ఆమె చెవులు మూసికొని 'నాయనా! అట్లు పలుకకుము; నాకు శంఖచూడుఁ డెట్లో నీవు నట్లేసుమా! ఇట్టి యుదారగుణము కల నీవు శంఖచూడుని కంటెను గొప్పవాఁడవు.' అని పలికెను. శంఖచూడుఁడు జీమూతవాహనుని లోకభిన్న స్వభావమునకు అచ్చెరువంది 'మహాత్మా! నీవు నాయెడఁ జూపుచున్న యీదయాగుణమునకు ధన్యుఁడను; ఈ ప్రయత్నమును విడువుము; ఇంతకంటె నెక్కువ చేయ నక్కఱ లేదు' అని జీమూతవాహనునితోఁ బలుకఁగా నతఁడు 'కుమారా! శంఖచూడా! పరోపకారము చేయుట కింతవఱకును నా కెట్టి యవకాశమును లభింపలేదు; నా ప్రయత్నమున కాటంకము కల్పింపక ఆ వధ్యచిహ్నములను నా కిమ్ము; మాఱుమాట పలుకకుము.' అని పలుకఁగా శంఖచూడుఁడు 'మహాత్మా! శంఖచూడుఁడు శంఖమువలె స్వచ్ఛమైన శంఖపాలకులమును మలినముగాఁ జేయ నెంతమాత్ర మంగీకరింపఁడు; నీకు నాయెడ దయ కలదేని, నా మృతివలని దుఃఖముచే ప్రాణములను విడువకుండ మా తల్లి జీవించు నుపాయము నన్వేషింపుము' అనెను. అంత జీమూతవాహనుఁడు 'ఆ యుపాయము నిదివఱకే యాలోచించితిని; అది నీవలన నెఱవేఱుఁదగినది; చూడుము! నీతల్లి నీవు జీవించిన, జీవించును; నీవు

చచ్చినఁ జచ్చును; కాన ఆమె ప్రాణములను రక్షింపఁదలఁచినచో నా ప్రాణములవలన నీ ప్రాణములను రక్షించుకొనుము. ఇదియే తగిన యుపాయము. నీవు వధ్యచిహ్నములను నాకిమ్ము; దానిం గప్పికొని వధ్యశిలపైఁ గూర్చుండెదను. నీవు నీతల్లితో ఈ చోటు విడిచి సుఖముగా వేగముగా పొమ్ము. మనము వధ్యశిలను సమీపించుచున్నాముగదా! ఇచటి భయంకరదృశ్యములను జూచి, యీమె ప్రాణములను విడిచినను విడువవచ్చును; కాన త్వరపడుము' అని పలుకఁగా శంఖచూడుఁడు 'నేను అంతయు ఎఱుఁగుదును; గరుడుఁడు వచ్చుసమయము కావచ్చినది; దయయుంచి నీవుపొమ్ము' అని పలికి, తల్లితో 'అమ్మా! నీకిదే కడపటి నమస్కారము; నీవును శీఘ్రముగాఁ బొమ్ము' అని పలికి యా చేరువనున్న దక్షిణగోకర్ణేశ్వరునికి తుది మ్రొక్కు చెల్లించుట కేఁగెను; శంఖచూడుని తల్లియు నతని వెంట నంటెను.

జీమూతవాహనుఁ డప్పుడు తన కోరిక నెఱవేఱుటకుఁ దగిన యుపాయ మేమని యాలోచించుచుండఁగా సిద్ధరాజ కంచుకి యెఱ్ఱనివస్త్రములనుపట్టుకొని వచ్చి 'మిత్రావసువుతల్లి అల్లుడుగారికి వీనిని సమర్పింపఁగోరిన' దని చెప్పుచు జీమూతవాహనున కిచ్చెను. జీమూతవాహనుఁడు తనకోరిక నెఱవేఱుట కారక్తవస్త్రము లేఁతయుననుకూలము లని మనస్సులో సంతసించుచు వానిని ధరించి తనకృతజ్ఞతాభివందనములను రాజపత్నికి తెలుపవలెనని కోరుచుఁ గంచుకిని బంపివేసెను. ఇంతలో పెనుగాలి వీవఁగా అది గరుడుని రెక్కలవలన నేర్పడినదే యని

జీమూతవాహనుఁడు నిశ్చయించి, త్వరితముగా వధ్యశిలకడకుఁ బోయి తన్ను గరుడుఁడు పోల్చకుండునట్లు వస్త్రము ముసుగు వేసికొని వధ్యశిలపయిఁ గూరుచుండెను. ఇంతలో గరుడుఁడు వచ్చి వధ్యశిలపైనున్న జీమూతవాహనుని నాగుఁడను భ్రాంతితోఁబట్టుకొని, స్వేచ్ఛగా భుజించుటకు మలయపర్వతము మీఁదికిఁ దీసికొనిపోయెను.

జీమూతవాహనుఁడు నాగులను గరుడుఁడు చంపు ప్రదేశమును జూడఁబోయెననియు, అచటనున్నచో నెట్టి ప్రమాదమయినను సంభవింపవచ్చుననియు సందేహపడి సిద్ధరాజగు విశ్వావసువు జీమూతవాహనుఁడు గృహమునకు వచ్చెనో లేదో కనుగొని రమ్మని సునందునిని జీమూతకేతువు నాశ్రమమునకు పంపెను. ఆశ్రమమున జీమూతకేతువును, అతని రాణియు, మలయవతియు మాత్ర ముండిరి. సునందుని వార్త వలన జీమూతవాహనుఁడు సిద్ధరాజునాశ్రమమున లేఁడని తెలిసి జీమూతకేతువు మున్నగువారు మిగుల కలఁతపడసాగిరి. తన యొడమక న్నదిరినందున జీమూతకేతువు ఎక్కువ దిగులు పడుచుండఁగా ఆకాశమునుండి యొక శిరోభూషణమగు మణి అతనిపాదములదగ్గఱ పడెను. అది జీమూతవాహనుని మణివలె నున్నదని వృద్ధదంపతు లనుమానించుచుండఁగా సునందుఁడు 'మహారాజా! మీ రనావశ్యకముగా కలఁతపడనక్కఱలేదు గరుడుఁడు నాగులను భక్షించునపుడు లెక్కలేని చూడామణు లాకసమునుండి క్రిందఁబడుట కలదు. ఇదియు నట్టిదే యగును సిద్ధరాజుగారితో నేమి చెప్పవలెనో సెలవిండు' అని పలుకఁగా

కనకవతీదేవి 'ఈపాటికి అబ్బాయి అత్తవారింటికి వచ్చియే యుండవచ్చును. నీవు వేగము పోయి చూచి, ఆ సంగతిని మాకుఁ దెలుపుము' అని చెప్పి యతనిని పంపివేసెను.

దక్షిణగోకర్ణేశ్వరునికి తన తుదిమ్రొక్కు చెల్లించి వచ్చిన శంఖచూడుఁడు తనకు బదులుగా జీమూతవాహనుఁడు గరుడుని కాహారమయ్యెనని తెలిసికొని మిగుల విచారించి, తన్ను నిందించుకొని నేలపైఁగల రక్తధార ననుసరించి, నడుచుచు జీమూతకేతువు మున్నగువా రున్నయెడకు వచ్చెను. దుఃఖితుఁడగు శంఖచూడునిఁ జూచి, ఆ పడిపోయిన మణి యతనిదే యై యుండవచ్చునని యచటివారు తలఁచిరి. శంఖచూడుఁడు రాఁగా జీమూతకేతు వీ సమాచారము నడుగఁగా అదితనది కాదనుచు, శంఖచూడుఁ డిట్లు చెప్పెను— 'నేను శంఖచూడుఁడను నాగుఁడను; నాగరాజగు వాసుకి గరుడని కాహారార్థమై నేఁడు నన్నంపెను;—విశేషించి చెప్ప నేల? ఒక మహాత్ముఁడగు విద్యాధరుఁడు నాకు బదులుగా తాను గరుడుని కాహారమయిపోయెను. అతనిని వెదకుటకే రక్తధార ననుసరించి వచ్చుచున్నాను' అని. జీమూతకేతు వీ మాటలు విని 'పరోపకారపరాయణుఁడగు విద్యాధరుఁడు జీమూతవాహనుఁడు తప్ప వేఱెవ్వ రున్నారు?' అని కుమారుని తలఁచి విలపింపసాగెను. కనకవతీ మలయవతులును విలపింప సాగిరి. అప్పుడు శంఖచూడుఁడు వారు జీమూతవాహనుని పితరులయి యుందురనియు, తా నీ దుఃఖవార్త చెప్పి వారి కెక్కువకష్టమును కలిగించితిననియు దుఃఖించి వారి నూఱడింప సాగెను.

వారంతయును జీమూతవాహనుఁడు మరణించెనని నిశ్చయించి తాము అగ్నిప్రవేశము చేయ సంకల్పించిరి. జీమూతకేతు వాహితాగ్ని యగుటచే చితికిఁ గావలసిన యగ్నిని అగ్నిహోత్రగృహమునుండియే తీసికొని రావలసి యుండెను. తాను కారణముగా విద్యాధరచక్రవర్తికుటుంబ మంతయు నశింపనుండుటను శంఖచూడుఁడు మిగుల దుఃఖించియుఁ గొంత ధైర్యము తెచ్చుకొని, 'బాబయ్యగారూ! మీరు తొందరపడి సాహసమునకుఁ గడఁగవలదు. గరుడుఁడొకవేళ తాను భక్షింపఁ దెచ్చినవాఁడు నాగుఁడు కాఁడని తెలిసికొని విడిచినను విడువవచ్చును. మన మందఱము నీ రక్తధార ననుసరించి గరుడుఁ డున్నయెడకే పోవుదము రండు.' అని పలికెను. 'నాకంతటి యదృష్ట మబ్బునా?' అని మలయవతి యనుకొనెను. జీమూతకేతువు 'నాయనా! నీ మాట సత్యమగుఁగాక! అయినను మే మాప్రయత్నము పయి యుండవలెను. నీవు ముందుగా పొమ్ము; మేము నగ్నిహోత్రగృహమునుండి యగ్నిని తీసికొని నీవెనుకనే రాఁగలము' అని పలికి శంఖచూడుని బంపివేసెను.

శంఖచూడుఁడు వచ్చుసరికి గరుడుఁడు జీమూతవాహనుని భక్షించుచుండెను. అతఁడు తన్ను తినుచున్నను జీమూతవాహనుఁడు కొంచెమైనను బాధను సూచించక తృప్తితోడునట్లుగా తనమాంసమును తినవలెనని గరుడునిఁ గోరుచుండెను. ఆ మాటలకు గరుడుఁ డాశ్చర్యపడుచుండెను. ఆ సమయమున శంఖచూడుఁడు పరుగుపరుగున వచ్చి 'అయ్యో! గరుత్మంతుఁడా! ఆగు మాగుము. నీవు పొరపాటున నాగుఁడనకు

నాకు బదులుగా వేఱొకనిని దినుచున్నావు; నాగరాజగు వాసుకిచే నీ కాహారముగాఁ బంపఁబడినవాఁడను నేను; కాన ఆతనిని విడిచి నన్ను భక్షింపుము.' అని యఱచెను. తన యత్నము వ్యర్థమైపోవునేమో యని జీమూతవాహనుఁడు దిగులుపడెను. గరుడుఁడు శంఖచూడుని మాటలకు రిచ్చపడి 'మీ యిరువురికిని వధ్యచిహ్నములు కలవు; ఇందు నాగుఁడెవ్వఁడో నా కెట్లు తెలియును' అని పలుకఁగా 'పక్షిరాజా! నా కంచుకము, రెండు నాలుకలు, ఫణములును నేను నాగుఁడనగుట చెప్పుచుండలేదా? నేను నాగుఁడను; శంఖచూడుఁడను వాఁడను; నీవు భక్షించుచున్నయాతఁడు విద్యాధరచక్రవర్తియు, సహజదయాళువును పరోపకారపరాయణుఁడు నగు జీమూతవాహనుఁడు. కావున నతనిని విడిచి నన్ను భక్షింపుము అని శంఖచూడుఁడు పలికెను. అప్పుడు గరుడుఁడు తా నవాలోచితముగా చేసిన పనికి మిగుల దుఃఖింపసాగెను; తా నొనర్చిన ఘోరపాపమును నశింపఁజేసికొనుట కగ్నిలోఁ బడి యసువులఁ బాయ నిశ్చయించి యగ్నికొఱ కటునిటు చూచుచుండఁగా అగ్నిహస్తుఁడయిన జీమూతకేతువు, అతని భార్యయు, జీమూతవాహనుని భార్య మలయవతియు నతని కగపడిరి. శంఖచూడుఁడును వారిని జూచి 'కుమారా! నీ తలిదండ్రులు వచ్చి'రని జీమూతవాహనునికిఁ దెలిపెను. జీమూతవాహనుఁడు 'అయ్యో! అయ్యో! శంఖచూడా! ఎంతపని జరిగినది! ఇట్టి స్థితిలో వారు నన్ను జూచినచో వెంటనే ప్రాణములు విడువఁగలరు. కావున నా శరీరము వారికిఁ గానరాకుండ వస్త్రముతోఁ

గప్పివేయుము' అని శంఖచూడునితోఁ బల్కఁగా నతఁడట్లే చేసెను. ఇంతలో జీమూతకేతువు మున్నగువా రచటికి వచ్చి దూరమునుండియే జీమూతవాహనుని జూచి దుఃఖింపసాగిరి. ఆ వచ్చిన వృద్ధుఁడు జీమూతవాహనుని తండ్రి యని తెలిసి కొని గరుడుఁడు అంతకుమునుం దతనిదగ్గఱఁగల యగ్ని నడుగఁ దలఁచియు, మొగము చూపఁజాలక వెనుకకు తగ్గి, సముద్ర ములోఁ బడి మరణించి తన పాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్త మును జేసికొనఁదలఁచెను. అది చూచి జీమూతవాహనుఁడు 'వైనతేయా! నీ వీ ప్రయత్నమును మానుము. మరణమువలన నీపాపములు నశింపఁజాలవు'అని పలుకఁగా'అయిన, నేమి చేయు మందువో చెప్పుము' అని గరుడుఁ డడిగెను. 'చెప్పెదను; క్షణ మాగుము, నా జననీజనకులు వచ్చి యున్నారు. వారికి నా కడసారి నమస్కారము నర్పించి చెప్పెదను' అని జీమూతవాహ నుఁడు తన్నుజూచి పరిపరివిధముల వాపోవుచున్న జననీజనకు లను సాంత్వనవచనముల నూరడించి, గరుడుని నిందించుచున్న తల్లిని వారించి పిదప జీవహింస మానునట్లును, చేసిన ప్రాణివ ధకు పశ్చాత్తాపము నొందునట్లును, ఇఁకమీఁద ప్రాణులకు ఉపకారము చేయఁ బ్రయత్నించునట్లును గరుడునిచే నొప్పిం చెను. అట్లొనరించినపుడే పాపములకు నిష్కృతి కలుగునని గరుడుఁడు నమ్మున ట్లొనర్చెను. పిదప జీమూతవాహనుఁడు తలిదండ్రులకు నమస్కరింపఁగా జేతులు జోడింపఁదలఁచియు, నట్లు చేయ సాధ్యముగాక నిశ్శక్తుఁడయి నేలపైఁబడిపోయెను. అచటనున్నవా రందఱును గోలుగోలుమని యేడ్చిరి. ఏమి చేయుటకును గరుడునికిఁ బాలుపోలేదు. అప్పుడు జీమూతవా

హానుని తల్లి 'ఓదిక్పతులారా అమృతమును కురిపించిరైన నా కుమారుని బ్రతికింపరాదా?' అని మొఱవెట్టగా గరుత్మంతుఁడు 'ఆఁ! మంచి యుపాయమే తట్టినది; స్వర్గమున కరిగి యమృతమును దెచ్చి యీతనిని బ్రతికించెదను; ఒకవేళ ఇంద్రాది దేవత లడ్డుపడినను వారినందఱిని నిమిషములో నిర్జింపఁగలను' అని స్వర్గమున కెగిరెను.

అంతలో జీమూతకేతువు నాజ్ఞ ననుసరించి శంఖచూడుఁడు చితిని కల్పింపఁగా అందఱు నగ్నిప్రవేశ మొనర్ప సిద్ధముగా నుండిరి. అప్పుడు మలయవతి చేతులు జోడించి గౌరి నుద్దేశించి 'అమ్మా! జగజ్జననీ! విద్యాధరచక్రవర్తి నీకు భర్త కాఁగలఁడని వర మిచ్చితివే! నీమాటయు పొల్లయ్యెనా! తల్లీ!' అని పలుకుచుండఁగా గౌరీదేవి ప్రత్యక్షమయ్యెను; అందఱు నాశ్చర్యమగ్నులైరి. దేవి 'రాజా! సాహసము వలదు' అని జీమూతకేతువుతో పల్కి, 'అమ్మాయీ! నా మాట వ్యర్థమగు ననుకొంటివా? పిచ్చితల్లీ!' అని మలయవతితో పల్కుచు తన కమండలువులోని నీటిని జీమూతవాహనునిపయిఁ జల్లఁగా నతఁ డక్షతశరీరుఁడై నిద్రనుండి లేచినట్లు లేచి యచ్చెరువంది గౌరీదేవికి సాష్టాంగనమస్కార మొనర్చెను. అప్పుడచ్చటి వారి కందఱికిని మిగుల నాశ్చర్యము కలుగునట్లుగా ఆకాశము నుండి అమృతవర్షము కురిసెను. గరుడుఁడు స్వర్గమునుండి యమృతమును తెచ్చి జీమూతవాహనుని బ్రతికించుటకొఱకు దానిని గగనమునుండియే క్రిందికి విడిచెనని గౌరీదేవి తెలియఁ జేసెను. జీమూతవాహనుఁ డిదివఱకే బ్రతుకుటచే అతని

కా యమృతవర్ష ముపయుక్తము కాకపోయినను అది నాగుల
యెముకల ప్రోవులపైఁ బడుటచేఁ జచ్చిన పాములు కోట్లకొలఁది
మరల జీవించి కృతజ్ఞతను సూచించు దృష్టులతో పాతాళము
నకుఁ బోయినవి. ఆ పరిణామమునకు మిగిలినవారితోఁ బాటు
గరుడుఁడున్ను మిక్కిలి సంతసించెను. గౌరిదేవి జీమూతవా
హనుని దీవించి యంతర్హిత యయ్యెను. శంఖచూడుఁడు
పెద్దలసెలవుపొంది తల్లియొద్దకుఁబోయెను. జీమూతకేతువు
మున్నగువారు తమ యాశ్రమమున కేఁగిరి. పిదప జీమూత
వాహనుఁడు మలయవతితో సుఖముగఁ గాలము గడుపుచు
పితరులను సేవించుచుండెను.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ముగ్గురుమూర్తులు | ... | 2 | 8 |
| పుణ్యశ్లోకులు | ... | 0 | 8 |
| పంచతంత్ర - హితోపదేశ కథామంజరి | ... | 1 | 12 |
| సంస్కృతనాటకకథలు 1, 2 భాగములు | ... | 2 | 0 |
| తిలకుసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 0 | 10 |
| డిటో మూఁడవభాగము | ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| భోజునికథలు | ... | 1 | 4 |
| రాజశేఖరుఁడు—గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| ఆయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్క-పగటిచుక్క-కథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ |
|---|---|
| పంజాబుఅల్లరి ... | 0 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 |
| నీతిరత్నాకరము ... | 0 |
| మర్యాదరామన్నకథలు ... | 0 |
| మైరావణచరిత్ర, చక్కనికథార్పు ... | 0 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్ర చరిత్ర ... | 0 |
| శకుంతల చరిత్ర ... | 0 |
| నల ,, ... | 0 |
| సావిత్రి ,, ... | 0 |
| హరిశ్చంద్ర ,, ... | 0 |
| సీతారామము ... | 2 |
| సుజనరంజని, నవల ... | 1 |
| విజ్జలదేవి, నవల ... | 2 |
| ఉన్మాదిని ,, ... | 0 |
| రాధారాణి ,, ... | 0 |
| దుర్గేశనందిని ,, ... | 1 |
| లక్షణ, నవల ... | 1 |
| లీల ,, ... | 0 |
| కోవలన్ కన్నకి ... | 0 |
| హీరబాల, నవల ... | 0 |
| ఆనందమఠ, నవల ... | 1 |
| లాలాబాయి, నవల ... | 0 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల ... | 0 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) ... | 4 |
| దేశభక్తుడు ... | 1 |
| శంభుతో నొకనాటిసహవాసము ... | 0 |
| జీవిత రహస్యములు - ఇతర కథలు ... | 1 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.